# అనన్తోపనిషత్తు

(భావార్థములు వివరములతో సహా)


అనువాదకుడు

మరియు

వివరముల సంకలనకర్త

**మంత చిన్నయ్య**

ఎమ్.ఏ., బి.యిడి.

పరిపూర్ణప్రబోధ గ్రంథమాల-2

ఓం

శ్రీ గురుభ్యోనమః



## అనంత దర్శనము

# అనన్తోపనిషత్తు

(భావార్థములు వివరములతో సహా)

అనువాదకుడు

మరియు

వివరముల సంకలనకర్త

**మంత చిన్నయ్య**

ఎమ్.ఏ., బి.యిడి.

2002

శ్రీశ్రీశ్రీ శివరామ దీక్షిత గురూపపీఠము

శ్రీ గురుభ్యోనమః

# అభిప్రాయము

సమాజమున మానవులు భోగి, యోగి, జోగి మరియు రోగి రూపమున నుందురు. వీరిలో అధికులు భోగము (సుఖము) నకు సంబంధమైన కర్మలు చేయుచుందురు. యోగమునకు సంబంధించువారు చాల అరుదు. భోగము రెండు విధములుగా విభజించబడినది. ఒకటి, దేహ సంబంధము కాగా మరియొకటి మనస్సుకు సంబంధించినది.

దేహభోగము స్థూల శరీర రూపమున వ్యక్తమగును. మనోసంబంధమైనది సూక్ష్మ శరీర రూపమున అవ్యక్తముగా నుండును. ఇచ్చట మానవుడు జన్మించినది కేవలము భోగము (సుఖము) కొరకే గాక, యోగమునకు కూడయని తలంచవలెను. పాంచభౌతికమైన స్థూల శరీరము పంచవింశతి తత్వములతో (25) కూడియుండగ సూక్ష్మ శరీరము పదిహేడు తత్త్వములతో కూడి యుండును. దేహము లోపల నేను యను మనస్సు, పంచజ్ఞానేంద్రియముల ద్వారా విషయములను గ్రహించి, కర్మేంద్రియముల ద్వారా ఆయా వస్తువుల సంగ్రహించి, వాటి యందు శాశ్వత సుఖము కలదని భ్రమకు లోనగును. ఇది సరియైనది కాదు. అందులకే ఇంద్రియాదులకు విషయాదులు ఆహారమను నానుడి గలదు. అదిఎట్లనగా, చక్షురేంద్రియమునకు రూపము, శ్రోత్రేంద్రియమునకు శబ్దము, ఘ్రాణేంద్రియమునకు గంధము, జిహ్వేంద్రియమునకు రసము మరియు త్వక్కేంద్రియమునకు స్పర్శ విషయముగా కలదు.

భగవద్గీతలో **"నహికశ్చిత్ క్షణమాపిజాతుం"**, యని తెలిపిన ప్రకారము, ప్రతి ప్రాణి, ఒక నిమిషము కూడ కర్మచేయకుండ యుండలేదు. అజ్ఞానులు, స్వార్ధపూరితమైన కర్మలను ప్రవృత్తి మార్గమున చేయుచుందురు. కాని ఆత్మ జ్ఞానము (నిజమైనది) కల్గినవారు స్వార్ధరహితమైన కర్మలను (సత్కర్మలు) నివృత్తి మార్గమున కర్తృత్వరహితముగా చేయుచుందురు.

నిజ గురు ప్రబోధలో సూచనలకంటె ఆచరణకే యధిక ప్రాముఖ్యము యిచ్చినారు. అనగా మంత్రోపదేశమే కాక, ఆచరణోపదేశము పొందిన వానికి పరిపూర్ణ ప్రబోధయందు, యారూఢత కల్గును.

ఈ గ్రంథకర్తయైన అ.ప. మంతచిన్నయ గారు, అనంతోపనిషత్తు యందుగల శ్లోకముల లోని పదములకు సూక్ష్మమైన అర్థములను తన భావనారూపములో బంధించినారు. అర్జునుడు విలు విద్యయందు, కుడి యెడమ భేదము లేకుండ బాణప్రయోగము చేసి, సవ్యసాచి యనబడినట్లె, శ్లోకార్థములను (భావనలు) విశ్లేషముగా విభజించినప్పటికి, పరిపూర్ణ భావమునకు భంగము కలుగనీయలేదు. ఈ కృషికై యెంతయో శ్రమించి, యోగఃకర్మసుకౌశలము యన్నట్లు తన నేర్పరితనమును సఫలముగావించుకొన్నారు. కావున ఈ గ్రంథము గురు సూచన కల్గిన వారికి, బోధదృఢత్వమునకై దోహదకారి కాగలదని మా విశ్వాసము. ఎందుకనగా అందు, సమయ సందర్భానుసారము, పెద్దలైన శ్రీ శంకరాచార్యులు, వేమన, భగవద్గీత, గురుగీత మరియు శుద్ధనిర్గుణతత్వకందార్థములను విరివిగా యుపయోగించినారు. పాఠకులకు కొంతవరకు చర్వితచర్వణ మని తోచినను యది చిన్ని బాలురకు మాట వచ్చుటకై పదములను వల్లె వేసినట్లు, పాఠకులకు, పరిపూర్ణమెరుక ఎట్టిదో, స్పష్టతతో పాటు, యారూఢత కలుగ గలదు. ఇకముందు గూడ యిట్టి ఆధ్యాత్మిక విషయ ప్రకటనలు గ్రంథస్థము చేయుటకు మద్గురుమూర్తి వారికి సంపూర్ణ ఆయురారోగ్యములు ప్రసాందించుగాక.

20-8-2001

శ్రీశ్రీ శివరామదీక్షిత గురూప పీఠము,

రాజేంద్రనగర్, మహబూబ్‌నగర్.

ఇట్లు

**ప్రబోధానంద వెంకటార్యులు**

ఓం

శ్రీగురుభ్యోనమః

శ్రీమదచలర్షి సాం(ప్రదాయిక బృహద్వాశిష్ట సిద్ధాంత రామదుగు
శ్రీ శివరామదీక్షిత గురూపపీఠ రాజయోగా(శ్రమము మహబూబ్‌నగర్.



# శ్రీ ప్రబోధానంద వెంకటార్య రాజయోగి

రాజేంద్రనగర్, మహబూబ్‌నగర్.

శ్లో॥ పరిపూర్ణానంద నర్సింహార్య పాదకమల సేవకం ।
ప్రబోధానంద వెంకటార్య సద్గురుం భజామ్యహం ॥

**డా॥ బుక్కాబాలస్వామి**
ఎం.ఏ., పిహెచ్.డి.(తె).,
ఎం.ఏ.(సం.)
రీడరు, తెలుగుశాఖ,
ఎం.వి.ఎస్. ప్రభుత్వ డిగ్రీకళాశాల,
మహబూబ్‌నగర్.

# "అనంతోపనిషత్తు" తత్త్వనివేదనం

ఉపనిషత్తులు భారతీయుల సుధీవిశేషానికి ప్రతీకలు. మానవుల ఆధ్యాత్మిక జ్ఞానానికి సోపానాలు. ఇవి బ్రహ్మవిద్యాద్యోతకాలు. ముముక్షువుల అవిద్యను నాశనంచేసి, బ్రహ్మప్రాప్తినికలిగించి, దుఃఖములను శిథిలంచేసేవి. ఉప=వ్యవధానం లేకుండా, ని=సంపూర్ణంగా, షద్= జ్ఞానప్రాప్తిని కలిగించేవి. దేశకాల వస్తు పరిచ్ఛేదం లేకుండా బ్రహ్మ జ్ఞానాన్ని బోధించేవని అర్థం.

ముక్తికోపనిషత్తు ప్రకారం మొత్తం ఉపనిషత్తులు 108. ఉపనిషత్ వాక్యమహాకోశంలో ఉపనిషత్తుల సంఖ్య 223 వరకు పెరిగి, మూల ఉపనిషత్తులు ఎన్నో నిర్ణయించుట కష్టంగా మారింది.

"ఈశకేన కఠ ప్రశ్నముండ మాండూక్య తైత్తిరిః
ఐతరేయంచ ఛాందోగ్యం బృహదారణ్యకం దశ" (ము.ఉ.)

ఈ పది ఉపనిషత్తులే ప్రాచీనమైనవని, ప్రామాణికమైనవని అంగీకరింపబడినవి. శంకరాచార్యుడు ఈ పదింటికే భాష్యంవ్రాసాడు. ఇవిగాక కౌషీతకి, శ్వేతాశ్వతర, మైత్రాయిణి అనే మూడు ఉపనిషత్తులు కూడ ప్రామాణికమైనవిగా అంగీకరింపబడినవి. శంకరుడు కౌషీతకి, శ్వేతాశ్వతరోపనిషత్తులను పేర్కొన్నాడు. కాని భాష్యం వ్రాయలేదు. ఈ త్రయోదశ ఉపనిషత్తులే ప్రాచీన వేదాంత తత్త్వప్రతిపాదకాలైనవి. ఇతర ఉపనిషత్తులన్నీ ధార్మిక సంప్రదాయాలు పెరిగే కొద్దీ ఆయా మత సంప్రదాయాల సమర్థన కొరకు పుట్టినవి మాత్రమే. అట్లు పుట్టిన వాటిలో శైవ, వైష్ణవ, శాక్త, యోగ విషయక ఉపనిషత్తులు ఉన్నవి.

విద్యలు రెండు విధాలని వేదాంతుల అభిప్రాయం. పర, అపరవిద్యలు. వీటిలో పరావిద్య శ్రేష్ఠమైనది. దానికే బ్రహ్మ విద్య అని పేరు. ఈ పరావిద్యను ప్రతిపాదించేవి ఉపనిషత్తులు. ప్రకృతి, పురుష, పరమాత్మల వివేచన ఉపనిషద్గ్రంథాలలో ప్రతిపాదింపబడిన ప్రధాన విషయం. మూల తత్త్వమైన ప్రకృతినుంచి ప్రపంచం యొక్క అస్తిత్వమేర్పడింది. పరమాత్మ నిత్యమైంది పురాతనమైంది. శాశ్వతమైంది. జన్మమృత్యు రహితమైంది. పాలల్లో వెన్న వ్యాపించి వున్నట్లుగా ప్రపంచంలో పరమాత్మవ్యాపించి వున్నది. అగ్ని నుంచి స్ఫులింగాలు పుట్టినట్లుగా ఆపరమాత్మనుంచి జీవులు ఉద్భవిస్తారు. ఈ విధంగా ఉపనిషత్తుల్లో ప్రతిపాదింపబడిన ఆధ్యాత్మిక విషయాలే తర్వాత వివిధ దర్శనాలుగా వికాసం చెందినవి. బ్రహ్మ, జీవులకు వుండే సంబంధాన్ని నిర్ణయించటంలో ఈ దర్శనాలు విభిన్న అభిప్రాయాలను వెలిబుచ్చి భిన్నత్వాన్ని పొంది స్వతంత్ర తత్త్వశాస్త్రాలుగా వికసించినవి.

ఆత్మతత్త్వవివేచనతో బ్రహ్మతత్త్వవివేచన చేయు ఉపనిషద్విషయ వాహినీ పరంపరలో 1) గురువాక్యోపనిషత్తు 2) అనంతోపనిషత్తు 3) సర్వసారపూర్ణోపనిషత్తులు ఆణిముత్యాలు. "అచలపరిపూర్ణ బోధ" అనుసిద్ధాంతము భూమికగా ఈ మూడు ఉపనిషత్తులను సవివరముగా జ్ఞానులకు అందించుటకు శ్రీ చిన్నయ్య గారు కంకణ బద్ధులైనారు. అభినవ దీక్షితసరసకవి కడవేటి నరసారెడ్డిగారి ఉపనిషత్రయ అనువాదము, పరిపూర్ణ దర్శనాచార్య శ్రీ యిలపకుర్తి వీరవెంకటరామచంద్రరావు దేశికుల రచనలు, శ్రీ కృష్ణదేశికేంద్రులవారి శుద్ధనిర్గుణ తత్త్వకందార్థములను, అవధూత గీత, వసిష్టగీత, వివేకచూడామణిమున్నగు రచనల ఆధారంగా ఈ మూడు ఉపనిషత్తులను సంకలనం చేసారు. పరిపూర్ణ బోధవల్ల జన్మరాహిత్యము చేకూరునని, అదే మోక్షమని ఈ విషయమునే అనంతోపనిషత్తు, సర్వసార పూర్ణోపనిషత్తులు వివరించుచున్నవని తెలిపినారు. ప్రథమ విజ్ఞాన పుష్పంగా సప్త శ్లోకములతో పరిమితమైన "గురువాక్యోపనిషత్తు"ను లోకానికి అందించినారు. ద్వితీయవిజ్ఞాన పుష్పంగా "అనంతోపనిషత్తు" ను సవివరముగా సంకలనము చేసి గహనమైన ఆధ్యాత్మికవిషయాన్ని ఎంతో రమ్యంగా, సౌమ్యంగా గ్రంథస్థము చేసి తాత్త్విక చింతనతో పాఠకుల గుండెలను స్పందింపజేసారు. 'అనంతోపనిషత్తులో 41 శ్లోకములలో యిమిడి వున్న బ్రహ్మపదార్థతత్త్వ వివేచనను కదునేర్పుతో, ఓర్పుతో వివరించినారు. విషయవివరణ, భావస్పష్టీకరణ, ఔచిత్యవంతంగా, హృదయానందదాయకంగా ఉండి వేదాంతంపట్ల, ఆధ్యాత్మిక చింతనపట్ల ఎటువంటి వారికైనా అభిరుచి కలిగిస్తుందనుటలో విప్రతిపత్తిలేదు.

"వైరాగ్యబోధౌ పురుషస్యపక్షివత్
పక్షౌవిజానీహి విచక్షణత్వమ్
విముక్తి సౌధాగ్రలతాధిరోహణమ్
తాభ్యాంనా నాన్యతరేణ సిద్ధ్యతి" (వివేకచూడామణి)

పక్షికి ఆకాశమునకు ఎగురుటకు రెండు రెక్కలు ఎట్లు ఆధారమో మోక్ష సౌధాగ్రమును జేరుటకు ముముక్షువునకు విషయవైరాగ్యము, ఆత్మజ్ఞానము అను రెండును ఆధారములు. ఈ రెండింటిలో ఏది లోపించినను మోక్షము సిద్ధింపదు.

"ఏష సర్వేషు భూతేషు గూఢో ఆత్మా నప్రకాశతే
దృశ్యతేత్వ గ్ర్యయాబుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మ దర్శిభిః (కఠోపనిషత్తు)

సర్వభూతాలలో నిగూఢంగా వున్న ఆత్మ (అందరికీ) ప్రకటితం కాదు. ఎవరు నిశితమైన సూక్ష్మ బుద్ధితో సూక్ష్మసత్యాలను అన్వేషిస్తారో వారిచేతనే దర్శింపబడుతుంది.

ఈ బ్రహ్మతత్త్వాన్ని జీర్ణించుకున్న మాన్యమిత్రులు శ్రీ మంత చిన్నయ్య గారు 'అనంతోపనిషత్తు' తోపాటు 68 శ్లోకాల పరిమితమైన "సర్వసారపూర్ణోపనిషత్తు" ను కూడా సర్వంకషంగా తీర్చిదిద్ది తృతీయవిజ్ఞాన పుష్పంగా అందించడానికి భగీరథ ప్రయత్నం చేస్తారని ఆశించుచున్నాను. ఆధ్యాత్మిక రచనల ద్వారా వేదాంత విజ్ఞానామృతాన్ని బ్రహ్మతత్త్వ జిజ్ఞాసువులకు, భావితరాల వారికి పంచడానికి పరాత్పరుడు శ్రీ మంత చిన్నయ్య గారికి సంపూర్ణ ఆయురారోగ్య

సుఖసౌభాగ్యములను ప్రసాదించుటకు త్రికరణ శుద్ధిగా ప్రార్థించుచున్నాను. "నహి జ్ఞానేన సదృశం పవిత్రమిహవిద్యతే" (జ్ఞానముకంటే పవిత్రమైనది లేదు) "జ్ఞానాదేవతు కైవల్యమ్". (కైవల్యము జ్ఞానము చేతనే సిద్ధించును)


ఇట్లు

బ్రహ్మ తత్త్వ జిజ్ఞాసువు

**బి. బాలస్వామి**

రీడర్, తెలుగు శాఖ)

ఎం.వి.ఎస్. ప్రభుత్వ డిగ్రీ కళాశాల, మహబూబ్‌నగర్.

శ్రీ వృషనామ సంవత్సర భాద్రపద
బహుళ అమావాస్య (మహాలయ అమావాస్య)
తేది 17-09-2001
శ్రీవాణీ గిరిజానికేతన్
ఇ.నెం. 7-14, శ్రీనివాస కాలనీ,
మహబూబ్‌నగర్ - 509 002. ఫోన్ : 270668.


## అనన్తోపనిషత్తు

గ్రంథ ముద్రణ దాతలు

| | | |
|---|---|---|
| 1. | గురునిధి నుండి | 1000-00 |
| 2. | అ.ప. లక్ష్మి, వెంకటేశము | 1100-00 |
| 3. | అ.ప. నర్సయ్య | 1116-00 |
| 4. | శ్రీ గుబ్బ నారాయణ | 500-00 |
| 5. | శ్రీమతి రామలక్ష్మమ్మ | 500-00 |
| 6. | శ్రీమతి రత్నమాల | 500-00 |
| 7. | శ్రీ విజయ కుమార్ జి. | 535-00 |
| 8. | శ్రీ నందిప్యాట చంద్రమౌళి | 500-00 |
| 9. | శ్రీ చెన్న కిష్టయ్య | 500-00 |
| 10. | శ్రీ బాలకిష్టయ్య | 500-00 |
| 11. | శ్రీ లక్ష్మి నారాయణ | 500-00 |
| 12. | శ్రీ పి. రామచంద్రయ్య. O.U. | 116-00 |
| 13. | అ.ప. పురం నర్సింహులు | 500-00 |
| 14. | శ్రీ మారెపల్లె తోట హన్మంతు | 250-00 |
| 15. | శ్రీ చికినే రాజేంద్ర కుమార్ | 120-00 |
| 16. | అ.ప. భారతీ, జయరాం | 100-00 |
| 17. | శ్రీ పెరుమాళ్ల నర్సింహ్మారెడ్డి | 150-00 |
| 18. | శ్రీ శమంతక రైస్‌మిల్ | 300-00 |
| 19. | శ్రీ. మంతటి ఎల్లప్ప | 1000-00 |
| 20. | అ.ప. యం. అంజమ్మ, రాములు | 1000-00 |
| 21. | శ్రీ కనికె హన్మంతు | 500-00 |
| 22. | శ్రీ పుల్లి పుల్లయ్య | 500-00 |
| 23. | అ.ప. తుపాకుల యాదమ్మ, జంగయ్య | 516-00 |
| 24. | అ.ప. లక్ష్మి, రాములు | 116-00 |
| 25. | అ.ప. లక్ష్మమ్మ, బలరామ్ | 116-00 |
| 26. | అ.ప. సువర్ణ, శ్రీనివాస్ | 116-00 |
| 27. | శ్రీ మాచెర్ల లింగం | 1000-00 |
| 28. | డా॥ కె. అరవింద్ | 1000-00 |

శ్రీ గురుభ్యోనమః

# అనస్తోపనిషత్తు

## శ్లోకానుక్రమణిక

శ్రీ గురుభ్యోన్నమః
" అనంత దర్శనము"

# అనంతోపనిషత్తు

## ఉపనిషద్భాషణము

పరిపూర్ణ భావజ్ఞులు, దీక్షితీయ సిద్ధాంత ధర్మమర్మ జ్ఞాన సంపన్నులు, గురుచరణ సేవా తత్పరులు అ॥ప॥ మంత చిన్నయ్య గారు, ఎం.ఎ.బి.యిడి, విశ్రాంత ఉన్నత కళాశాలో పన్యాసకులు (Retired Junior Lecturer) భావ పుష్టితో కూర్చి వ్యాఖ్యానించిన అనంతో పనిషత్తు, సర్వసారపూర్ణోపనిషత్తులు, పరిపూర్ణబోధనాచార్య, అమలానంద శ్రీ పాటల పండరీనాథస్వాముల స్వల్ప శారీరక యస్వస్థతా కారణాల వల్ల, పై ఉపనిషత్ ద్వయమునకు భావార్థరూప వ్యాఖ్యానముల పరిశీలించి మదభిప్రాయమును త్వరలో వెల్లడించి, అందజేయమని స్వాములవారు నాకాదేశించినారు. ఉపనిషత్ వ్యాఖ్యాన పరిశీలనమంత తేలికైన కార్యం కానందువల్లనూ, కొంత సాంసారిక కార్యకలాప వ్యగ్రతకు గుఱియైనందువల్లనూ పరిశీలనాభిప్రాయమును వెల్లడించుటలో జాప్యమయినది. గురుదేవులు నాకప్పగించిన పని సత్వరంగా నెరవేర్చలేకపోయినాను. ఇందులకు నేను క్షంతవ్యుడను.

ఉపనిషత్ వ్యాఖ్యానం బహు శ్రావ్యంగా సాగినది. శ్లోక వివరణవ్యాఖ్య పూర్ణభావ సమన్వితమై సాంప్రదాయబద్ధమై చదువరుల మనోఫలకము పై చిరుతర అర్థ భావ ముద్ర వేయుచున్నది. అనంతోపనిషద్వ్యాఖ్యాన పీఠికలో వ్యాఖ్యాత " మానవుడు–జీవితలక్ష్యము" అన్న శీర్షిక యందు మానవజన్మ శ్రేష్ఠత్వమును తెలియజేస్తూ మానవునకు వెన్నెముక నిటారుగా నుండుట వల్ల మానవశరీర మందలి బ్రహ్మరంధ్రము, హృదయమము ఒకే సరళ రేఖ యందుండుట వల్ల పరమాత్మ ప్రకాశము తిన్నగా మానవుని అంతఃకరణమున ప్రవేశించుట కవకాశముండుట వల్ల మానవుని బుద్ధి వికాసం చెంది తన్ను తాను తెలుసుకోవడంతో ఆపక తనకు పరోక్షంగా వున్న గురు గోప్యమనదగు అచలపరిపూర్ణ పరబాహ్యమును గురు ముఖతః అపరోక్షంగావించుకొని జన్మ రహితసిద్ధిని బొందు భాగ్యము ఒక్క మానవోపాధికి మాత్రం గలదని, ఇతర ప్రాణి కోటికి భగవత్సృష్టిలో ఈ అవకాశం అనుగ్రహింపబడలేదని విశదీకదించినారు. ఇది మిక్కిలి సమంజసమైయున్నది. అయిననూ, ఇంకనూ విజ్ఞాన దృష్టి తో (Scientific view) పరిశీలిస్తే మానవ కపాలంలోని మెదడు (Brain) అసంఖ్యాకములగు ధాతువులతో (Tissue cells) అనగా లక్షలకొలది ధాతువులతో నిర్మింపబడి, నిరంతర ధాతు చలనము కలిగి వుండును. ఈ నిరంతర ధాతు చలనం వల్ల మెదడులోని "సైకిక్ సెంటర్సు" (మనోకేంద్రకములు)నుండి మనోభావాలకు చలనం కలుగుతుంది. అందువల్ల మెదడులోని మోటార్ సెంటర్సు (ప్రవర్తన నాడీ కేంద్రకములు) నుండి శరీరంలోని పంచేంద్రియాలకు చలనం వలన కలిగిన జ్ఞానం చేత యీ పని చేయి, ఆ పని చేయకు అన్న విచక్షణా జ్ఞాన చలనం కలుగుతుంది. ఈ రెండు సెంటర్సు (1) సైకిక్‌సెంటర్సు (2) మోటారు సెంటర్సు, మనిషి మెదడులో అభివృద్ధి చెందినంతగా, యితర ఏ ప్రాణి కోటిలోనూ చెందలేదు. వీటిలో ఒక పరిమితి వరకే అభివృద్ధి చెందాయి. అందువల్ల జంతు సమూదాయంలో మనిషి లాగ బాధ్యతలోనూ, సంపూర్ణ ఆలోచనా సరళిలోనూ, విజ్ఞతలోనూ, పరిపూర్ణ జ్ఞాన వికాసంలోనూ, నవి వ్యవహరించలేవని విజ్ఞాన శాస్త్రం (Science) "దుర్లభం మానుషం దేహం, వివేక

మతిదుర్లభం" అనియూ, "జంతూనాం నరజన్మ దుర్లభం" అన్న వేదాంత శాస్త్ర విజ్ఞానంతో ఏకీభవించుచున్నది. ఇట్టి సర్వసంపూర్ణ మానసిక వికాసం కల్గిన మానవోపాధికే అచలపరిపూర్ణప్రబోధ అవశ్యమైయున్నది. అందుకే శ్రీ కృష్ణదేశిక ప్రభువులు తమ శుద్ధ నిర్గుణతత్వ కందార్థదర్వులో సభా విజ్ఞాపన అను శీర్షిక యందు ప్రథమ పద్యము.

**"జనులార జనన మరణము లను దొలగన్(ద్రోయుజాలు లక్షణయుతమై। వినువారికి కనువారికి। తనలా వెరిగంచుదీని। తప్పక వింటే। అప్పుడె వారలెప్పుడూగంటే! కనుకావిన బుద్దై తె వినుడీ జదివెద మీకె కనుగొన మనసైతే కనుడీ పుస్తకమంత !"**

అని జననమరణరాహిత్య సిద్ధిని అనుగ్రహించు పరిపూర్ణ ప్రబోధను వినుమని జనులార! అని మావవోపాధిని ఉద్దేశించి సంబోధించుచున్నారు. మానవ జన్మ విశిష్ఠత అనన్య సామాన్యమైనది. కావున గురుసన్నిధి నాశ్రయించి మానవ జన్మను సఫలం చేసుకోవడం మానవజన్మ ముఖ్య ధర్మమైయున్నది.

**ఇక "అనంతోపనిషత్ " ప్రామాణ్యత గురించి తెలుసుకుందాం.**

ముక్తికోవనిషత్తులో శ్రీరామచంద్రమూర్తి అంజనేయస్వామికి జన్మ తరుణోపాయమునకు 108 ఉపనిషత్తులు ప్రామాణికమని, వాటి నామములను గూడా వివరించి నారు. కానీ అందులో అనంతోపనిషత్తు చేర్చబడలేదు. అష్టోత్తరశతోపనిత్తుల జాబితాలో కన్పట్టని ఈ ఉపనిషత్తులోనే దీక్షితీయ ప్రబోధకు కీలక మంత్రమగు ద్వాదశాక్షరీ మహామంత్ర ప్రస్తావన గావింపబడియున్నది. మొత్తం 1108 ఉపనిషత్తులని పేర్కొనబడు వాటి వివరములు గాని, నామములు గాని ముక్తికోపనిషత్తులో యివ్వబడలేదు.

వ్యాఖ్యానకర్త తమ పీఠికలో " అనంతోపనిషత్తు నామకరణము" అన్న శీర్షికలో యిట్లు నుడివినారు. 43వ కందార్థదర్వులో శ్రీ కృష్ణదేశికులు " పరమపదమనిన బయలన। గురుగుహ్యమనంతమనిన। గోప్యంబనినన్।" అన్న పద్యంలో "అనంతమనినన్" అన్న పద ప్రయోగం చేశారు.కనుకనూ, ద్వాదశీ మంత్రం యిందులో నిక్షిప్తమైయున్నది గనుకనూ ఉపనిషత్తునకు అనంతోపనిషత్తు అను నామధేయం సార్థకమైనదని పేర్కొన్నారు. కానీ ఈ విషయం కొంత లోతుగా ఆలోచిస్తే ఇది కొంతవరకూ సమంజసం అన్న భావన ద్యోతకం కాకమానదు. ఉపనిషత్ నామమునకు పై ఆధార మొక్కటియే చాలదు. ఇందుకు వేద ప్రమాణం అవసరం. దీన్ని వివరంగా తెలుసుకొందాం.

అధర్వణ వేదాంతర్గతమగు **"త్రిపాద్విభూతిమహా నారాయణోపనిషత్తు"** నందు పరిశీలించిన **"త్వమేవ తురీయ తురీయః, త్వమేవ తురీయం తీతః, త్వమేవఅనంతోపనిష ద్విమృగ్యః"** (ప్రథమోధ్యాయః, పూర్వ కాండః, 2వ మంత్రం) అని వర్ణింపబడియున్నది. ఈ మంత్రభావం. "నీవు (పరమాత్మ) నిరతి శయానందుడవు, తురీయ తురీయుడవు, తురీయా తీతుడవు, అనంతోపనిషత్తుచే వెదుకదగిననాడవు" తర్వాత, 4వ మంత్రంలో

"త్వమేవ అనంతోపనిష దర్థ స్వరూపం, అఖిల ప్రమాణాతీతం" అనగా నీవు (పరమాత్మతత్వం) అనంత ఉపనిషదర్థస్వరూపం, అఖిల ప్రమాణా తీతం" అని వ్యక్త పరచబడియున్నది. తర్వాత 7వ మంత్రంలో "అనంతోపనిషదర్థా రామజాల సంకులం నీతత్వం **"అనంతోపనిషదర్థా రామజాల సంకులం"** అని పలుచోట్ల అభివర్ణింపబడియున్నది. అందువల్ల ఈ అనంతోపనిషత్తునకు అధర్వణ వేదాంతర్గత మహానారాయణోపనిషత్తు ప్రామాణ్యత

లభించినందువల్ల ఈ ఉపనిషత్తునకు అనంతోపనిషత్తను పేరు సార్థకమై యలరారు చున్నది.

ఇక ఉపనిషత్తులో నిమిడియున్న ద్వాదశాక్షరీ మహామంత్ర ప్రస్తావన, ఉపనిషత్తునందు 9వ శ్లోకం తర్వాత ద్వాదశాక్షరీ మంత్ర ప్రస్తావన జరిగింది. మంత్రం.

**"అయం వ్యర్థః బాహ్యః కోపీనభవతి"**

**తెలుగు : "ఈ ఉత్త బట్ట బయలు ఏమిలేదు".**

ఈ ద్వాదశాక్షరీ మంత్రం సచ్చిదానంద రూపమగు స్వయం ప్రకాశ బ్రహ్మను (శుద్ధ చైతన్యరూప అఖండ ఎరుకను)నిరసించి అచలపరిపూర్ణపరబాహ్యము యొక్క ఉనికిని సూచించి, అపరోక్షం గావించుచున్నది. ఈ మంత్రమునకు మూలం అధర్వణ వేదమందున్నది. అధర్వణవేద ద్వాదశీ మంత్రం కేవలం ఈశ్వరుడు (పరమాత్మ) ఒక్కడే ఏకరసుడు, పరిపూర్ణుడు అని అద్వైతరీత్యా సిద్ధాంతీకరింపబడియున్నది. ముఖ్యంగా ఈ ఎరుక భ్రాంతి రూప ద్వాదశాక్షరీ మంత్ర నిరసనకే అనంతోపనిషత్ వెలసియున్నది. ఇది అచల ఋషులు దర్శించి, పరిశోధించి, సిద్ధాంతం చేసిన మహత్వ పూర్ణసత్యం. అధర్వణవేద ఎరుకరూప భ్రాంతి మంత్ర దర్శనం నిజ గురుచరణ సన్నిధి, నెరుంగవలసి యున్నది.

ఆపై ద్వాదశీ వివరణం, ప్రతి పదార్థ భావసమన్వితంగా వ్యాఖ్యానించారు వ్యాఖ్యాత. మంత్ర వ్యాఖ్యానం యాజ్ఞవల్క్య, జనక సంవాద గ్రంథమందు నివ్వబడిన వ్యాఖ్యానమే పునరుద్ఘాటింప బడినది. సర్వ సమంజసమైయున్నది.

పై మంత్ర వ్యాఖ్యానమే మరి యొక విధంగా,పరిపూర్ణాచల సూచనను బలపరుస్తూ, సంప్రదాయ బద్ధంగా వ్యాఖ్యానించవచ్చును.

**అయం = ఈ**

**వ్యర్థ బాహ్యః = నిరుపయోగమగు (సృష్టి, స్థితి, లయ, విస్తీర్ణ, ఆకర్షణాది, విశ్వాధార, విశ్వసృష్టి వ్యాపార వివర్జితమగు) బయలునసుండెడి అనగా గోచరించెడి.**

**కః = బ్రహ్మము (ఎరుక)**

**అపి = అయినప్పటికీ**

**నభవతి = లేదు పుట్టలేదు.**

**తా॥ బయలున నుండెడి బ్రహ్మములేదు.**

పై మంత్రమునకు అర్థముగా, శ్రీ కృష్ణదేశిక ప్రభువులు,

"ఇది తప్ప ఏమి లేదని। మొదటిది మొరబెట్టుచుండు ముదమున వినుమా।, ఇది యేమి లేదు పొమ్మని। వదలక రెండోది లెస్స। వదరుచుండునురా। బయలెరుకాల। ఇది నిశ్చయమురా।" అని గానం చేసియున్నారు.శుద్ధ చైతన్యరూప ఎరుక బ్రహ్మమదగనిదే పరిపూర్ణపరబాహ్యం గోచరం కాదు. అచల ప్రబోధ పరంపరాగురువులైన వేమన యోగీంద్రుడు ద్వాదశీ భావాన్నిలా వ్యక్తం చేశాడు.

" రూపడగక జీవ రూపంబుగనరాదు
యట్టిరూపమడగ నలవికాదు
బ్రహ్మమడగకున్న బ్రహ్మంబుగనరాదు
విశ్వదాభిరామ వినురవేమ"

ఎరుక బ్రహ్మమును అణచివేసిన వాడికే పరిపూర్ణ బ్రహ్మము గోచరమగునని వేమన ప్రబోధించుచున్నాడు.

అనంతోపనిషత్ప్రతిపాదితమగు ద్వాదశాక్షరి, మరి నాల్గు విధముల విభాజితమై అవాంతరవాక్య చతుష్టయ ప్రతిపాదితమగు నిర్గుణబ్రహ్మమును నిరసించుచూ, సనాతనాచల పరిపూర్ణ పరబ్రహ్మమును అపరోక్షం గావించును. శుద్ధ చైతన్యరూప బ్రహ్మమునకు అచల పరబాహ్యమందు మూలంగాని, స్థానం గాని లేదని నిరూపణ చేయుచున్నది. ఈ విషయం గురుగోప్యమై సాంప్రదాయ గురుపుంగవుల వ్రాత ప్రతుల యందు నుల్లేఖింపబడి, గురుకృపాపాత్రులకు సుగమ్యమై సుబోధకమై జన్మరాహిత్య సిద్ధిని అనుగ్రహించుచున్నది. కేవలం దేవభాష యగు సంస్కృతమునందు గూడా నాల్గు ద్వాదశుల వివరణము విపులముగా చర్చింపబడియున్నది. అట్లే నాల్గు షోడశులు గూడా సంస్కృత లిపిలోనే పొందు పరుపబడియున్నవి. ద్వాదశాక్షరీమహా మంత్ర నిరూపితమగు అచల సూచనను గూర్చి ఈ క్రింది విధంగా అచల ఋషిపుంగవులచే వక్కాణింపబడియున్నది.

**"అస్య శ్రీ కేవలాత్మ ద్వాదశాక్షరీ మహా మంత్రస్య। అచలఋషిః। అవినాశచ్ఛందః। అభవోదేవతా। అమృతంబీజం। అప్రమేయశక్తిః। అయమాత్మ తత్వ మస్యాది జ్ఞానరహిత మేవ కీలకం। అఖిల కాలేషు పరిపూర్ణ మస్తి। మాయాసహితమేతత్। ప్రపంచాధికంనాస్తీతి నిశ్చయ సిద్ధ్యర్థం। ద్వాదశాక్షరీ మహామంత్రస్య జపంకరిష్యే"**

ఆకాశాధికభూతమగు ఆత్మ లేనిదనీ, పరిపూర్ణ మొక్కటే ఎల్లవేళల ఉన్నదనీ ద్వాదశాక్షరీ మంత్ర నిర్ణయమై యున్నది.

ఇక వ్యాఖ్యత అ॥పు॥మంత చిన్నయ్యగారి వ్యాఖ్యానశైలిని పరిశీలిద్దాం. ఇందలి ప్రతి శ్లోకమునకు వ్యాఖ్య అతివిపులంగానూ, హృదయరంజకంగానూ సరళభాషా శైలిలోనూ, సాంప్రదాయబద్ధంగానూ నలరాలుచున్నది. ఉదాహరణకు ప్రారంభశ్లోకం " అతశ్శివ ఏవసనాతనం" అన్న శ్లోకానికి ప్రతి పదమునకు సంపూర్ణ వివరణతో గూడిన వ్యాఖ్య యివ్వబడినది. పాఠకుల హృదయ మందు హత్తుకొని పోవునట్లు శ్లోక వ్యాఖ్యానం చేయబడినది. వ్యాఖ్యాన కౌశలం గురుకృపాలబ్ధ ప్రసాద మహిమ యని చెప్పక తప్పదు. పాఠకులు గ్రహింతురు గాక.

ఇందులోనే ఎరుకను వదులుట అను ప్రస్తావనలో సమగ్ర, సమంజస వ్యాఖ్య గావించినారు. **"ఎరుక బ్రహ్మమనియె యిల శంకరాచార్యులు"** అన్న వేమన యోగీంద్రుని పద్యమునకు చక్కని అనుభవరూప వివరణగావింపబడినది. సృష్టికి మూలమై, బ్రహ్మజగత్తులుగా, జీవేశ్వరులుగా, సగుణ నిర్గుణాలుగా, సదసత్తులుగా ప్రకాశాప్రకాశాలుగా మొదలగు సర్వద్వంద్వములుగా పరిణమించుచున్న ఎరుకనే బ్రహ్మమని శంకరాచార్యులవారన్నారు. జ్ఞానమే బ్రహ్మమని అనగా గుర్తెరిగే లక్షణమున్న జ్ఞానమునే బ్రహ్మమని వ్యాసులవారన్నారు. అయితే ఎరుకయు, తెలివియు రెండు ఒక్కటే. ఒకటి బ్రహ్మాండాధిష్ఠానమై తెలియజేయును. మరొక్కటి పిండాండగతమై గుర్తెరుగును. రెండొక్క ఎరుకయను ద్రవ్యములోనివే. వేమన ఈ రెంటికతీతుడై తురీయాతీత కర్తృత్వరహిత కైవల్య శరీర ధారియై, గుర్తులేని స్థితి యందున్నాడు అని వేమన అచల సూచనను వ్యాఖ్యానకర్త చక్కగా ఆకళింపు జేసుకొన్నారు. ప్రతి శ్లోక వ్యాఖ్యానాన్ని ప్రస్తావిస్తూ పోతే గ్రంథపరిచయ వ్యాసమే యొక ఉద్గ్రంథమగును. అందుచే గ్రంథవిస్తరణ భీతిచే నా అభిప్రాయ వ్యాసంగమును ముగించుచున్నాను. విజ్ఞులగు చదువరులు ఈ ఉపనిషత్తు వ్యాఖ్యానమును పఠించి, అందలి ప్రబోధనాపూర్వక అచల బోధ ధర్మ మర్మముల సాంగోపాంగముగ అవగాహన చేసుకొని గురుకృపాపాత్రులై తరింతురుగాక!

ఉన్నత భావపుష్టి గలిగి అత్యున్నత దీక్షితీయ సాంప్రదాయ ప్రబోధనా[illegible] గలిగి, ధారా శుద్ధి శోభితమై వచన రచనా సౌశీల్యత గలిగి, చదివినంతనే శ్లోకం యొక్క అర్థభావన పాఠకుల మనో ఫలకం పై, కందళరీతుల జ్ఞాన ప్రభల వెదజల్లు నట్లుగా వ్యాఖ్యానంచేకూర్చి లోకహితం గావించిన గురుకృపా సిద్ధులు, విద్వజ్జన విధేయులు అగు అ॥ప॥ మంత చిన్నయ్య గారి కృషి అభినందనీయము.

వీరికి, యింకనూ లోకోపకార గ్రంథరచనలు, వ్యాఖ్యానములు రచించు భాగ్యము ప్రసాదించి, తత్కార్యమునకు ఆయురారోగ్య సౌభాగ్య యశోపరంపరలను గురుపరమాత్మ అనుగ్రహించుగాక యని గురుపరమాత్మ శ్రీచరణ కమల సరోజములను ప్రార్థిస్తున్నాను.

**ఆ॥తె॥ తేనె సోక నోరు తీయగ నగునట్లు**
**తోడనర్థమెల్ల తోచకుండ**
**గూఢశబ్దములను గూర్చిన కావ్యంబు**
**మూగ చెవిటివారి ముచ్చటగును"**

అన్న కవయిత్రి,మొల్ల రామాయణ గ్రంథకర్త. "మొల్ల" విదుషీమణి మాటల నిట స్మరిద్దాం. అవియేమన, తేనే సోకగానే నోరు తీయగా నగునట్లుగా చదివిన వెంటనే మనస్సునకు రచయిత లేక వ్యాఖ్యాత హృదయ భావము చదువరులకు అవగాహన కావలెను. అట్లుగాక గూఢార్థ శబ్దఝరులతో నిండి యుండు రచనలు మూగ, చెవిటివారి, ముచ్చట్లువలె నిరుపయోగమగును. ప్రజాదరణ పొందజాలదు. అనంతోపనిషత్తు వ్యాఖ్యాన కౌశలంలో, వ్యాఖ్యాత ప్రజా హృదయాన్ని చూరగొనగలరనుటలో సందియములేదు.

శ్రీ శివరామ దీక్షితులవారు బృహద్వాసిష్ఠ గ్రంథమందు పరిపూర్ణమును గూర్చి యిట్లు సెలవిచ్చియున్నారు. **"తడిలేని తీర్థం పొడిలేని ప్రసాదం"** అన్నారు. ( చలాచల వాక్యములు క్రమ సంఖ్య 26,27 పుట 5 (కేవలాత్మ–అచలనామములు) తడి యనగా సృష్టికారణమైన హిరణ్యరేతస్సు, అనగా హిరణ్మయపురుషుడు.పొడి యనగా ఆవరణ రూపమైన విశ్వవృక్షము. పంచాకాశ, పంచతన్మాత్ర, పంచభూతావరణ విశ్వసృష్టి. ఇవి రెండు లేనిది అచల పరిపూర్ణము. అట్లే ఎరుకను గూర్చి దీక్షితులవారు యిట్లు సెలవిచ్చారు.

**" ఎరుకకు ముషిణికాయ మూలం,**
**రావిచెట్టు క్షేత్రము."**

ముషిణి కాయ యనగా విషముష్ఠి కాయ దీనినే శాస్త్రీయముగా NUX VOMICA (నక్సు వామికా) అని అందురు. ఇది పరమ చేదు విషపూరితము. చూడటానికి పండు ఎంతో ఆకర్షణీయమై, వెలగపండువోలె గన్పట్టును. కాని విషమయము. అట్లే ఎరుక మూలము ఆనంద స్వరూపమై బాహ్యమునకు తోచినా, అందు మహావాక్యచతుష్టయ పద్ధతి ననుసరించి ఐక్యత కాంక్షించు వారికి పునర్జన్మను ప్రసాదించి నానా యిడుముల బారి పడవేసి ఘోర సంసారమున పడవేయును.

ఇక రావిచెట్టును అశ్వత్థ వృక్షమని యందు అ = లేనిది, శ్వ=రేపు, శ్వ= అనగా నిరంతర చలనం కలిగి, ఒకప్పుడు సృష్టికి పూర్వము నిర్గుణము అనగా లింగ రూపంగానూ, తదనంతరము విశ్వాకారము దాల్చు చలనత్వ లక్షణం గలిగియున్న ప్రకృతి పురుషరూప అధిష్ఠాన చేతన బ్రహ్మము యొక్క ఆవరణ రూపము.

ఇట్లు పరిపూర్ణ సూచన, ఎరుకనిరసన రెండింటి వివరణ దీక్షితులవారు బృహద్వాసిష్ఠమున ప్రకటపరచియున్నారు. సూత్రప్రాయమైన వాక్యద్వయములో, ఈ వాక్యద్వయములలో మొదటి వాక్యం అచలపరిపూర్ణ సూచన. ఇది అనంతోపనిషత్ ప్రయాణమనుసరించియున్నది. రెండవ వాక్యము (ఎరుకనిరసన) ఇది సర్వసారపూర్ణోపనిషత్తు ప్రామాణికంగా నున్నది. అందుకే పూర్ణబోధ అనుభవ పూరిత సిద్ధాంత బోధ వాదనకొరకు, తర్కవ్యాకరణాది శాస్త్రములకు పట్టుబడదు.

**"విద్యాంతం బ్రహ్మవిద్యాంతం వార్తికాంతమగోచరం**
**పూర్ణ బోధ ప్రవక్ష్యామి శృణుశిష్య మహోత్తమమం"**

అన్న శాస్త్ర ప్రమాణరీత్యా

**విద్యయనగా = 64 కళలతో కూడినది.**

**బ్రహ్మవిద్య =మహా వాక్యచతుష్టయ పద్ధతిగా జీవ బ్రహ్మైక్య సిద్ధిని ప్రతిపాదించు అద్వైత సిద్ధాంతం.**

**వార్తీకము = అవాంతర వాక్యచతుష్టయ రీత్యా కేవలం నిర్గుణ పరమాత్మను (బ్రహ్మను) ప్రతిపాదించుచూ, జీవ బ్రహ్మైక్యమును నిరసించు వార్తీక సిద్ధాంతం.**

**"మహా వాక్యం తదే వోక్తం, జీవబ్రహ్మైక్య బోధకం"**

తా॥ మహావాక్యములు జీవ బ్రహ్మైక్యమును బోధించును. అవాంతర వాక్యములు జీవత్వాన్ని నిరసిస్తూ కేవలం నిర్గుణ బ్రహ్మమును ప్రతిపాదించును. ఐననూ, ఈ రెండు పద్ధతులు భ్రాంతిరూపమే. అచల పరిపూర్ణప్రబోధ అద్వైత, వార్తీక సిద్ధాంతాతీతమై కేవలం నిజగురు కరుణా కటాక్షముల వల్ల మాత్రమే తెలుపబడి జన్మరాహిత్య సిద్ధిని అనుగ్రహించును. ఈ జనన మరణ రాహిత్యము ద్వాదశీ షోడశీ మంత్ర విశేష వివరణ వలన ప్రాప్తించును. ఇట్టి జననమరణరాహిత్యమును ప్రబోధించు అనంత, సర్వసారపూర్ణోపనిషత్తులకు సమగ్ర, సంపూర్ణ వ్యాఖ్యలనందించిన అ॥ప్ర॥ మంత చిన్నయ్యగారు ధన్యులు. ఈ వ్యాఖ్యానం వ్రాయడంలో చిన్నయ్యగారు ఎంతో చక్కగా తనకు గురుకృపాప్రసాద లబ్ధంగా అనుగ్రహింపబడిన అనుభవాన్ని, విజ్ఞతను ఉపయోగించుకున్నారు. చాలా చోట్ల క్లిష్టమైన శ్లోకపదాలను ప్రయోగాలను వివరించేటప్పుడు కోశ, శాస్త్ర లౌకిక వాక్య ప్రమాణాలను కావలసినంత వరకూ ఉదాహరిస్తూ వ్యాఖ్యానం సాగించారు.

**కం॥ గురు ముఖమున బడయక దు**
**ష్కర తపమునజేసి వడయగాబడు విద్యల్**
**పరమార్థము మదమును మ**
**త్సరమును గావించు నెట్టి సాధులకైనన్**

(మహాభారతం ఆరణ్యపర్వం 3 అ॥ 256 పద్యం)

తా॥ గురువుల సేవించి గురుముఖతః విద్యనేర్చి తరించాలి. అట్లుగాక ఇతర అష్టాంగ యోగాదుల వల్లనూ, కఠిన తపస్సుల వల్లను సంపాదించిన విద్య మద, మాత్సర్య గర్వాదులను కలిగించి, పతనముగావించును" అని మహాభారతమున పై పద్యం బోధిస్తున్నది.

చతుర్విధ శుశ్రూషల నాచరించి, నిజగురువుల ప్రసన్నం చేసుకొని, వారి దివ్యానుగ్రహం వల్ల అబ్బిన గురుసత్తా యే శ్రీ మంత చిన్నయ్యగారిని ఈ వ్యాఖ్యాన చర్యకు ప్రోత్సహించి

ఆశీర్వదించి కృతకృత్యుని గావించినదనుట నతిశయోక్తి కానేరదు.
వీరికింకనూ, యిలాంటి ఉపనిషద్వ్యాఖ్యల నందించు శక్తి సామర్థ్యములను, దీర్ఘాయు రారోగ్య శుభపరం పరల ననుగ్రహించుగాక, యని గురు పరమాత్మ పదరాజీవముల స్మరిస్తున్నాను.

**" రస సిద్ధులు సద్గురువులు**
**రాక పోక లేని వారు**
**జరా మరణ భయ విరహిత**
**ధీర రాజ యోగ రతులు".**

**" కాకః కృష్ణః పికః కృష్ణః కోభేధః, పికకాకయోః**
**వసంతకాలే సంప్రాప్తే కాకఃకాకః పికః పికః"**

కాకి, కోకిల రెండు చూడడానికి ఒకే పోలిక, ఒకే నలుపు వర్ణము కలిగి రెండునొక్కటిగానే గుర్తించుటకు వీలులేకుండా నుండును. కానీ వసంతకాలము సమీపించినంత కోకిల కూతల వలన రెంటి బేధము గుర్తించి, కాకి కాకియే కోకిల కోకిలయే యని గుర్తింప కలుగుచున్నాము. అట్లనే ఎరుకా బయలు స్వరూపమే. అచల పరిపూర్ణమూ బయలయియే వుండును. రెంటిబేధము అనగా అది యిది కాదు యిది అదిగాదు, అచలము అచలమే. లేని ఎరుక లేని ఎరుకే యని నిజ గురుకృపయను వసంతకాల సంప్రాప్తమువలన సాధకులకు పూర్ణజ్ఞానము కలిగి భ్రాంతిరహితమవుతున్నది.

**శ్రీరాజయోగి సద్గురు చరణార విందార్పణమస్తు**

అనంతపురం
1.6.2002.

ఇట్లు
**గురుపాదకమల సేవా తత్పరుడు**
**సత్యశోధనాచార్య నిత్యానంద**
**కురుబ సుబ్బారాయుడు**

ఓం

శ్రీ గురుభ్యోనమః

# అనన్తోపనిషత్

# పీఠిక

శ్లో॥ గురుర్బ్రహ్మా గురుర్విష్ణు ర్గురుర్దేవో మహేశ్వరః। గురుస్సాక్షాత్ పరంబ్రహ్మా తస్మైశ్రీ గురవేనమః॥

**శ్లో॥ పరిపూర్ణానందనరసింహార్యపాదకమలసేవకం।**
**ప్రబోధానందవెంకటార్య సద్గురుంభజామ్యహం॥**

**"భ్రాంతి రహితమే మోక్షము"**

**"అంతా పరిపూర్ణపరబ్రహ్మమేయుండగనేనెక్కడ"**

**"నేను లేనప్పుడే అది"**

**1. మానవుడు – జీవిత లక్ష్యము** – భ్రాంతి యుడిగిన బ్రహ్మంబు బట్ట బయలు. తిరిగి జన్మరాకుండుటయే మోక్షము. మానవుడు కర్మబంధమున జిక్కుకొని జనన మరణ రూపమగు ఘోర సంసార సాగరమున మునిగి తేలుచు " జన్మవల్ల కర్మ, కర్మ వల్ల జన్మ" అను న్యాయంగా పుట్టుచు గిట్టుచు, మళ్ళి పుట్టి మళ్ళి చస్తూ నిరంతర జనన మరణ చక్ర భ్రమణమున సంచరిస్తున్నారు. దరిగాన లేక అనేక జన్మలకు గురియగుచున్నారు. "దుర్లభం మానుషం దేహం" అను రీతిగా అనేక జన్మల తర్వాత మానవ జన్మ ప్రాప్తిస్తుందంటారు. అందుకే మనుష్య జన్మ దుర్లభము. ఇట్టి దుర్లభమైన జన్మ లభించినందులకు మానవ జన్మ చరితార్థము చేసుకొనవలసి యుండును. ఎందులకనగా కేవలం మానవ జన్మ యందే మోక్షము సాధ్యము. ఇతర జన్మలందుగాని, దేవాతా జన్మలందుగాని యిది సాధ్యము గాదు. దేవతలకు కర్మ శరీరం లేదు. గనుక "క్షీణే పుణ్యేమర్త్య లోక విశంతి" యను న్యాయముగా వారు జేసిన పుణ్యము క్షీణించగనే ఆ దేవతలు కూడా ఈ భూలోకమున తిరిగి పుట్టవలసినదే. కావున మనుష్య జన్మకు వచ్చినందులకు శ్రీ కృష్ణదేశికేంద్రులవారు సెలవిచ్చినట్లు **క.ప.51. " జ్ఞాన కర్మ స్వరూపముగాని బయల్ నదుగోచూచి । కలకాలము యీ జ్ఞాన కర్మ స్వరూపంబౌ। నిను నీవెరిగి మృషనికని విన వోయీ॥"** అనగా అచల పరిపూర్ణపరబ్రహ్మము జ్ఞాన స్వరూపము, కర్మస్వరూపముగానిది. అదిగో చూడుము. జనన మరణములుగా దోచుచు ఎల్లకాలము జ్ఞాన కర్మ స్వరూపంబగు నిన్ను నీవు తెలుసుకొని, నీ వునికి అబద్ధమని తెలియుటయే నీవు దుర్లభమైన మానవోపాధికి వచ్చి చేయవలసిన పని యని భావము. ఇదే జీవిత లక్ష్యము , ధ్యేయము. ఇట్టి లక్ష్యసాధనకు మానవ జన్మ శ్రేష్ఠమైనది.

**2. మానవ జన్మశ్రేష్ఠత్వము:–** ఇట్టి మోక్ష సాధనకు మానవుని కొన్ని విశిష్ఠ లక్షణములు గలవానిగా సృష్టించుట జరిగినది. జంగమజీవులలో రజోగుణ మందలి ఉత్పత్తియైన యితర జీవుల కంటే మానవ అంతః కరణమున సత్వాది గుణాధిక్యత గలిగి యుండుటవల్ల జ్ఞానము విశేషము. ఈ విశేషజ్ఞానము వల్ల మంచిచెడులను గుర్తించి కర్మ సంస్కారము లుత్పత్తి కాకుండ చేసికొనగలడు.

మానవునకు వెన్నెముక నిటారుగా నుండుట వల్ల మానవ శరీర మందలి బ్రహ్మ రంధ్రము హృదయము ఒకే సరళరేఖ యందుండుట వల్ల పరమాత్మ ప్రకాశము తిన్నగా మానవుని అంతఃకరణమున ప్రవేశించుటకు అవకాశము కలదు. ఇతర జంతువులందు

వెన్నెముక అడ్డముగా నుండుటవల్ల అంతఃకరణ ప్రకాశము బహుస్వల్పము. తన్నుతా తెలుసుకొనగలిగి నందున తానే పరమాత్మ అనే జ్ఞానం ఒక్కమానవోపాధి యందు సాధ్యము. ఇట్టి సత్యాసత్య నిశ్చయజ్ఞానం ఇతరోపాధులందు లేదు. కనుక యిట్టి మానవోపాధి లభించుటయే మహా అదృష్టము. ఇట్టి సదవకాశము చేతులార జారవిడుచుకొనుట కన్న దురదుష్టంబింకొకటి లేదు. ఏలననగా సత్కర్మానుష్ఠానముచే శుభ సంస్కారములను సృష్టించుకొని యుత్తమ జన్మలకు పోగల్గుచున్నాడు లేదా సర్వసంస్కారములను నాశనముజేసుకొని జన్మరాహిత్యము సాధించగలుగుచున్నాడు. కనుక,

1. సత్యాసత్యముల గుర్తెరుగ గల అఖండ జ్ఞానసంపత్తిని,
2. తన స్థాన స్వరూప స్వభావములు,
3. తన కతీతమైన పరిపూర్ణ పరబ్రహ్మమును గుర్తెరిగి తాను జన్మ రాహిత్యం గావించుకొను శక్తి యుక్తులు ఒక్కమానవోపాధి యందే యున్నవి. దేవతలకు కూడ సాధ్యముగానిది ఈ జన్మయందు సాధించవచ్చును. కనుక మానవ జన్మ దుర్లభము, శ్రేష్ఠము. అట్టి జన్మవచ్చినందులకు మనము జ్ఞానము ద్వార మోక్షము పొందుటకు ప్రయత్నించవలయును.

మానవుని యందు మనోవాక్శరీరములు సంపూర్ణముగా వికాసము జెంది యున్నవి. మానవుడు వైఖరీ వాక్కు కలిగి తన భావము లన్నియు వర్ణాత్మకమగు శబ్దాలతో కూడిన వాక్కు ద్వార సర్వవ్యవహారములు జరుపుటకు సమర్థుడైయున్నాడు. సత్యాసత్యనిర్ణయ పద్ధతి నిర్ణయించుకొనె అంతఃకరణ పద్ధతి కలిగి మావవోపాధి సృష్టించనైనది. ఇట్టి జ్ఞానముచే సత్యమైన అచల పరిపూర్ణ పరబ్రహ్మను, అసత్యమైన ఎరుకను గురుమూర్తి ద్వార తెలుసుకొని కర్తృత్వరహిత కర్మాచరణ పద్ధతిగా విడిచెపద్ధతి గ్రహించ గలుగును. అదే నిజమైన మోక్షము.

**3. మోక్షముః-**

**శ్లో॥ నమోక్షోనభసః పృష్ఠే(న)పాతాలేన నభసభూతలే।**
**అజ్ఞాన హృదయ గ్రన్థేర్నాశోమోక్ష ఇతిస్మృతః॥**

అనగా ఆకాశము నందు మోక్షము లేదు. భూతలమందు మోక్షము లేదు. జ్ఞానాజ్ఞానారూప హృదయగ్రంథి యొక్క నాశనమే మోక్షము. కనుక దుర్లభమైన మానవోపాధికి వచ్చి పరిపూర్ణగురుసార్వభౌముల బడసి, పరిపూర్ణబోధ తెలుసుకొని కర్మత్యాగ, కర్మఫల త్యాగ పద్ధతినగాక, కర్తృత్వరహిత కర్మాచరణ పద్ధతిగా కర్మలొనర్చి హృదయగ్రంథి విడనాడు పద్ధతిని తెలుసు కొన్నవారే జనన మరణ భీతిరహితముగా కాలము గడుపగలరు.
జనన మరణములు తొలుగదనే నిర్ణయమున పరితపించుటయే ఘోరసంసార బాధ. ఇట్టి ఘోర సంసార భీతి నుండి బయట బడుటకు పరిపూర్ణబోధ ఒక్కటే అత్యంత సులభమార్గము.

**4. పరిపూర్ణబోధ** : పరిపూర్ణబోధ ద్వయదోషరహిత పరమతత్వము. వేదవేదాంతీతము. అందుకే శ్రీ కృష్ణదేశికేంద్రులవారు. **"ఆగమ నిగమములను సాగరముగా జేసి తరచగా తేలిన సారమునకు ఆవలిది అచలము"**. **"ప్రాగర్థ, చరమార్థ యోగములకు సంయోగముగావించి నేను గుర్తెరిగినది"** అని నుడివినారు. మరియు క.ద.1. **"జనులార జనన మరణము। లను దొలగన్ ద్రోయజాలు లక్షణయుతమై। విను వారికి కనువారికి । తనలావెరింగించు దీని । తప్పొక వింటే । అప్పుడే వార లెప్పుడు గంటే।"** అనగా లక్షణ

యుతులై ఈ బోధ తప్పక యెవరు విని, కనియెదరో అప్పుడే యనగా ఎప్పుడోగాక ఆ క్షణముననే పరిపూర్ణపరబాహ్యము అపరోక్షమగును. – పుట్టుచావులు లేకుండపోవును. అనగా జన్మరాహిత్యము కలుగునని వక్కాణించి యున్నారు. కనుక చదువరులందరు లక్షణయుతులై ఈ అచల బోధను తెలుసుకొనగలరని ప్రార్థించుచున్నాను.

**5. అచలము:–** అచలమనగా ఏకాలములో కూడ కదలనిది. నిరపేక్షకమైనది. చలనమున్నదని అంగీకరిస్తె చలనము లేని మరొకటి యుండవలెనని చెప్పవలసి వస్తుంది. కదిలేదున్నప్పుడే కదలని దానిని గురించిన ఆలోచన వస్తుంది. **ఆత్మతో సహా జీవేశ్వర జగతంతా కదిలేదే.** వీటన్నిటికీ అతీతంగా ఒకటి ఉండి వుండాలి. ఆ వున్నదానికే పరిపూర్ణమని వ్యవహారార్థము నామకరణము చేసియున్నారు.

**6. పరిపూర్ణబోధ ఒక సిద్ధాంతము:–** పరిపూర్ణబోధ ఒక సిద్ధాంతము. ఇందు ముఖ్యనిర్ణయములు మూడే 1. పరిపూర్ణము శాశ్వతమైనది. 2. లేనెరుక లేనే లేదు. 3. ఎరుకను కర్తృత్వరహితముగా విడుచుట. అనగా గురుముఖంగా పరిపూర్ణ పరబ్రహ్మము శాశ్వతమైనది, లేనెరుక లేనేలేదని వస్తునిశ్చయముగా నెరిగి అహం పదార్థరహిత పద్ధతిగా అనగా కర్తృత్వరహిత కర్మాచరణ పద్ధతిగా శేషజీవితము గడిపిన, వేయించిన విత్తనము మొలకెత్తనట్లు తిరిగి జన్మలేకుండును.

పరిపూర్ణబోధ ఒక సిద్ధాంతము మరియు శాస్త్రము. It is a theory and systametic body of knowledge. ఈ సిద్ధాంతమును విశ్లేషణ పద్ధతిగా పరిశీలించిన చివరకు శేషించునది పరిపూర్ణపరబ్రహ్మమే. ఈ సిద్ధాంతము శాస్త్రయుక్తమైనది. అదెట్లనగా:

**శ్లో॥ పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణముదచ్యతే**
**పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవా వశిష్యతే॥** ॥బృహదా॥

అనగా అపరోక్షము పూర్ణము, యీ ప్రత్యక్షము పూర్ణము. ఈ పద్ధతి వివరించి చూడగా జనన మరణరహిత పరిపూర్ణపరబ్రహ్మమే శేషించును. జనన మరణ చేతన బ్రహ్మము (యీ ప్రత్యక్షపూర్ణము) ఎండ మావులందు జలరూపముగా లేకుండ పోవుచున్నది. పరోక్షపూర్ణమే శేషించి యుంటుంది. కనుక ఆగమనిగమ ఉపనిషత్సాగర మథితార్థమవలిది, జనన మరణములు పొందనిది, అచలపరిపూర్ణపరబాహ్యమని నిర్ణయము. ఈ విషయములు ఈ ఉపనిషత్తునందు సుబోధకములైయున్నవి.

ఈ పరిపూర్ణబోధ సార్వజనీనముగా గుర్తించ బడిన సత్యము, It is universal acknowledged truth అని చెప్పుట సమంజసము. దీనిని ఎచ్చోటనైన అనగా అండమాన్ నికోబార్ దీవులందుగాని చల్లని ప్రదేశమైన ఉత్తర దక్షిణ ధృవములందు పరిశీలించిన మిగులునది సద్వస్తువైన ఒక్క పరిపూర్ణపరబ్రహ్మమే. అయినను ఈ సిద్ధాంతము సీమాంతరములందు ప్రచారములో లేకపోవుటకు కారణము యిది గురుగోప్యమైన విషయమై శిష్యులకు మాత్రమే జెప్పుట వల్ల అంతగా ప్రాకలేదు. ఈ సిద్ధాంతము లక్షణయుతులై కోరినవారికి మాత్రమే బోధించుట జరిగినది. సంస్కృతములో మొదట వెలువడుటవల్ల ఇతర భాషలు మాతృభాషగలవారికి అందుబాటులో లేకపోయినది. పూర్వము ప్రచార సాధనములు, గ్రంథములు విరివిగాలేకపోవుట కూడ మరియొక కారణము. గురుశిష్యుల మధ్యనేవుండి పోయినది. ఇటీవలికాలములో బాగా ప్రచారములోకి వచ్చినది.

ఈ సిద్ధాంతమువల్ల విశ్వమానవ కళ్యాణము ఐహికాముష్మిక పురోభివృద్ధి, అన్యోన్య సహకారము సర్వమానవ సౌభాతృత్వము చేకూరును. కర్మబంధమును కాల్చివేయును.

**7. ఇది ఒక మతముకాదు:** ఇది ఒకమతముగాదు. మతమనేది మతి లేక బుద్ధిచే నిర్ణయింపబడి కొన్ని సరిహద్దులేర్పరుచుకొన్న వ్యవస్థ అని మత శబ్దము సూచిస్తూంది. మతములు సిద్ధాంతము జేసిన బ్రహ్మము "మన సైవాను ద్రష్టవ్యం" అనీ, బుద్ధి గ్రాహ్యమతీంద్రియం" అనీ శ్రుతి స్మృతులు చెప్పుచున్నాయి. ఈ పరిపూర్ణబోధయందు పరిపూర్ణపరబ్రహ్మముగా వాకొన్నది "నవాఙ్గచ్ఛతి నోమనః" అని మనోవాక్కుల కందరానిది. అవాఙ్మానసగోచరమైనది.

మతము లన్నియు శ్రీకృష్ణదేశిక ప్రభువులు శెలవిచ్చినట్లు" మతముల వారలు। తమ సమ్మతమైనటువంటి। శాస్త్రమర్యాదలచే మితమేర్పరుచుకొని బహుగతుల కలహింతు రట్టిగతి నీకేమిటికీ" అని హెచ్చరించినారు. పరిపూర్ణమట్లుగాక సకలదేశాలకు, సకల సమాజములకు సరిపడునదిగా యున్నది. నిష్పక్షపాతముగా ఈ సిద్ధాంతధర్మములను శోధించువారికి బోధపడును.

**8. అన్నిటి లక్ష్యమొక్కటే యనుట సరిగాదు:** అన్ని మతముల లక్ష్యమొక్కటే యనుట సరిగాదు. పరిపూర్ణబోధ లక్ష్యము వాటి కన్నిటికంటే విలక్షణమైనది. అన్ని మతముల యొక్క గమ్యము ఎరుక యొక్క సగుణ నిర్గుణ రూపమై ఉన్నది.

**"ఆకాశాత్పతితం తోయం యధాగచ్ఛతి సాగరః**
**సర్వదేవ నమస్కార కేశవంప్రతిగచ్ఛతి"॥**

ఆకాశము నుండి పడిన వర్షము సముద్రము చేరునట్లుగా అన్ని మతములు చివరకు ఒకే గమ్యము చేరుననుటలో విప్రపత్తి యేమిలేదు. అయితే ఆకాశము నుండి చివరకు సముద్రమునే చేరును. ఎండకు ఆ నీరే ఆవిరై మేఘమండలము చేరి మరల వర్షాకాలములో భూమిపై బడును. కనుక మతము లన్నియు తిరిగి వచ్చు పద్ధతినే సూచించునుగాని జనన మరణ చక్రభ్రమణలో విడువడునట్లుజేయవు. పరిపూర్ణ బోధయొక్కటియే తిరిగి జన్మకు రాని పద్ధతి **"తేషాం నవిద్యతే జన్మ"** అనే పద్ధతిని సూచించును. కనుక ఎరుకలేని పరిపూర్ణబోధవల్ల జన్మరాహిత్యమే చేకూరును. ఇదే మోక్షము. ఈ తిరిగిరాని పద్ధతిని ముఖ్యముగా ఈ అనన్తోపనిషత్తునందు మరియు సర్వసారపూర్ణోపనిషత్తులందు మాత్రమే సిద్ధాంతీకరింపబడినది. ఇతర బోధలందు పంచముక్తులు జెప్పుదురు.అవి జన్మరాహిత్యము కలిగించజాలవు సరిగదా భ్రాంతిని చిదిమిన కొద్ది చిగుర్చునట్లుజేయును. ఇతర మతబోధలందు జన్మరాహిత్యము కలుగు విధానమును చెప్పబడలేదు. కేవలం మోక్షములభించునన్నారు.**"మోక్షాపేక్ష సంకల్పో బంధః"** అను నిరాలంబోపనిషత్ వాక్యానుసారము అదికూడ బంధమే. కేవల ఈ పరిపూర్ణబోధయందు జన్మరాహిత్యమెట్లు కలుగునో సిద్ధాంతపరంగా (Theory) కాక, ఆచరణలో (Practical) ఎట్లు జన్మరాహిత్యము కలుగునో తేటతెల్లముగా జెప్పబడినది.

**గురు పరంపర – దక్షిణామూర్తి – మౌనవ్యాఖ్య :**

పరమశివుడు దక్షయజ్ఞము నాశనమొనరించిన పిదప దక్షిణామూర్తి (దిగంబరుడైన బాలుని రూపమున) వైరాగ్యముబూని జటావల్కముల ధరించినవాడై వటవృక్షయున స్వస్తికాసనమున కూర్చొండి అష్టమూర్తులలో నొకటి యగు మహా అగ్నిహోత్రమును నియతితో

నర్చనజేసెను. మహావేద మహాబంధముల ధరించి నిర్వాసనా మౌనముద్రధారియై ఆ పరమశివుడు అష్టాంగ యోగాగ్నుడై తపో నిష్ఠయొనర్చెనేగాని, ఆత్మస్థితిని లెస్సగా ఆలోచించి అంతయు అశాశ్వతమని గుర్తించి పరబాహ్యమొక్కటి మాత్రమే అనంతమై అచలమైయున్నది. అది యొక్కటియే శాశ్వతమైనది యని మనస్సున ధరించెను. ఆ మౌనవ్యాఖ్యచేతనే ఋషులందరు సంశయ రహితులైరి, సంతృప్తి జెందిరని దక్షిణామూర్తి చరిత్రయందు చెప్పబడినది. జ్ఞాన మార్గీయులందరు దక్షణామూర్తి మౌనవ్యాఖ్యను ఋషులందరు ఈ విధంగా అర్థముజేసికొనిరి. 1.పరిపూర్ణ పరబ్రహ్మము శబ్దముల కతీతమైనది. 2.పరా వశ్యంతి మధ్యమ వైఖరీయను చతుర్విధవాక్కులులేనిది. 3.అందుజ్ఞానా జ్ఞానరూపమగు యెరుకకు స్థానము లేదు. 4. ఆ పరిపూర్ణము తప్ప అన్యముగా భ్రాంతివల్ల తోచబడేదంతా ఎరుకే. 5. దానికి కారణములేదు. 6. ఎరుక కన్యమైనది పరిపూర్ణపరబ్రహ్మమొక్కటే. 7.ఎరుక పరిపూర్ణమందు పుట్టలేదు. కనుక యే మతనిర్ణయములు లేవు. " నిర్ణయమే నాస్తి సర్వదా" ఏ నిర్ణయము పనికిరాదు. నిర్ణయములన్నియు భ్రాంతి రూపములే. 8. పరిపూర్ణమే సత్యమైన సిద్ధాంతమని పరిపూర్ణభావజ్ఞులు అర్థము చేసుకొనిరి. పరిపూర్ణబోధ యనగా ఎరుకను నిరసించు బోధయేగాని పరిపూర్ణమును గురించి అంతగా చెప్పునటువంటిదిగాదు.

పైన వివరించి జెప్పినట్లు దక్షిణామూర్తి యే ఆదిగురువు. 1. దక్షిణామూర్తి పరబాహ్యమొక్కటి మాత్రమే అనంతమై అచలమైయున్నది. అది యొక్కటియే శాశ్వతమైనదని మనస్సున ధరించి యీ మార్గమునంతయు స్థితి కారకుడగు విష్ణువుకు ప్రబోధించెను. విష్ణువు, సూర్యునకు, సూర్యునిచే యాజ్ఞవల్క్యకి, యతని శిష్యుడు జనకుడు, జనకుని చే శుకుడు, శుకునిచే సాంధీపుడు, సాంధీపునిచే కృష్ణుడు, కృష్ణుడు యుద్ధవార్జునులకు చెప్పెను. కలియుగమున శ్రీధరస్వాములవారిచే శ్రీశివరామదీక్షితులు ఈ బోధను పొంది, పరిపూర్ణగురు పీఠమును స్థాపించిరి. వీరిప్రియ శిష్యులు అప్పయ్య మంత్రి, అప్పయ్య మంత్రి – శ్రీ సీతారామ స్వామికి, వీరు శ్రీ భాగవతుల కృష్ణదాసులగారికి ఈ బోధను తెల్పిరి. వీరి తర్వాత అచలగురు పీఠము శాఖోపశాఖలుగా విస్తరించినది. ఇరువైవశతాబ్దమున శ్రీ మందిప్పల హనుమంతరావుగారి ప్రియ శిష్యులు **శ్రీ దయానంద పొన్నాల రాజయార్యులు** సికింద్రాబాదు నందు అచల పీఠమును స్థాపించి, దేశ స్థాయిలో అనేక గురూపపీఠముల స్థాపించిరి. పలురాష్ట్రములలో పూర్ణబోధను శిష్యులకు తెలిపి వారిలోని దొసగులను దూరీకరించిరి. వీరిలో ఒకరైన కొందుర్గు మండలము చౌదరిగూడెం వాస్తవ్యులు **శ్రీ పరిపూర్ణానంద బూసానర్సింహార్యులు,** శ్రద్ధాసక్తులతో తనను కోరినవారికి ప్రేమతో అచల ప్రబోధను తెలిపిరి. వారి సహధర్మచారిణియైన శ్రీమతి బూసానాగమాంబగారు కూడ కోరిన భక్తులకు పరిపూర్ణ ప్రబోధను తెలిపిరి. శ్రీ బూసానర్సింహయ్యగారి శిష్యులలో ముఖ్యులు శ్రీ నర్సప్పమంతులు మఖ్తల్ గారికి శ్రీ దయానంద రాజయార్యులు గారు బోధాధికారమొసంగిరి. వీరి అంత్యకాలమున తనతోటి శిష్యుడు పీఠకార్యదర్శియైన రాజేంద్రనగర్, మహబూబ్‌నగరము వాస్తవ్యులు శ్రీ మల్లు వెంకటరెడ్డి గారికి వారి గురుదేవుల పాదుకలు అప్పగించి బోధాధికారమొసంగిరి. ఆ అంశమును ఈ పీఠము యొక్క కార్యవర్గము ఏకగ్రీవముగా ఆమోదించిరి. తదుపరి శ్రీశ్రీ పొన్నాలరాజయోగి అచలగురుపీఠము, సికింద్రాబాదువారిచే కూడ బోధాధికార ప్రమాణ పత్రమును కూడ పొందియున్నారు. వీరే మద్గురువులు.

## 3. పరిపూర్ణబోధ - వేదములు - అనన్తోపనిషత్తు:

అచల పరిపూర్ణపరబయలు భావమును తెలియజేయుటయే వేదముల మరియు వేద శిరస్సులనబడు ఉపనిషత్తుల ముఖ్యఉద్దేశమైయున్నది. ఎందుకనగా మనోవాక్కుల కందని పరిపూర్ణ భావమును సర్వజ్ఞత్వలక్షణము గల అధిష్ఠానచేతనబ్రహ్మమగు యెరుకే తెలుసుకొనజాలదు. ఆ పరిపూర్ణాపరబ్రహ్మమందు ఎరుక లేదు. కనుక తెలియరాని ఆ పరిపూర్ణపరబ్రహ్మమును లక్ష్యలక్ష్యార్థముగా తెలియజెప్పుట వేదముల ముఖ్యోద్దేశమైయున్నది. మిగత విషయయుల గూర్చి వేదములు తెలుప నక్కర లేకనే తెలుసుకొనవచ్చును. ఎందుకనగా ప్రత్యక్షముగా జీవజగత్తులు తెలియబడుచున్నవి. వీని సృష్టి స్థితి లయముల కాధారమగు బ్రహ్మమును గూడ అనుమాన ప్రమాణములచే నూహించి అతీంద్రియ బుద్ధిచే గ్రహించవచ్చును. మనోవాక్కుల కందని నిరపేక్షమైన, నిష్ప్రతియోగికమైన, శుద్ధ నిర్గుణమైన, ఆత్మాతీత అచల పరిపూర్ణపరబ్రహ్మను గూర్చి తెలియజేయుట వేద వేదాంగముల ప్రధాన ఆశయము.

మొత్తము 1108 ఉపనిషత్తులలో కేవలము రెండు ఉపనిషత్తులు - అనన్తోపనిషత్తు నందు ద్వాదశీ మంత్రమును సర్వసారపూర్ణోపనిషత్తు నందు షోడశీమంత్రమును ముఖ్యముగా పేర్కొనబడినవి. అనన్తోపనిషత్తు నందు 41 శ్లోకములు గలవు. అందు 9వ శ్లోకము తర్వాత "**అయం స్వర్థః బాహ్యః కోపీన భవతి**" అను ద్వాదశీ మంత్రము చేర్చబడినది. ఈ అనన్తోపనిషత్తు నందు 39 వ శ్లోకమున గృహస్థాశ్రమమునందే ఉండి పరిపూర్ణ బోధ పరమావధియగు జన్మరాహిత్యము సాధించ వచ్చునని పేర్కొనబడినది. మరియు జాతి, మత, కుల భేదములు లేకుండ ఈ బోధను బడసి కృతార్థులగుదురని కూడ ఈ ఉపనిషత్తునందు జెప్పబడినది. 40వ శ్లోకమున ఫలశ్రుతి కూడ జెప్పబడినది. మానవులెవ్వరేని దీనిని పఠించిన యెడల బ్రహ్మస్వరూపులగుదురు. నిరాకారమగు పరిపూర్ణ పరబ్రహ్మమును అపరోక్షమగుట వల్ల జన్మరాహిత్యము తప్పక సిద్ధించును. ఈ విషయమున ఎంత మాత్రము సందేహము లేదని ఇదియే ముమ్మాటికి సత్యమని ఈ ఉపనిషత్తు ఘోషించుచున్నది.

మా సత్సంఘము నందు మా గురుదేవులు అప్పుడప్పుడు సందర్భానుసారముగ అనంతోపనిషత్తు, మరియు సర్వసార పూర్ణోపనిషత్తులలోని కొన్ని శ్లోకములు ఉటంకిస్తు వాటి సారమును జెప్పుచుండెడి వారు. ఈ ఉపనిషత్తులను గురుపూజ పూర్తిగావించిన తర్వాత మేము పఠించెడి వారమని, అ.ప. పురం నర్సింహులు గారు చెప్పి మమ్ములగూడ చదువుమని పురికొల్పెవారు. వీరి ప్రోత్సాహము వల్ల ఈ ఉపనిషత్తులను చదువుట వల్ల అందలి భావము పరిపూర్ణ బోధకు యెంతో ఉపకరించుననెడి భావము మరియు అందు విశేషమైన అచలపరిపూర్ణ జ్ఞానముండుట వల్ల వాటి ననువదించి వివరములు కూర్చవలసినదిగా మా గురుదేవులు నా అంతఃకరణమును ఆదేశించుట వల్లనే ఈ పనికి పూనుకొంటిని. ఇది వారి కృపయే. అందువల్లనే దీనిని తుదముట్ట పూర్తి జేయగలగితిని. పూర్తి చేసిన అనంతరము ప్రతి రోజు ప్రాతః కాలముననే కళాశాల ఆవరణలో వాహ్యాళి తర్వాత వీటి అనువాదము మరియు వివరములు మద్గురుదేవులకు, మిత్రులకు వినిపించినాను. అప్పుడు వారిచ్చిన సలహాలు అమూల్యములైనవి. ఎన్నో సందేహములు తీర్చిరి. వారికెంతో ఋణపడి యున్నాను.

మొదట శ్రీ ముత్యాల కొండయాచార్యుల శిష్యులైన అ.ప. విశ్వనాథాచారి గారికి వినిపించుసమయములో శ్రీ వేందాంత సరస్వతి, అభినవదీక్షిత సరసకవి కడివేటి నరసారెడ్డి

గారు అనువదించిన ఉపనిషత్త్రయములను వారు నాకిచ్చిరి. అంతేగాక కడు శ్రద్ధతో విని సలహాలిచ్చిరి. అందుకు గాను అ.ప. విశ్వనాథము గారికి కృతజ్ఞత పూర్వకదండ ప్రణాములర్పించుచున్నాను. ఈ ఉపనిషత్తుల అనువాదము పూర్తిజేసిన తర్వాత ఆ గ్రంథము లభించుట వల్ల కొన్ని దోషములు సవరించుటకు ఉపయోగపడినది. శ్రీ కడివేటి నర్సారెడ్డి గారికి పాదాభివందనములు. అట్లే ఈ ఉపనిషత్తులకు అనువదించుటకు, మరియు వివరములు కూర్చుటకు శ్రీశ్రీ దయానంద పొన్నాల రాజయోగి గారి రచనలు, వారి శిష్యులైన పరిపూర్ణ దర్శనాచార్య శ్రీ యిలపకుర్తి వీరవెంకట రామచంద్రరావు దేశికులవారు రచించిన, అందుబాటులో ఉన్న గ్రంథములు చాల వరకు తోడ్పడినవి, మరియు శ్రీ మందిప్పల హనుమంతదేశికుల వాక్యత్రయము ఇంకా అవధూత గీత, వసిష్టగీత, వివేకా చూడామణి మరెన్నో గ్రంథములు తోడ్పడినవి. మా గురుదేవులు రచించిన చలాచల లక్షణదీపిక కూడ తోడ్పడినది. వారందరికి ద్వాదశ పాదాభివందనములు.

**అనంతోపనిషత్తు – నామకరణము:**

పరిపూర్ణ పరబయలును శ్రీకృష్ణదేశికేంద్రులవారు **43.క.ద.లో " పరమ పదమనిన బయలన । గురుగుహ్యమనంత మనిన। గోప్యంబనినన్"** అని సెలవిచ్చియున్నారు. అనగా పరిపూర్ణమును అనంతమని నుడివినారు. అందుకే ఈ ఉపనిత్తునకు అనంతోపనిషత్తుయని నామకరణ చేయుట యుక్తముగాయున్నది. అంతేగాక గురుమంత్ర నిర్ణయములో మంత్రయుగములో ద్వాదశాక్షరి మంత్రము ఈ ఉపనిషత్తు నందుండుట వల్లకూడ దీనికీ పేరు తగియున్నది.

అనన్తోపనిషత్తును అనువదించుటలో మరియు వివరములు సమకూర్చుటలో "To err is human" అను నానుడిగా దోషములు దొర్లియుండ వచ్చును. విజ్ఞులు వాటిని సవరించగలరని సవినయముగా ప్రార్థించుచున్నాను.

**కృతి సమర్పణము:**ఏ భ్రాంతికైనను భ్రాంతి చెందువాడు, భ్రాంతి చెందింపజేయు పదార్థము, భ్రాంతిరూపముగా తోచబడు పదార్థము అనే త్రిపుటి వుండి తీరవలెను. పరిపూర్ణమందు ఈ త్రిపుటిగాని, మరే త్రిపుటిగాని లేనేలేవు. పరిపూర్ణ బోధచేత పరిపూర్ణ పరబ్రహ్మము అపరోక్షమైన సకల భ్రాంతులకు మూలమైన మూలములేని ఈ గుర్తెరిగి శరీరము పరిపూర్ణ పరబ్రహ్మమందు లేనేలేదని దృఢమైన సర్వభ్రాంతులు వివర్జితమగునని కొనియాడబడినది. సర్వభ్రాంతులకు మూలమైన మూలములేని ఈ గుర్తెరిగే శరీరము ఏమి లేదని తెల్పి నన్నులేనివానిగా జేసిన మద్గురువులు **శ్రీ మదచలఋషి ప్రబోధానంద మల్లు వెంకటరెడ్డి దేశిక ప్రభువుల పాద పద్మములకు ఈ అనంతోపనిషత్తు అనువాదమును మరియు వివరములను రెండవ పుష్పముగా సమర్పించుచున్నాను.**

**ఉపపీఠ ప్రారంభము :**

దాదాపు 16 సంవత్సరముల క్రితం శ్రీమతి నాగమాంబ గారి శిష్యులైన శ్రీ ముత్యాల కొండయాచార్యుల శిష్యులు అ.ప. విశ్వానాథచారి గారు, అ.ప. ముత్యాలంపల్లి వెంకటయ్య గారు, శ్రీ గుబ్బ నారాయణ గారు, శ్రీ సున్నతి రాములు గారు, శ్రీ మంత మల్లయ్య గారు, శ్రీ మాణిక్యం శ్రీ బుడ్డోజీ గారు కలసి ఒక సత్సంఘము ఏర్పాటు చేసి ఆధ్యాత్మిక విషయములు చర్చించుచుండిరి. కొంతకాలము తర్వాత అందు మద్గురువులు పాల్గొని అచల ప్రబోధ

చేయుచుండిరి. రాను రాను ఆ సత్సంఘమే శ్రీ శివరామదీక్షిత అచల గురూపపీఠముగా వెలసినది. ప్రతి ఆది, గురు వారములలో అ.ప. పురం నర్సింహులుగారి నిర్వహణలో మద్గురువులు గురుపీఠము నలంకరించి యుండగా వారి శిష్యులు ఇతరులు పాల్గొని గురుగీతలు, కందార్థములు, తత్వములు గానము చేయుట నేటికి కొనసాగుతున్నది. గురువుల వారి ప్రవచనము తర్వాత శాంతి మంత్రముతో ముగింపు జరుగుచున్నది.

**కృతజ్ఞతలు :**

ఈ ఉపనిషత్తు ముద్రణకై ఆర్థికసహాయ మొనరించిన దాతలందరికి కృతజ్ఞతా పూర్వక దండ ప్రణామములర్పించుచున్నాను. వారి ఆయురారోగ్య ఐశ్వర్యాభివృద్ధికే గాక జన్మరాహిత్యమునకై కృషిజేయుటకు తగిన శక్తి సామర్థ్యముల నొసంగుటకై మద్గురువుల ప్రార్థించుచున్నాను. చక్కగా ముద్రించి యిచ్చిన శ్రీ శ్రీరామ ప్రింటింగ్ ప్రెస్ యాజమాన్యమునకు కృతజ్ఞతాభివందనములు.

మద్గురు శిష్యులు అ.ప. చెన్నయ్యగారు శ్రీ యాదలక్ష్మయ్య గారి ద్వార ఈ ఉపనిషత్ద్వయముల పరిశీలనకై శ్రీశ్రీ మధుర కవి అమలానంద పాటల పండరీనాథ స్వాముల వారి దరి చేర్చి. వారు ఈ పనిని అనంతపురము వాస్తవ్యులు శ్రీశ్రీ సత్య శోధనాచార్య నిత్యానంద కురుబ సుబ్బరాయ దేశికుల కప్పజెప్పిరి. వారు కడు శ్రమకోర్చి **అనంత దర్శనము** పేరిట అనంతోపనిషత్తునకు ఉపనిషద్భాషణ రూపమున పరిశీలనాభిప్రాయములు వెల్లడించిరి. వారు కడునేర్పుతో తాము సత్యశోధనలందు కనుగొన్న సత్యములను జోడించి నిర్మాణాత్మకముగా వున్న భాములకు వన్నె బెట్టినారు. అందుకు గురువరేణ్యులకు, ఇందుకు తోడ్పడిన వారందరికి వినమ్రపూరిత కృతజ్ఞతాపూర్వక దండ ప్రణామము లర్పించుచున్నాను.

"చదివి చదివి జనులు చావంగనేటికి। చావులేని చదువు చదువవలయు
చదివి చదివి జనులు చచ్చుచున్నారయా। విశ్వదాభిరామ వినురవేమా."

చావులేని చదువు చదువవలయునన్నచో చావులేని మార్గమును సూచించు అచల పరిపూర్ణబోధమార్గము తెలుపు ఈ ఉపనిషత్తును చదివి జన్మరాహిత్యము గావించుకొనగలరని ప్రార్థన.

ఇట్లు

1-7-183/30 ఎ,
హనుమాన్ నగర వీధి,
మహబూబ్‌నగర్
10-6-2001
ఫోన్ : 252137.

మద్గురుపాదరేణువు
**మంత చిన్నయ్య**

ఓం

శ్రీ గురుభ్యోనమః

అనన్తోపనిషత్తు

**1. అతశ్శివ ఏవ సనాతనం। బ్రహ్మాభగవానచలఏవ సత్యం నిరంజనం నిర్వికల్పం। నీరంధ్రంచ పరాత్పరం । బాహ్యాముపైతి విద్వాన్ । అన్యజ్ఞానంనాస్తి జన్మప్రవృద్ధి నాస్తి। జ్ఞప్తి సర్వసదా సత్యవాక్యం భక్తిజ్ఞానే కర్మశక్తిచ రహితం సర్వవ్యాప్తం । సచ్చిదానందరహితం॥**

తా ॥ మంగళకరమైన శివమే అతిపురాతనమైనది, అనాది. బ్రహ్మమైన భగవాను డచలమే. ఈ అచలమే సత్యమైనది, శాశ్వతమైనది, ద్వయ దోషములేనిది, బ్రహ్మాత్మైకత జ్ఞానములేనిది. ఆకాశమువలె సందులేనిది. పరమాత్మ కంటే శ్రేష్ఠమైనది. పరాత్పరమునై యున్నది. ఆ పరిపూర్ణపరబ్రహ్మను సమీపించిన యనగా అపరోక్షముగావించు కొన్నవాడు విద్వాంసుడు, జ్ఞాని. ఇతరమైన జ్ఞాన మందులేదు. జన్మపరంపరలు, ఉత్పత్తి,స్థితి,లయము లందు లేవు. సర్వసదా జ్ఞప్తి(ఎరుక), జ్ఞాన కర్మలు - సంచిత, ప్రారబ్ద, ఆగామి కర్మలు, కర్మఫలితములు పరబాహ్యామందు లేవు. ఇది దేశకాలపరిచ్ఛేదము లేక సర్వవ్యాప్తమై అంతట నిండి నిబిడీకృతమై యున్నది. సత్, చిత్, ఆనంద లక్షణ రహితమైనది.

**వివరములు :-**

**అతః శివ ఏవసనాతనం:-**

**అత ః :** అనగా అనంతరము.

**శివః-** ఇచట శివ యనుటలో పరిపూర్ణపరబాహ్యాము సర్వశుభప్రదమైనదని, మంగళకరమైనదని యర్థము. పరిపూర్ణపరబాహ్యా భావము దృఢమైన యెడల శాశ్వత జనన మరణ రహితము సిద్ధించుటకన్న మంగళకరమైనది మరొండు లేదు గదా ! కనుక దానిని శివమని, బ్రహ్మమని, భగవాన్ యని, అచలమనీ వ్యవహరించబడుచున్నది. వ్యవహార నిమిత్తమే పరిపూర్ణబాహ్యామును పరిపూర్ణపరబ్రహ్మమని, అచలమని, గురు గుహ్యామని, అనంతమని మరెన్నో పేర్లు మనము పెట్టుట చేతనే దీనికి పేర్లు కలిగినవి. అందుకే శ్రీ కృష్ణ దేశికేంద్రులవారు తమ కంద పద్యములలో 38.క.ప. **"పేరచలమనుచు బయలని । పేరెప్పుడు లేదు మనము బెట్టుటచాతన్ । పేరాయె బయలుకిప్పుడు"** అనియు మరియు కందార్థ దర్వులలో **44 క.ద. "బట్ట బయలనుచు దీనికి । మొట్టమొదల్ పేరు లేదు । ముదమున ఎరుకే । పుట్టి పేర్బెట్టి దీనిని । పట్టుక లవ్వాడలేక । పారిపోవునురా।"** యని గానము జేసి యున్నారు. పరిపూర్ణ పరబ్రహ్మమునకు యేపేరు లేదు. పేర్లన్ని మనము బెట్టినవే. జనన మరణ రహితము కన్న శుభప్రదమైనది, మంగళకరమైనది మరొండు లేదు గనుక పరిపూర్ణపరబ్రహ్మమునకు శివః యని పేరిడుట తగియున్నది.

**సనాతనం:-** పరిపూర్ణ పరబ్రహ్మము అనాది, అతి పురాతనమైనది, గనుక అది సనాతనమైనదని జెప్పబడినది. ఇట్టి పరిపూర్ణపరబ్రహ్మమును గూర్చి విచారించుటయే సనాతన ధర్మమగును. సనాతనము గానట్టి క్షణిక ప్రాపంచిక వస్తు జాలమును గూర్చి విచారణచే ముక్తి చేకూరదు. జన్మ రాహిత్యము కూడ కలుగ జాలదు. కేవలాత్మ విచారణ రూపమగు సనాతన ధర్మమునే ముముక్షువు లాశ్రయించవలెను. శ్రీకృష్ణ దేశికేంద్రులవారు క.ప॥59॥ **"నీ తండ్రి తాతలవలే । నీ తనయులు నీవు జనుట నిశ్చయము కదా! మీ తోటి**

**రాదుగద బయలీ తెరగెరిగీనపుడు శూన్యమేదో గనరా"**॥ అనగా నీ తండ్రి తాతలు చనిపోయినట్లు నీవు, నీకుమారులు చని పోవుట నిశ్చయము గదా! అచల పరిపూర్ణ పరబ్రహ్మము నీతో వచ్చి పోవునట్టిది గాదు. ఎల్లప్పుడు యుండునట్టిది. వారే మరొక కందపద్యమున 77. **"నీ తండ్రి జనిన మీదట । నీతనయుడు రాక మునుపు । నీ వున్నపుడున్ । యే తత్వమంతట గల।దా తత్వము నరసి మృషని తలపుము మిమ్మున్**॥ అనగా నీ తండ్రి చనిపోయినప్పుడు, నీ కుమారులు గలుకముందు నీవున్నప్పుడు యే అచల పరిపూర్ణపరబయలు యంతట నిండి యున్నదో దానిని సద్గురు మూర్తి యనుగ్రహమున తెలిసి నిన్ను మరియు సకల యానందములను అశాశ్వతములని విడువుమని హితవు పలికినారు. పూర్వమున్నది. యిప్పుడు వుంటూ వున్నది. ఇక మీద యుండునది, శాశ్వతమైనది పరిపూర్ణపరబ్రహ్మమే. కనుక దానిని సనాతనమని అన్నారు.

## బ్రహ్మ భగవానచలఏవ సత్యం :

**బ్రహ్మము:-** బ్రహ్మయనుశబ్దము "బృంహి" =వృద్ధౌ యను ధాతువు నుండి పుట్టినది. కనుక బ్రహ్మమనగా పెద్ద వస్తువని యర్థము. పరిపూర్ణదర్శనము నందు బ్రహ్మమనగా "నిత్యమై శుద్ధమై ఆదిమధ్యాంత రహితమై అద్వయమై నిష్క్రియమై నిర్గుణమై స్వయంప్రకాశమై సర్వకారణమై సర్వమునకు ఆధారము అధిష్టానమునూ అయి సర్వవ్యాపకమై సచ్చిదానంద లక్షణములే స్వరూపముగా గలదై మనోవాగగోచరమై యుండునదే బ్రహ్మము" ఇది స్వరూప లక్షణము. అనగా సహజ లక్షణము. మొదటి రూపము. ఈ స్వరూపమున గలదొక బ్రహ్మమే. కనుక "ఏకమేవ" అన్నారు. అటువంటిది మరొకటిలేదు గనుక ప్రతిలేనిదగుట చేత "అద్వితీయం" అన్నారు. ఈ బ్రహ్మమే సృష్టిస్థితిలయములకు కారణమైనప్పుడు ఈశ్వరుడనిపేరు.

**భగవాన్:-** భగవాన్ యనగా భగవంతుడు, దేవుడు. సామాన్యముగా భగవంతుడనే వరకు ప్రతివానికి ఒక విధమైన భయము, ప్రేమ, గౌరవము యేర్పడును. ఆపద వచ్చినప్పుడు మొదట జ్ఞప్తికి వచ్చువాడు భగవంతుడే కనుక భగవంతుని కంటే మరొకటి లేదనుభావము కాబోలు భగవచ్ఛబ్దమును పరిపూర్ణపరబ్రహ్మమునకు వ్యవహారార్థము వాడినారు. శ్లో॥ 104 జ్ఞానం వైరాగ్యమైశ్వర్యం। యశశ్శ్రీ స్వము దాహహృతం - షడ్గుణైశ్వర్యయుక్తోహి భగవాన్ శ్రీ గురుఃప్రియే" (గురుగీత) జ్ఞానమును, వైరాగ్యమును, ఐశ్వర్యమును, యశస్సును సంపపదయును, ఆత్మయును వీనితో కూడు కొనుటవల్ల షడ్గుణైశ్వర్య యుక్తుండగు భగవంతుడగుచున్నాడు. అగ్ని యొక్క సూక్ష్మాంశమగు శబ్దము ధ్వన్యాత్మకము. ఈ ధ్వన్యాత్మకమగు శబ్దము వ్యష్టి శరీరోపాధి యందు వర్ణాత్మకముగా నిర్ణయించిన దానిని మాటయని చెప్పబడును. ఈ మాటల సముదాయమే మానవుల చేత నిర్ణయించిన వేద శాస్త్ర పురాణ ఇతిహాసాది సర్వ శాస్త్రంబులు కనుక నేనన్న, జీవుడన్న, ఈశ్వరుడన్న మాటల నిర్ణయమే. కాని వస్తు నిర్ణయము లేదు. కనుక యిది మానవ నిర్మిత శబ్ద ప్రపంచము. శ్రుతి **"సర్వం వికార జాతం మాయామాత్రం"** యని నిర్ణయము. గనుక నామ రూప వికారములు గలిగి యుద్భవించిన సమస్తము మాయా స్వరూపమైనది గనుక లేనిదని నిర్ణయము. **"వికార రహితేచ ఈశ్వర "** యను శ్రుత్యర్థము ప్రకారము పరిశీలించినను ఈశ్వరుడు, భగవాన్ యనే శబ్దములు ఎరుకనే. కాని మొదట జెప్పినట్లు వ్యవహారార్థము గొప్పదను భావముచే పరిపూర్ణపరబ్రహ్మమునకు భగవాన్ యను పేరు పర్యాయ పదముగా వాడియున్నారు. మరి చెప్పవలసివస్తే పరిపూర్ణపరబ్రహ్మము యేది కానిది యేది లేనిది నేను కూడ లేనిది.

**అచలం:-** అచలము అనగా ఏ కాలంలోను కదలనిది. నిరపేక్షమైనది. చలనమున్నదని అంగీకరిస్తే చలనము లేని దొకటి వుండి వుండాలని చెప్పవలసి వస్తుంది. ఎట్లనగా అతివేగంగా వెళ్ళె రైలుకు బిగించబడి చలనము లేని పట్టాలుండుటవసరము. రెండింటికి కదలిక యున్న రైలు క్రిందపడే ప్రమాదము గలదు. అట్లే సూర్యుడు చలనములేనిదగుట వల్ల దాని చుట్టు నవగ్రహములు చలనము కలిగి తిరుగుచున్నవి. కేవలం అచల స్వరూపముగా నుండి చలనమెన్నడెరుగని పరిపూర్ణపరబ్రహ్మమున కొక్కదానికే చెల్లును. చలాచలములు రెండూ చలనము యొక్క రూపాంతరములే. చిత్ యొక్క లక్షణములే. **ద్వంద్వస్సామాసికస్యచ** అనగా సమాసములలో నేను ద్వంద్వ మంటున్నాడు విభూతి యోగములో శ్రీకృష్ణపరమాత్మ. కనుక ఏ ద్వంద్వాలు తీసుకొన్న అన్నియు సచ్చిదానంద పరమాత్మ రూపాంతరములే. కనుక ఏ స్థానమందు చూచిన పిండ బ్రహ్మాండములందుగాని, అఖండాత్మస్వరూపమునందు గాని కేవలాచలస్థితి లేదు. ప్రత్యగాత్మ సమాధియందు నిశ్చలముగా నున్నదని జెప్పినా తదనంతరము చలన రూపము వహిస్తుంది. కావున చలాచలస్థితులు రెండునూ ప్రత్యగాత్మ, పరమాత్మల రెండింటికి వున్నవని చెప్పితీరవలసినదే.. ఈ రెండింటి యొక్క అఖండత్వము నందును చలాచలస్థితులు రెండు వున్నవని అనాలి. కనుక అచలోఽయంసనాతనః" అని చెప్పబడిన మాట కేవలం అచలం స్వరూపము గా వుండి చలన మెన్నడు యెరుగని పరిపూర్ణపరబ్రహ్మమునకే చెల్లును. దాని యందు శక్తి రూపముగా గాని తెలివి రూపముగాగాని యెరుక యెన్నడూలేదు. దానిని "నిశ్శక్తి నిర్మలం పూర్ణం" అని వర్ణించియున్నారు. " అదేనీవు నీవే అది" అంటూ తత్త్వమసి మహావాక్యము యొక్క లక్ష్యార్థము గూడ చలాచలాత్మకమగు ప్రత్యగాత్మ పరమాత్మల విషయంలో మాత్రమే సత్యం. పరిపూర్ణ పరబ్రహ్మము యేది గానిది. తన యందేమిలేనిది అది నీవుకాదు, నీవు అదికాదు.

**సత్యం:-** ఉన్నది వున్నట్లు పలుకుట, భావించుట. అసత్యము. ఒకే దాని విషయమున సత్యాసత్యములనే ద్వంద్వప్రసక్తి యేర్పడుచున్నది. ఇది సత్యము, యిది అసత్యమని నిర్ణయయించేది ఒకే వస్తువు. సత్యాసత్యములనే నిర్ణయ మెరుగనిది వేరే వస్తువు. "సత్యమగు బట్టబయలు అసత్యమగు యెరుక" అని శ్రీ కృష్ణదేశికేంద్రులవారు శలవిచ్చియున్నారు. కావున పరిపూర్ణ పరబ్రహ్మమే సత్యమైనది. రెండు సత్యమైన వస్తువు లుండడానికి వీలులేదు. క.ద. 54, **"పరిపూర్ణమొకటి దక్క। నితరమైన ప్రపంచమెల్లదగదెలియుము। నీ వెరుకేనని మదిలోపల"** అని శెలవిచ్చియున్నారంటే పరిపూర్ణపర పరబ్రహ్మమే సత్యమైనది.

ఏ వస్తువైనా ఏ కాలంలో గాని తన రూపము నుండి తొలగదో అది సత్యము. ఒక్కసారి ఇది ఈ వస్తువు యొక్క స్వరూపము ఇది అని నిర్ణయింపబడిన తర్వాత ఏ వస్తువు అన్ని కాలాల్లోను అదే స్వరూపము గలదిగా ఉంటుందో ఆ వస్తువు సత్యం. ఈ విధంగా చూస్తే పరిపూర్ణ బ్రహ్మము ఒకటే సత్యంగా నిరూపబడుతుంది. సత్యాలు మూడు రకాలు.

**1. ప్రాతి భాసిక సత్యం :** తాడును పాముగా భావించుట ప్రాతిభాసిక సత్యానికి ఉదాహరణము. భ్రాంతి తొలగనంత వరకే ఇది సత్యంగా ఉంటుంది. తెలిసిన తర్వాత ఈ సత్యం బాధిత మౌతుంది. స్వప్నావస్థలోని "సత్యత్వం" కూడ ఇటువంటిదే.

**2. వ్యావహారిక సత్యం :** ఇది జాగ్రదావస్థలోని ప్రాపంచిక సత్యం. ఈ ప్రపంచములోని వస్తువులన్నీ జాగ్రదావస్థలో సత్యాలుగానే తోచును. ఈ సత్యాలన్ని వ్యవహారానికి తోడ్పడును. కాని పుట్టుక చావు పరిణామాలవల్ల వీటియొక్క అనిత్యత్వం

ఋజువౌతుంది. కనుక యిది కూడ అసత్యమే. ప్రపంచములోని ప్రతి వస్తువు ఈ రెండు సత్యాలలోనికి చేరినవే ఔతాయి.

**3. పారమార్థిక సత్యం :** పరిపూర్ణ పరబ్రహ్మ మొక్కటే పారమార్థిక సత్యం. జన్మమృత్యు పరిణామాగి ధర్మాలు లేకపోవటం వల్ల, వస్తువుకాక పోవటమువల్ల, దేశకాల కారణ కార్యాలు కతీతమౌటంవల్ల పరిపూర్ణ బ్రహ్మ మొక్కటే పారమార్థిక సత్యం.

పై విచారణవల్ల బ్రహ్మ, భగవాన్, అచలం, సత్యం అనుట బ్రహ్మ, భగవాన్, అచలం యను పదములు పరిపూర్ణపరబ్రహ్మమునకు పర్యాయపదములుగా వాడినప్పుడే అవి సత్యం యని యనవచ్చును. ఎందుకనగా సత్యమైన వస్తువు ఒక్కటే. రెండు సత్య వస్తువులుండుటకు వీలు లేదు. రెండంటూ వుంటే అది పరిపూర్ణపరబ్రహ్మముగాదు.

**నిరంజనం:–** నిరంజన మనగా అంజనములేనిది. అంజనమనగా అజ్ఞానము. ఉపాధి, కాటుక యని అర్థములు గలవు. పరమాత్మ స్వరూప లక్షణములచే సచ్చిదానంద స్వరూపమని చెప్పబడిన, దానియందే జడ దుఃఖములు యణిగి మణిగి యుండి త్రిగుణ విజృంభణలో మాయా కార్యములన్నియు ప్రకటన మగుచున్నవి. వ్యక్తము గాక మాయా బ్రహ్మముగా నున్నదాపరమాత్మ స్వరూపమే. బ్రహ్మమే సర్వద్వంద్వములకు పుట్టినిల్లు అది ఏకరూపముగా నుండే ద్వంద్వము.

సమిష్టి అజ్ఞానమే మాయ. సృష్టికి పూర్వము జ్ఞానమయంగా నున్నట్లు తోచిన అనంతర కాలమందు అజ్ఞాన లక్షణములు దాని యందు పొడసూపుచున్నవి. నిరూపాధికముగా తోచిన సర్వోపాధులకు అదియె మూలము కడుపటి శరణాలయ. కటిక చీకటివలె, కాటుకవలె నల్లగా నుండును. తేజోంధకారములను (జ్ఞానాజ్ఞానములను) రెండు పరమాత్మవే, అయినా సృష్టికి పూర్వదశయందు అది అజ్ఞానఘనము లేక చిద్ఘనమైనట్లు తోచుచున్నది. ఇట్టి జ్ఞానా జ్ఞానములుగాని ఉపాధి లేని, కటిక చీకటివలె నల్లగా లేనిది, మలినములేనిది పరిపూర్ణపరబాహ్యాము. అందుకే దానిని నిరంజనమన్నారు.

**నిర్వికల్పము:–** నిర్వకల్ప మనగా బ్రహ్మాత్మైక జ్ఞానము. పరిపూర్ణ పరబ్రహ్మమందు బ్రహాత్మైకత జ్ఞానము లేదు. సవికల్ప సమాధి, నిర్వికల్పసమాధియని సమాధి రెండు విధములు.

**1. సవికల్ప సమాధి యనగా :** సాధన సంపన్నుడైన అధికారి గురుముఖంబున వేదాంత వాక్యశ్రవణాదులు చేయుచు తాను బ్రహ్మమేనని భావించుట.

**2. నిర్వికల్పసమాధియనగా :** బ్రాహ్మణుడు తాను యే పనులు చేయుచున్నను తాను బ్రాహ్మణుడనే, నిశ్చయముగా యున్నట్లు. తాను బ్రహ్మమే కాని యితరము కాదనే నిశ్చయము నిర్వికల్పసమాధి. పరిపూర్ణ పరబ్రహ్మమందు ఈ రెండు విధములైన సమాధులులేవు. ఇంద్రియ రూపమైన జ్ఞానము బ్రహ్మమునకు విషయము కాజాలదు. ఏలననగా జ్ఞానమునకు అధిభౌతికము యెరుగుట. అనగా శబ్దాది విషయ పంచకమును యెరుగును. ఇట్టి యింద్రియరూపమైన జ్ఞానమును విషయ పంచకము నుండి మరలించినచో ఆ జ్ఞానమే శుద్ధ జ్ఞాన మనబడును. శుద్ధ జ్ఞానముచే సృష్టికి పూర్వముండే వస్తువును లేక తత్వమును గురించి ధ్యానించినచో ఆ జ్ఞానము (నిరీంద్రియమగు మనస్సు) జ్ఞేయరూపమును పొందుచున్నది. **"మనోహిజతువత్"** మనస్సు లక్క వంటిది. ఏ మూసలో లక్కను కరిగించి పోస్తే ఆ రూపమే లక్క వహిస్తున్నట్లుగా ఆ శుద్ధ జ్ఞానము లేక నిరీంద్రియ మనస్సు, అట్లు జ్ఞేయాకారము

వహించుటే ఆ జ్ఞేయ బ్రహ్మమును అవలోకించుట. అదే ఆత్మగోచరము. కాని అపుడు చూచు మనస్సు, చూడబడే ఆత్మ అనే ద్వివుటి త్రిపుటిలు యేమి యుండవు. మనస్సే ఆత్మయై నిలుచును. ఇదే ఆత్మసాక్షాత్కారము. ఇదంతయు గురుముఖంగా తెలియవలయును.

ముఖ్యముగా సృష్టికి పూర్వమున్నది. ఆ బ్రహ్మ మొక్కటియే. గనుక ఆ కాలమందున జ్ఞాతృ, జ్ఞాన, జ్ఞేయము త్రిపుటి అవశ్యము తానే అయి యుండక తప్పదు. అప్పుడు తెలుసుకొనే జ్ఞాత, తెలుసుకొనే తెలివి (జ్ఞానము) తెలియబడే జ్ఞేయము ఆ మూడు వేరు వేరు మాత్రము కానరావు. కావున సృష్టి కారణ బ్రహ్మమగు జ్ఞాన జ్ఞేయ రూపములను వస్తు నిశ్చయరూపంగా తెలుసుకొని పరిపూర్ణ పరబ్రహ్మ మందు ఆ రెండు లేవని గుర్తెరిగి రెంటిని విడిచినచో జ్ఞాన జ్ఞేయములుగానటువంటి పరిపూర్ణపరబ్రహ్మమొక్కటే శేషించును. కాని యిది మిగిలి యుండునని జెప్పుటకెవ్వరు లేరు. అందుకే పరిపూర్ణపరబ్రహ్మము నిర్వికల్పము, అనగా బ్రహాత్మైక్యతా జ్ఞానము లేనిది.

**నీరంధ్రంచ:-** నీరంధ్రంచ యనగా సందు లేక అఖండముగా నుండుటయని యర్థము. పరిపూర్ణపరబ్రహ్మము సకలదేశాలయందు, సమస్త వస్తువులందు సర్వకాలాల యందు నిండి నిబిఢీకృతమై యున్నది. అంటే పరిపూర్ణపరబ్రహ్మములేని చోటుంటూ లేనేలేదు. వైశేషిక దర్శనము నవవిధ ద్రవ్యముల నిర్ణయించినది. పృథివ్యాది పంచభూతములు, కాలము, దిక్కులు, మనస్సు, ఆత్మ యనునవే నవవిధ ద్రవ్యములు గాని, వాని లక్షణములు. గాని పరిపూర్ణమందు లేవు. అదొక ద్రవ్యము కానేకాదు. ద్రవ్యములన్నియు ఆ పరిపూర్ణ పరబ్రహ్మమునందు అభావస్థితిని పొందుచున్నవి. ఐననూ వస్తువు లేక ద్రవ్యము ఒక ప్రదేశమును ఆక్రమించుచున్నట్లు గోచరిస్తుయున్నది. అవకాశరూపమైన ఆకాశము ఖండ ఖండములైనట్లు, వస్తువు నందు లేనట్లు గోచరిస్తువున్నది. కనుక సకలదేశములందు యని ఆగక "సమస్తమైన వస్తువులందు'' అని కూడచేర్చినారు. వస్తుజాతముచే ఆకాశము ఖండమైనట్లు కానవస్తున్నందువల్లనే సకల "దేశాల యందు" అని బహు వచనము ప్రయోగించబడినది. కనుక వస్తురూపమున తోచబడే వాని నన్నింటికిని బాహ్యాభ్యంతరము లందు పరిపూర్ణపరబ్రహ్మమే నిండి యున్నదని సిద్ధిస్తున్నది.

34.క.ద **"ములుగ్రుచ్చ సందు లేకను । కలిగున్నది బట్టబయలు । గదరామాయన్నా!"** అని శ్రీ కృష్ణదేశికేంద్రులవారు శెలవిచ్చియున్నారు. అంటే పరిపూర్ణ పరబ్రహ్మము యిచ్చట యచ్చట యనక అంతట యుండి ములు గ్రుచ్చ సందు లేకుండ యున్నదనెడి సత్యమును గురుముఖతః విని దృఢము చేసుకొనవలసి యున్నది. ఆకాశము అఖండముగా నున్నట్లే పరిపూర్ణ పరబ్రహ్మము అఖండముగా సందులేక యున్నది. కనుక దానిని నీరంధ్రంచ యని పొగడినారు.

**పరాత్పరం:-** పరిపూర్ణ పరబ్రహ్మ పరమాత్మ కంటే పరమైనది. అనగా పరమాత్మకంటే శ్రేష్ఠమైనది. అన్నిటి కంటే తనకు సన్నిహితముగా నున్నది తన శరీరము. సాధారణముగా ప్రతివాడు తన వ్యవహారములందు శరీర తాదాత్మ్యముతో అంటే శరీరమే తానను బుద్ధితోనే సకల వ్యవహారములు చేయుచున్నాడు. అట్టి తనకు పరముగా, అన్యముగా నున్నది తన ఆత్మ, ఆత్మ లేక పరమాత్మ కంటే పరమైనది, శ్రేష్ఠమైనది కేవలాత్మ. అదియే పరిపూర్ణ పరబ్రహ్మము. ఈపేరు కూడ వ్యవహార్థమని గ్రహించవలయును.

**బాహ్యముపైతి విద్వాన్:-** పరిపూర్ణ పరబ్రహ్మమును గురూపదిష్టమార్గమున ఉపైతి యనగా పొందతగినది । యనగా సమీపించతగినది. అట్లు దానిని అపరోక్షము గావించుకొన్నవాడే విద్వాంసుడు. చలము-అచలము, సత్యాసత్యములు, అంజనము-నిరంజనము, సవికల్ప-నిర్వికల్పాలు యిత్యాదులన్ని ద్వంద్వములు సాపేక్షికములే. పరిపూర్ణపరబ్రహ్మము సర్వద్వంద్వములు లేనిది. సచ్చిదానందబ్రహ్మమే సర్వమునై యున్నందున సర్వద్వంద్వములు అదే. ఈ పరమునకు పరమైనందున పరాత్పరమని బ్రహ్మమని । పరిపూర్ణపరబ్రహ్మమని చెప్పబడినదై పరిపూర్ణ బోధజ్ఞులైన పండితుల చేతనే సమీపించదగినది. ఉపైతి సమీపించదగినది లేక పొందతగినది. ఏలననగా పరిపూర్ణపరబ్రహ్మము తెలియబడునది యనిగాని, తెలియరానిదని గాని చెప్పుటకు వీలులేదు. కనుక "ఉపైతి" యని చెప్పబడినది. అనగా దానిని పరిపూర్ణ సద్గురువు ద్వార అపరోక్షము గావించుకొన్నప్పుడే దానిని సమీపించి నట్లగును.

విద్వాన్ అనే మాటకు శాస్త్ర పండితుడని యర్థము గాదు. **"పాండిత్యం నిర్విద్యా"** అని శ్రుతి. విద్యా విద్యల రెండింటికి అతీతమైన నిర్విద్యాస్వరూపమే పరిపూర్ణపరబ్రహ్మము. గురూపదిష్టమార్గము చేత అనగా లేనెరుకతో దానిని కనిపెట్టిన వాడే విద్వాంసుడు " చూస్తేనే ఎరుక పారిపోవునురా" అని అన్నారు శ్రీకృష్ణదేశి కేంద్రులవారు. చూచిన ఎరుక లేదు గనుక చూచితిననిగాని, చూడలేదని గాని అతడు చెప్పజాలడు. ఇతరమైన జ్ఞానమార్గములచేత భ్రాంతి విస్తారమగునే గాని జన్మరహిత విధానము తెలియరాదు.

**అన్యజ్ఞానం నాస్తి:-** పరిపూర్ణపరబాహ్యమందు ఇతరమైన జ్ఞానమేది లేదు. జ్ఞానమేగాదు యితరమైన దేది యందు లేదని తెలియవలయును.

జ్ఞానమంటే పప్పు బువ్వను గుర్తెరుగునది కాదు. ఎరుకలేనిది జ్ఞానము గాదు, అజ్ఞానముకాదు, జ్ఞాతృ కాదు, ద్రష్టకాదు. కనుక అది త్రిపుటి రహితమైనది.
జ్ఞానమే పరమాత్మ, పరమాత్మ స్వరూపము, సద్గురు స్వరూపము. జ్ఞానమునకు అధి భౌతికము ఎరుగుట. భగవద్గీత యందు జ్ఞానము ఈ విధముగా నిర్వచించబడినది:

**శ్లో ॥ అధ్యాత్మ జ్ఞాన నిత్యత్వం । తత్త్వజ్ఞానార్థ దర్శనం ।**
**ఏతత్ జ్ఞానసమితి ప్రోక్తా । మజ్ఞానం । యదతోన్యథా ॥ 13-12**

అనగా నిత్యమైనది ఆత్మయొక్కటియే యని యెరింగి ఆత్మ తత్త్వము యొక్క సాక్షాత్కారము పొంది యుండుటయే జ్ఞానముగాని మిగతా అంతయూ నజ్ఞానమే. మరియు **"సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని"** అనగా తన యందు సర్వభూతము లను,సర్వభూతములందు తనను చూడగలుగుటయే జ్ఞానము.

128.క.ప **"జ్ఞానము నేనన నొక్కటే జ్ఞానము నేవెరటంచు । గనబోకు సుమీ । జ్ఞానము వచ్చును బోవును । జ్ఞానాతీతమును తాను । గాంచినదాకన్"** అని శ్రీ కృష్ణదేశికేంద్రుల వారు శెలవిచ్చియున్నారు. అనగా జ్ఞానమునగా తెలుసుకొనే తెలివియని, మోక్షవిషయ బుద్ధియని, యెరుకయని చెప్పబడును. కనుక నేనన్న జ్ఞానమన్న ఒక్కటే వేరుకాదు. జ్ఞానమున కతీతమైన పరిపూర్ణపరబయలును తెలుసుకొన్నంత వరకు ఈ జ్ఞానమగు నేను పుట్టుచు గిట్టుచు యుండునని భావము. కనుక పరిపూర్ణపరబ్రహ్మమందు ఇతరమైన జ్ఞానము నాస్తియని తెలియవలయును. శ్రీ భూమానంద మందిప్పల హనుమంత దేశికేంద్రులవారు

పరిపూర్ణము గూర్చి **"జ్ఞానా జ్ఞానము గానిది అది ఘనుల సాధ్యంబైనది, సానుభావాతీతులకును సర్వసమరసమైనది"** అని గానము జేసి యున్నారు.

**జన్మప్రవృద్ధినాస్తి:-** పరిపూర్ణపరబ్రహ్మమందు జన్మ ప్రవృద్ధి యనగా పుట్టుట, పెరుగుట, పెరిగి పెరిగి అసువులు బాయుట కూడ లేవు. అనగా జనన మరణములు లేవని యర్థము. జన్మయనగా శరీరధారణ. శరీరమును ధరించిన వాడెవడనగా అతనిని దేహియని, జీవుడని, ప్రాణమని మొదలగుపేర్లు గలవు. శరీరమున దేహి యనువాడులేనిచో బ్రతికి యున్న వానికి మరణించిన వానికి భేదము లేదు. అతడు యీ శరీరమందుండి సకల క్రియలు చేయుచున్నాడు. శరీరమును వదలి పోవునపుడు ఆ కర్మఫలములను (సంస్కారములను) మోసుకొని పోవుచున్నాడు. మనః ప్రాణములు లేక జీవుడుండడు. అతడు శరీరముతో పుట్టి శరీరముతో పాటే లేకుండ పోవునట్లుగా స్థూలదృష్టికిగోచరించుచున్నది. కాని అట్లు కాదు. వర్తమాన శరీరము ధరించిన జీవుడు కూడ పూర్వమెక్కడో ఏ శరీరము నందో యుండి యుండును. తార్కిక దృష్టితో చూచిన మిక్కిలి సమంజసముగా యున్నది.

జీవునికి ఈ ప్రవేశ నిర్గమములు గావించుటకు స్వతంత్రములేదు. ఎందుకనగా అతడు కర్మసూత్రమునకు బద్ధుడై యున్నాడు:

**"కర్మమున బుట్టు జంతువు । కర్మమున వృద్ధి పొందు కర్మమున చెడున్ । కర్మయె జనులకు దైవము । కర్మము సుఖ దుఃఖములకు కారణమధిపా ॥"** అని మహా భారతమున చెప్పబడినది. కనుక **"కర్మవల్లనే జన్మ, జన్మవల్లకర్మ"** జన్మయనగా స్థూలశరీరధారణము. స్థూల శరీరముతోనే అనుభవించవలసిన కర్మ ఫలానుభవమునకై స్థూల శరీర ధారణ తప్పదు. స్థూల శరీరముతో జన్మించినవాడు మరల కర్మ చేయక తప్పదు. ఆ కర్మానుభవమునకు మరల జన్మించవలెను. ఇట్లు పునరపి జననం పునరపి మరణం అని జన్మ కర్మలు పరస్పర కారణ కార్యములైనవి. ఇదియే జన్మప్రవృద్ధి. ఈ జన్మ ప్రవృద్ధి పరిపూర్ణ పరబ్రహ్మమందులేవు. కనుక జన్మరాహిత్యమును గోరువారు పరిపూర్ణ ప్రబోధను బడయవలసి యుండును.

**జ్ఞప్తి సర్వసదా సత్యవాక్యం భక్తి జ్ఞానే కర్మశక్తిచ రహితం:** జ్ఞప్తి యనగా యెరుక. సర్వవేళలయందు సత్యవాక్యము,భక్తి, జ్ఞానము, కర్మశక్తి కూడ పరిపూర్ణపరబ్రహ్మ మందు లేవు. వీటిని వొక్కొక్కటిగా విచారింతము.

**1. జ్ఞప్తి అనగా యెరుక.** క.ద.56 **"ఎరుకన్నను మరుపన్నను । ఎరుకకు ఎరుకన్నను దేహియన మాయయనన్ । గురుతన, సాక్ష్యనజ్ఞప్త్యన । స్ఫురణయనన్, ద్రష్టయనిన చూడు మొక్కటిగా"** అని శ్రీ కృష్ణదేశికేంద్రులవారు సెలవిచ్చియు యున్నారు. అంటే ఎరుకన్న, మరుపన్న, దేహియన్న మాయ అనిన, గుర్తనిన, సాక్షియన్న, చివరకు జ్ఞప్తియన్న ఎరుకగా చూడుమని హితవు పలికినారు. అంటే జ్ఞప్తి యంటే ఎరుకనే. పరిపూర్ణ బోధ యందు ముఖ్యంగా క్షుణంగా తెలుసుకోవలసినది ఎరుకను గురించియే. తాను ఎరుకై నిలువనిదే పరిపూర్ణ పరబ్రహ్మము అపరోక్షముగాదు. కావున ఎరుకను గూర్చియిచట కొంత విపులముగా వివరించ బడుచున్నది.

"సర్వం ఖల్విదం బ్రహ్మ" అని "ఏకమేవాఽద్వితీయం బ్రహ్మ" అనీ "ఏకం అనేకం భవతి" యిత్యాది శ్రుతులలో నున్న బ్రహ్మ శబ్దమునకు పర్యాయ పదముగా అచ్చతెనుగులో

"ఎరుక" అనే శబ్దము వాడినారు. సృష్టియందున్న పదార్థ జాతమంతటికి ఈయెరుకే ఆధారము, అధిష్ఠానము అయి యున్నది. సృష్టికి పూర్వము సత్పదార్థమే యుండెనని కొందరు. అసద్పదార్థమే యుండెనని కొందరు, సదససద్పదార్థముండెనని కొందరు శ్రుతి యుక్తంగానే వాదిస్తున్నారు. వీటినన్నిటిని పరిశీలించిన మీదట తేలిన సత్యమేమనగా సృష్టికి పూర్వము యెరుక సత్తుగాను, అసత్‌గాను,సదసత్‌గాను వున్నదని గోచరమగుచున్నది.

సద్ఘనమనీ, ఆనందఘనమనీ, దీన్నే పేర్కొంటున్నారు. " అణోరణియాన్, మహతోమహియాన్" అంటె యెరుక అణువుకంటె చిన్నదిగాను, మహత్తుకంటే పెద్దదిగాను యిదే వుంది.

ఎరుక విశ్వగతముగాను (Immanent) విశ్వాతీతముగా (Transcendental) యున్నది.

పురుష ప్రకృతులుగా పంచతన్మాత్రలుగా, సగుణ నిర్గుణములుగా, పంచభూతములుగా, జీవేశ్వరులుగా, సర్వజగద్రూపముగా, అన్నిటికి సాక్షిగా, నియామకుడుగా కర్తగా భోక్తగా, లోకములుగా లోకేశులుగా తేజోంధకారములుగా, ఏకవస్తువుగా, అనేక వస్తువులుగా సర్వస్వరూపముగా నున్నదే ఎరుక.

ఇదే సంవిత్తు (తెలివి) ఇదే ప్రత్యగాత్మ, యిదే అహం పదార్థము. సర్వనామరూపక్రియలు దీనివే. ఇదే త్వం తత్, పదార్థములు, మరియు అసిపదార్థము యిదే యిది లేకుంటే పరిపూర్ణ పరబ్రహ్మ తప్ప యింకేమిలేదు.

ఇదే ఖండాఖండములుగా, పిండబ్రహ్మాండములుగా వున్నది. వాని యందు అహం రూపములో యున్నదిదే.

సర్వద్విపుటులు, సర్వత్రిపుటులు ఇదే, సర్వశక్తులు కలది. యిదే కారణ కార్యములు రెండు యిదే. భావాభావములు రెండు యిదే, సర్వమహత్తులు దీని యందున్నవి. చేతన భౌతిక పదార్థములు రెండు యిదే.

ద్వంద్వరూపముగా వస్తువు నందు గానవచ్చే రెంటిలో సూక్ష్మంగా, చేతనంగా తెలివి రూపముగా నుండేది నిత్యమైన పదార్థమని, స్థూలంగా యున్నది అశాశ్వతమైన మాయా, కార్యమగు జడమని మరి కొందరందురు. కాని రెండు నిత్యమనాలి లేదా రెండు అనిత్యమనాలి. ఎందుకనగా ఏ వస్తువు కేవలం నశించిపోవడం లేదు. జరిగేదేమిటంటే నామరూపాలలో మార్పుమాత్రమే. Matter is industrucctiable అని శాస్త్రజ్ఞులు నిరూపించినారు. చేతనము బ్రహ్మమని, దాని ఆవరణ భూతమగు భౌతిక పదార్థము మాయారూప అశాశ్వత పదార్థమని అనరాదు. రెండు కలసి ఏక కాలమందున్నాయి. ఉదాహరణకు బెల్లము దానియందలి తీపి రెండుకలసియే యున్నాయి. ఈ రెండుఎరుకే. ఇందుయేది పరిపూర్ణపరబ్రహ్మముకాదు.

కారణ కార్యములు రెండు ఎరుకే. మాయ, కర్తృత్వ కారయిత్వములు గలది యెరుకే. యెరుకే సర్వము యెరిగేది. ఎరుగునది, ఎరుగుదునని జెప్పేది యిదే. చెప్పే దానిని యెరిగేది యెరుకే. సృష్టి ద్వార శబ్ద స్పర్శ రూప రస గంధములనే పంచ విషయములను తెలుకొంటుంది. అంతే గాక ఆ శబ్దాదులందు తారతమ్యమును గుర్తించి ప్రతి యొక్క దాని యందలి మంచి చెడ్డలను గుర్తించేది ఎరుకనే. కర్మేంద్రియముల ద్వార కర్మజేసేది యిదే. కనుక ఈ యెరుకే జ్ఞాన కర్మ ద్వయరూపముగా తానే వ్యవహరిస్తుంది. ఎరిగేక్రియ చేయకుండ నున్నప్పుడు

మరుపు అజ్ఞానము అని దీనికి పేర్లు. జాగ్రదవస్థయం దెరుకరూపముగా సర్వమును తెలుసుకొంటుంది.

ఎరుక, మరుపు, సుషుప్తి, మరణము సమాధ్యద్యవస్థల యందు మరుపు రూపముగానున్నది. చలాచలము రెండు యెరుకే. అద్వైత పద్ధతి యందు బ్రహ్మసాన్నిధ్య మందు స్వయముగా జడమని చెప్పబడే మాయ చలించి జీవేశ్వర జగత్తునకు కారణమయినది అన్నారంటే చలింపజేసేది బ్రహ్మము, చలనకార్యము జగత్తు. కనుక చలింపజేసే బ్రహ్మముతో సహా సర్వము చలించే వస్తువర్గములోకి వస్తాయి. ఒకప్పుడు చలించనంతమాత్రాన ఈ లేనెరుక కేవలం అచలం యని అనరాదు. ఈ యెరుక చలాచలరూపముగానున్నది.

ఎరుక నిష్క్రియముగాదు. ఎరుక జ్ఞానాజ్ఞానారూపమైన బ్రహ్మము. నిష్క్రియము సాక్షి మాత్రము అని యితరులు అంటారు. కాని ఎరుక రెండు కాదు. జ్ఞానమునకు ఎరుగుట యెరుగక పొవుట అధిభౌతిక వ్యవహారము. ఎరుగుట యెరుగక పోవుట రెండు క్రియలు గలవు. అట్లే సాక్షిగా యుండుట యుండకపోవుట గూడ దాని పనియే. అయితే పని చేయు శక్తి యున్నచో పనిని ఆపుజేయు శక్తికూడ యుండును. ఒకస్థితిలో యేపనిచేయకుండ యున్నట్లు తోచిన దానిని నిష్క్రియమనరాదు.

అన్నీ యెరుకే.ఏది కాదు – మనోవాక్కులకందే సర్వమును యిది కాదు, యిది కాదు యిది కాదని నిషేధించ గలిగిన సమస్తము యెరుకే. శేషించియున్నది యెరుకే. ఏలననగా శేషించినది శూన్యము మాత్రమే. ఆ శూన్యము కూడ మహా శూన్యమైతే ఆ పిదప వుండేది యేది? ఏమో యెవరికి తెలుసు. ఎందుకనగా ఏమనుటకు వీలు కానిది. ఉన్నదని లేనిదని కూడ పలుక రానిది. ఏ పేరులేనిది. వ్యవహారార్థము పరిపూర్ణపరబయలని పేరు పెట్టారు. "నేతి నేతి నేతీతి హోవాచ" అని సర్వనిషేదావధి రూపముగా శేషించినది పరా యెరుకయే అని, అఖండ యెరుక యని పిలువ బడుతుంది. అదే అద్వైత సిద్ధాంతము నందు పరమ గమ్యము. ఇదే సర్వాధిష్ఠానము, సర్వమునకు అత్యంత మూల కారణము. "ఏకమేవాఽద్వితీయ బ్రహ్మ" యని చెప్పబడినది, అఖండ యెరుకయే యెరుక యొక్క అత్యంత శేష స్వరూపము. ఇదే పరిపూర్ణ పరబ్రహ్మమని యితురులు భ్రాంతి చెందినారు. నామరూపసహితమగునది, అఖండ స్వరూపమగు పరా యెరుక కానట్లు ఆ పరా యెరుక అత్యంతవిలక్షణముగా వున్నట్టు భ్రాంతి కలుగుతుంది. కాని విమర్శించి చూచినచో అన్ని అదే అయి యున్నది. పూర్ణత్వ శూన్యత్వములు దానివే. కనుకనే "పూర్ణ మన్యత్ స్థానం శూన్యమన్యత్ స్థానం" అని శ్రుతి జెప్పుచున్నది.

సత్పదార్థముగా అసత్పదార్థముగా, సదసత్పదార్థముగా అనిర్వచనీయముగా నున్నది. మాయా లక్షణములన్ని దీనికే సిద్ధస్తున్నవి. కనుక అన్ని యెరుకే, యేది యెరుక కాదు అని కూడ అనవలసి వస్తుంది.

**ఎరుకమూలము :**

ఇచట ఎరుక మూలము గురించి వివరించుట అప్రస్తుతముగాదు.

(అ) సర్వమునకు ఎరుకే మూల కారణముగా నున్నది. కాని దానికి మాత్రము మూలము లేదు. సృష్టికి కారణం వస్తువుగా ఏ బ్రహ్మమును యితరులు ప్రతిపాదించినారో అదే ఎరుక.

(ఆ) ఏ వస్తువునైన ప్రారంభముగా తీసుకొని కారణ పరంపరను విచారించిన చివరకు అత్యంత మూలకారణ వస్తువు యెరుకేనని తెలియుచున్నది. ఉదాహరణకు కుర్చీ. కుర్చీకి మూలము కఱ్ఱ, కఱ్ఱకు మూలము చెట్టు, చెట్టుకు మూలము పృథ్వీ, జలం, అగ్ని వాయువు, ఆకాశము, ఆత్మ(ఎరుక) వరుసగా పుట్టాయంటే ఆత్మకు కూడ పుట్టుక వుండి తీరాలి. ఎందుకనగా పుట్టని దాని నుండి మరొకటి పుట్టుటకు వీలులేదు. కనుక ఆత్మ (ఎరుక) దేని నుండి పుట్టినదనాలి, ఉన్నవి రెండే. 1. పరిపూర్ణపరబ్రహ్మము 2. లేనెరుక. పుట్టని పరిపూర్ణము నుండి యేది పుట్టదు. దాని యందెట్టి కారణ బీజములు లేవు. పుట్టించే సత్తా కలిగినది పుట్టేది కూడ ఎరుకే. కనుక యెరుకకు యెరుకే కారణమనాలి. అందుకే స్వతఃకారణమని, స్వయం ప్రకాశమని, స్వయంభూయని లేక సర్వకారణమని ఈలేనెరుక వర్ణింపబడుతుంది.

(ఇ) ఎరుక స్వకారణంగా తానే తోచింది. లేక ప్రకటమైనది. ఎట్లనగా "క.ద. 129 **చెట్టే మూలము విత్తుకు,। చెట్టుకు మూలమువిత్తు"** అని **"మేనెరుకల రెండింటిలో దాని యిది, దీని నదియు తగ సృజించున్"** అని భాగవత కృష్ణదేశికేంద్రుల వారు సెలవిచ్చియున్నారు.

(ఉ) మేను స్థూలమగు స్వరూపము, నేను సూక్ష్మమగు యెరుక స్వరూపము. ఈ నేను మేనులు పిండాండమందేగాక అధిష్ఠానమందే అన్వయము చేసుకోవాలి. నేను మేనుల ఏకైక రూపమగు ఎరుకకు వేరే మూలము లేదు, పరిపూర్ణమందు స్థానము లేదు. కనుక దీనిని లేనెరుక అన్నారు.

5. పరిపూర్ణ పరబ్రహ్మము సకలదేశాలయందు సర్వకాలాల యందు, సమస్త వస్తువులందు వున్నది. కనుక యెరుకయు దాని కారణరూపమగు సమస్తము గూడ పరిపూర్ణములోనే తోచవలెను. కాని అన్యస్థానములేదు గదా ! కనుక పరిపూర్ణమే యెరుకకు ఆధారము, అధిష్ఠానమని యితురులంటారు. అట్లనుట సరిగాదు. ఎందుకనగా యెరుకకు యెరుకయే ఆధారము అధిష్ఠానము అయి యున్నది. ఉ॥ రజ్జు-సర్పము, మృగజలమువలె (పరిపూర్ణ మందులేకనే) ఎరుక తనంతకు తానే తన యందే తాను తోచింది.

పరిపూర్ణము తప్ప తదన్యమంతయు ఎరుకే. అంతా ఎరుక స్వరూపమే.

**ఎరుక పుట్టనే లేదని అచల ఋషులంటున్నారు ఎందుకనగా :**

(అ) పరిపూర్ణపరబ్రహ్మమందు ఎరుక కేవిధంగా యుత్పత్తికి కారణము లేదు.

(ఆ) ఎరుకకు యెరుకనే మూలంగాని, యెరుకకు వేరే మూలము లేదు. కారణ రూపమగు యెరుకకు వేరే కారణము లేదని వారి అభిప్రాయమే గాని, కార్యరూపమగు జీవేశ్వర జగత్తునకు మూలము లేదనిగాని ఈ జీవేశ్వర జగత్తు లేనే లేదని వారి అభిప్రాయము గాదు. అందుకే (ఈ జీవేశ్వర జగత్తు లేనిదే అయితే) నీదారికడ్డముగా గోడ యొకటున్నప్పుడు గోడకడ్డముగా పోక దర్వాజ గుండ ఎందుకు పోతున్నావు. అని ప్రశ్నిస్తున్నారు.

(ఇ) ఎరుక పుట్టిన దంటే దేనివల్ల? ఎవరికి? అనే ప్రశ్నలు వస్తాయి. ఎరుక తనకు తానే వచ్చింది. తనరాకకు మరేది కారణము కాదు యని అచల ఋషుల జవాబు. ఉ॥ పాచి తీగ. అంతరతామర, వాటికి భూమితో సంబంధము లేకుండ తమకు తామే అల్లుకొని పోతాయి. పరిపూర్ణ మందు ఎరుకకు స్థానములేదు. కనుక ఈ ఎరుక తనయందే తోచి

తనయందే తాను లేకపోవుచున్నది. కనుక మూలము లేనిదానిని సత్యమనుటకు వీలు లేదు. అందుకే దీనికి లేనెరుకయని పేరు పెట్టారు. పుట్టనే లేదని కూడ ఆ కారణము చేతనే అనవలసి వచ్చినది.

(ఈ) పరిపూర్ణ పరబ్రహ్మమందు ఈ లేనెరుక రాను లేదు. పరిపూర్ణ పరబ్రహ్మమందు వుండెందుకు స్థానము లేదు. మరియు తిరిగి పోయెటందుకు మరొక స్థానము లేదు. ఈ లేనెరుక యెరుక జగములుగా భాసిస్తున్నది.

(ఉ) స్థూల సూక్ష్మరూపముగా ద్వంద్వ స్వరూపముగా వుండి ఈ ద్వంద్వములో ఒకటి మరొక దానికి కారణరూపమై మరల కార్యరూపముగా తానే వుత్పత్తి అవుతుంది.

(ఊ) యా మా సా మా యా అనే మాయా శబ్ద నిర్వచనాను సారము లేనిదేదో అది మాయ. కనుక పరిపూర్ణమందు ఎరుక లేదు కనుక మాయా శబ్దము దీని యెడల సార్థకమౌతుంది. **"మీయతే అనేన యితి మాయా"** అను నిర్వచనము ప్రకారము గూడ ప్రతి దానిని మితిలో చూపించి అణుప్రమాణంగాను, మహత్ ప్రమాణంగాను యేది మితిలో గాన వచ్చేది యిదే కనుక, ఎరుకకు మాయా లక్షణములన్ని సరిపోవుచున్నవి. అందుకే దానికి లేనెరుక యని పేరొచ్చింది. ఈ అన్ని కారణములచేత ఈ లేనెరుక పుట్టనే లేదని యన్నారు.

**ఎరుకను వదులుట :**

గురుముఖతః పరిపూర్ణమును, ఎరుకను ఎరిగి ఎరుకను మానుమని ఒక్కవాక్యములో పూర్ణ బోధ అంతా యిమిడి యున్నది.

శిష్యుడు మొదట యెరుకై నిలువ వలెను **"ఎరుక బ్రహ్మమనియె యిల శంకరార్యులు, తెలివి బ్రహ్మమనుచు తెలిపె వ్యాసు, లెరుక తెలువుల రెంట్నియెరుగడు వేమన ॥ విశ్వ॥** అనగా వ్యాస శంకరాదులు దేనిని బ్రహ్మముగా ప్రతిపాదించిరో అదే యెరుక. యెరుకైనిలుచుట అంటే అద్వైత సిద్ధి పొందుట. "జ్ఞానాదేవతు కైవల్యం" యనుశ్రుతి. జ్ఞాన జ్ఞేయములు రెండు ఒక్కటే. రెండు మనస్సే అని చెప్పబడినవి. **" మనోహి జతువత్"** అనగా మనస్సు లక్కవంటిది. కరిగిస్తే అది యేరూపమునైనను దాల్చును. అట్లే మనస్సు ఏ వస్తువు నందు లగ్నమైతే ఆ వస్తురూపమును దాల్చును. మనస్సు నిరీంద్రయమైనపుడు లేదా బ్రహ్మాకారముదాల్చి నపుడు అది బ్రహ్మము యొక్క రూపమునే దాల్చును. ఇదే బ్రహ్మ సాక్షాత్కారము. అప్పుడు శిష్యుడు ఆ లేనెరుక స్వరూపుడు తానేనని గుర్తించి ఆ సర్వస్వరూపమైన అఖండాత్మస్వరూపుడు తానే అయి నిలుచుటే ఆ లేనెరుకను తెలియుట. 212 **"శ్లో॥ స్వయం బ్రహ్మమయో భూత్వా। తత్పరం చావలోకయేత్"** యని గురుగీత గానము చేసినది. అవుడింక తెలివిచే తెలియదగిన యితరములేదు. అపుడు సర్వము తానై నిలిచిన తాను తనకన్యమగు పరిపూర్ణ పరబ్రహ్మము మాత్రమే వుంటుంది. పరిపూర్ణ పరబ్రహ్మమందు తనకు మూలము లేదనే విషయము యిచ్చటనే ఆరూఢమవుతుంది. అపుడు గురువు యెరుకను నిల్పకు మని చెప్పిన మాటను పాటించి పాలించుటయే. ఈ స్థితి యందుయెరుకను విడిచే సామర్థ్యము కలుగును. "ఎరుక కూకుదు వేరు నెరిగి త్రవ్వితే చాలు" నని శ్రీ కృష్ణదేశికేంద్రులవారలన్నారు. జ్ఞానజ్ఞేయరూపముగా నున్న తన స్వరూపము కంటే అన్యంగా పరిపూర్ణమందు తనకు మూలములేదని, నిలుచుటకు స్థానము లేదని తెలుసుకొని తానే బ్రహ్మననే భ్రాంతి పూర్తిగా వదిలి వేయుటయే ఎరుకను విడుట.

తన వ్యష్టిజ్ఞానము ఏ మాత్రము కించిజ్ఞాత్వాదిలక్షణము గలది కాదు. అది పరా యెరుకయే. కాని కాల దోష లక్షణములుండుటే దాని శక్తి సామర్థ్యములు మరుగుపడినవని గ్రహించి సర్వాతీతమైన పరాయెరుకయే సర్వగతమైనపుడు కేవల యెరుక (శుద్ధ యెరుక) వ్యష్ట్యుపాధి గతమై యున్నప్పుడు మిశ్రమ యెరుకయని పేరొందినదని, కనుక తానే పరా యెరుకయని, పరాయెరుకకు పరిపూర్ణ పరబ్రహ్మమందు మూలము లేదు గనుక, మూలములేని ఈ గుర్తెరిగే శరీరమునకు మూలము లేనేలేదని దోషములను దూరికృత మొనర్చుకొన్న శుద్ధాంతఃకరణముచే గ్రహించి ఆ ఆరూఢజ్ఞానముచే సుస్థితుడై యుండుటయే ఎరుకనుమానుట. ఈ అర్థములో వ్యష్టి యందుగాని, సమిష్టి యందుగాని యెరుక శూన్యమైనదా? ఎంత మాత్రముకాలేదు. మరియు ఎరుకపుట్టనేలేదని అచల ఋషుల సిద్ధాంతము. పుట్టని ఎరుక గిట్టబోదు. కనుక ఎరుకకు నాశనములేదు. కనుక వుండియు ఎరుకలేనిదే యగుచున్నది. ఎరుక అను కల బాసిన మనుజుడు కూడ కలలోపలి పనులు చేయుచునేయుండును. కాని, అట్టి కర్మ ఆగామిరూపముగా ఎట్టి అదృష్ట ఫలమును సృష్టించజాలదు.

**సర్వసదా సత్యవాక్యం:–** సత్యవాక్యమనగా వున్నది వున్నట్లు పలుకుట, భావించుట సత్యము. దానికి వ్యతిరేకముగా పలుకుట భావించుట అసత్యము. క.ద. 150 **"సత్యమగు బట్టబయలునసత్యం బగుయెరుక నెరిగి"** యని శ్రీ కృష్ణదేశికేంద్రుల వారన్నారు. అంటే పరిపూర్ణపరబయలు, ఏకరీతిగా తనయందు అన్యమేమి లేనిదానిని సత్యవస్తువు అన్నారు. రెండు సత్యవస్తువులుండుటకు వీలు లేదు. సత్యవస్తువొక్కటే. అదే పరిపూర్ణపరబాహ్యము. దానియందు ద్వంద్వరూపములుగా నున్నట్లు తోచుచున్నగాని నిజముగా పరిపూర్ణ పరబ్రహ్మమందు తోచినవన్ని లేనివి అశాశ్వతమైనవే. పరిపూర్ణ పరబ్రహ్మము సత్యమై నిత్యమై అన్యమేమిలేనిది. అందు సత్యవాక్యములేదు.

**భక్తి:–** పరిపూర్ణపరబ్రహ్మమందు భక్తి కూడ లేదు. భక్తియనగా ప్రేమ, భయముతో కూడినది భక్తి. వ్యష్టిరూప అంతఃకరణ వృత్తి కలిగియున్న భక్తుడు, సమిష్టి రూపమైన పరమాత్మ స్వరూపమును పొందుటయే భక్తి.

**"స్వస్వరూపానుసంధానం భక్తిరిత్యభి ధీయతే"** అనగా తన మనస్సు పరమాత్మ యందు నిలిపి అవిచ్ఛిన్న తైలధార వత్తుగా అనుసంధానము చేయుటయే భక్తి.

భక్తి అన్నప్పుడు ద్వైతం తప్పదు. భక్తుడు, మరొకడు భగవంతుడు. వారిద్దరి మధ్య అన్యోన్య సంబంధమే భక్తి. ఐతే భక్తునకు భగవంతుని యందుండేప్రేమను భక్తియని, భగవంతునికి భక్తునిపై నుండే ప్రేమను వాత్సల్యమని అనవలెను. తన మనస్సును తైలధారవలె పరమాత్మయందు నిలిపినట్లు పరిపూర్ణపరబ్రహ్మ యందు నిలిపిన పరిపూర్ణము అపరోక్షముగాదు. ఎందు కనగా పరిపూర్ణమందు భక్తిలేదు. అన్యమేమి లేనిది అది.

**జ్ఞానము:–** జ్ఞానము పరిపూర్ణపరబ్రహ్మమందు లేదు. ఎరుకలేనిది జ్ఞానము కాదు, అజ్ఞానము కాదు. జ్ఞాతృకాదు ద్రష్టకాదు. కనుక **త్రిపుటి రహితమే జ్ఞానము.** అంటే ఆత్మజ్ఞానమే జ్ఞానము.

అంతఃకరణ పరిణామ రూపమగు జ్ఞానమును యింద్రియ యుక్తాయుక్త, నిత్యానిత్య, ఆత్మానాత్మ వివేక యుతమైనప్పుడే దాని పేరు సార్థక్యత గాంచుచున్నది. 126 క.ప ॥ **జ్ఞానమగు**

**నీవు జ్ఞేయంబైన బయలుగాంచి। జ్ఞానమగు నిను నీవేలేనంచు తెలియుమని తానానరునకు వాసుదేవుడానతి యిచ్చెన్ ॥** అని శ్రీ కృష్ణదేశికేంద్రులవారు సెలవిచ్చియున్నారు. అనగా జ్ఞానమగు నీవు (అంతఃకరణము) జ్ఞేయంబగు అచల పరిపూర్ణపరబయలును తెలుసుకొని , తెలుసుకొన్నది జ్ఞానమే. గనుక జ్ఞానమగు నిన్ను నీవు లేనని తెలుసుకోమని **" జ్ఞానేన జ్ఞేయ మాలోకృపశ్చాత్ జ్ఞాన పరిత్యజేత్"** యనగా జ్ఞానము చేత జ్ఞేయమగు పరబయలును తెలుసుకొని జ్ఞానమగు నిన్ను నీవు విడిచి పెట్టుము. జ్ఞానమున కతీతమగు పరబయలును తెలుసుకొన్నంత వరకు ఈ జ్ఞానము, నేను పుట్టుచు గిట్టుచుండును.

జ్ఞేయము, మనము తెలుసుకొనేజ్ఞానము అచలపరిపూర్ణ పరబయలని అనుకొనుట తగదు. ఎందుకనగా పరిపూర్ణ పరబయలునందు అన్యమేమి లేదనిగాని, వున్నదనిగాని తెలియదు. అయినను మనము అచలమని చెప్పడము యొక్క లక్షణము యేమనగా చలన రూపమగు జ్ఞాన స్వరూపము (ఎరుక) అచల పరిపూర్ణపరబ్రహ్మమందులేదని తెలియగనే తాను వుళ్ళక్కియని తెలిసి, నిలిచేయందుకు తావులేక పరబయలు స్థితి యందు కర్తృత్వ రహిత కర్మాచరణ పద్ధతిగా తన్ను తాను విడిచి లేకపోవును. ఈ పద్ధతి సర్వదా ఆచరణీయము.

**శ్లో ॥ అశరీరం సర్వదాస్తి శరీరం రహితం సదా ।**
**అయమేవ సద్యోముక్తి రన్యథా భ్రమకారణమ్ ॥**

అనగా శరీరము లేని బ్రహ్మము ఎప్పుడు వుండి వున్నది. శరీరమెప్పుడును లేదు. ఈ సిద్ధాంతము దృఢమైన తక్షణమే సద్యోముక్తి లభించుచున్నది. ఇతర సిద్ధాంతములు భ్రాంతి కారకములే యగుచున్నవి.

**కర్మ :** మనస్సు తన్మాత్రలయొక్క ప్రేరణచే ప్రలోభపడి స్థూలశరీరము ద్వార కర్మ ఆచరించుటకై ప్రేరేపించుటయే కర్మ. దుష్టకర్మ సుకర్మలే బంధమోక్షములకు హేతువగును. కర్మకూడ పరిపూర్ణపరబయలు నందు లేదు. కర్మయనగా చేసే పని. 'కృ' అను ధాతువు నుండి వ్యుత్పత్తి. పనిచేయు కర్త – పూర్తి చేయబడినపని – ఆపనికి చేయునట్టి క్రియ ఈ మూడు కర్త, కర్మ, క్రియలు అనబడును. ఈ మూడు త్రిపుటి రూపముగా నుండి ఒక దాని నొకటి పూర్తిగా సంబంధింపబడి యున్నవి. కర్మయని శబ్దమునకు పని యని, ఆపని చేయుట వలన కలిగిన ఫలము అని రెండర్థములు గలవు.

అదృష్టఫలము, దృష్టఫలమని కర్మఫలములు రెండు విధములు:

**1. అదృష్ట ఫలము:–** అదృష్టమనగా కనబడని ఫలము. ఈ జన్మలో చేసిన పుణ్యపాప, కర్మలకు ఫలితము ఈ జన్మలోనే సిద్ధించక కాలాంతరమున, జన్మాంతరములో ఫలించును. వాటిని అదృష్ట ఫలము లందురు.

**2. దృష్టఫలము:–** ద్రష్టయనగా కనబడు ఫలము. ఈ జన్మలో చేసిన కర్మకు ఫలితము ఈ జన్మలోనే కలుగు సుఖదుఃఖములను దృష్ట ఫలమందురు. ఉ॥నిప్పు మీద చేయివేసిన కాలిబొబ్బలెక్కి బాధించును.

ఐహికాముష్మిక సుఖములకై చేయబడు కర్మలు ఆత్మైక్యరూపమగు మోక్షము గోరి చేయు కర్మలు కామ్యకర్మలే, మరియు బంధకారణములే. " కేవల మోక్షాపేక్ష సంకల్పోబంధః " అని నిరాలంబోపనిషత్ వాక్యము. మరియు క.ప.74 **"ఏ యాపేక్ష జనించిన । నాయాపేక్షలెల్లమాయు। యని తెలియదగున్"** అని శ్రీ కృష్ణదేశికేంద్రులవారు

సెలవిచ్చియున్నారు. అనగా మోక్షము కావాలని కోరుట బంధము. ప్రపంచపారమార్థిక కోరికలు మాయనే గనుక జన్మ బంధమని నిర్ణయము. కనుక సకల కోరికలను కర్తృత్వ రహిత కర్మాచరణముగా విడువుమని హితవు పలికినారు. ఈ కర్మలయందు స్వార్థమున్నది. స్వ+అర్థము = స్వార్థము. కనుక నిస్వార్థకర్మ లేక నిష్కామకర్మ కాజాలదు. తాను లేని దొక్క పరిపూర్ణపరబ్రహ్మము మాత్రమే. పరిపూర్ణభావజ్ఞుడు తాను లేనేలేనని ఆరూఢతపై చేయు కర్మలే నిస్వార్థకర్మలు కాగలవు. అతడే అకర్త. కర్మలు చేసియు చేయని వాడగుచున్నాడు. తాను లేదు గనుక కర్మఫలము లంటునా ? ఇట్టి భావనతో చేయబడు కర్మాచరణ విధానమే అశరీర పద్ధతి. ఈ పద్ధతి యందు కర్తృత్వాభిమానము లేకుండుట వల్ల కర్మఫల భోక్తృత్వముండదు. ఎట్లనగా యాజమాని జెప్పినట్లు సమస్త వ్యవహారములు చేయు గుమాస్తాకు ఆ వ్యవహారములో కలుగు లాభనష్టములతో యెట్టి సంబంధము నుండ జాలదు. అట్లే నా సమస్తము గురునికే యర్పించి, ఆత్మనివేదన గావించియున్నాను. నేను నిమిత్త మాత్రుడనై నా విద్యుక్త ధర్మములను ఆచరించుచున్నాను. అందలి జయాపజయములతో, లాభనష్టాలతో నాకు నిమిత్తము లేదు. పరిపూర్ణ రాజయోగములో కర్మ, భక్తి,జ్ఞాన మార్గములున్నవిగాని, పరిపూర్ణపరబ్రహ్మయందు కర్మ, భక్తి, జ్ఞానములు లేవని నిర్ణయము.

**శక్తిచ:-** పరిపూర్ణ పరబ్రహ్మమందు శక్తి కూడ లేదని నిశ్చయము. మానవునికి ముఖ్యంగా త్రికరణశక్తులు కలవు. త్రికరణ శక్తులనగా శరీరశక్తి, మనశ్శక్తి మరియు మానసిక శక్తి లేకవాక్‌శక్తి. శరీరశక్తి లేనంత మాత్రమున మానవుడు శక్తి మంతుడు గాదు. శరీర శక్తి భౌతికమైన క్రియలకు మాత్రమే సహాయము చేయగలదు. మానసిక శక్తి లేకుంటే గురుబోధను గ్రాహ్యమొనర్చుకొనలేడు. మనన నిధి ధ్యాస చేయలేడు. బోధ ఆరూఢపరుచుకొనలేడు. ఏకాగ్రత కుదురదు. మనోదార్ఢ్యము లేనిచో సచ్ఛీలము నలవర్చుకొనలేడు. అంతఃకరణ శుద్ధి గావించుకొనలేడు. ఆత్మసాక్షాత్కారము పొందలేడు. ఉన్నది వున్నట్లుగాను, లేనిది లేనట్లుగాను ఆరూఢ జ్ఞానము సాధించలేడు. చక్కగా శ్రవణము చేయలేడు. వినలేడు, విన నేర్చేగాని, సిద్ధి సిద్ధించదు.

వాక్కు యొక్క శక్తి చెప్పనేర్పుకలిగించును. క.ద. 197 **"విననేర్చి చెప్పనేర్చిన మనుజలకే దీనిలోని మర్మము తెలియుసున్"** అని శ్రీ కృష్ణదేశికేంద్రులవారు సెలవిచ్చియున్నారు. **"స్వయం తీర్ణః పరాన్ తారయతి"** అను విధముగా యితరులను తరింపజేయక గురు ఋణము తీర్చుకొనలేడు. ఈ త్రివిధ శక్తులు లేనివారు పరిపూర్ణ బోధను గ్రహించుట కర్హులు కారు.

ఏది కారణమందు లేకుంటే కార్యోత్పత్తి కాజాలదో అదే శక్తి. కనుక పరబ్రహ్మమందు కూడ యిట్టిశక్తి గలదు. కాని పరబ్రహ్మము వినా ఈ శక్తికి ఉనికి లేదు. "శక్తియే జగత్తునకు కారణం" అన్నవారు గూడ చివరకు బ్రహ్మమే సృష్టికి కారణమని అంగీకరించినారు బ్రహ్మాచైతన్యాశ్రితమాయచైతన్యమును విడిచి యుండదు. కనుక చైతన్యమునకే శక్తియనియు, చేతన శక్తియని పేర్లు వచ్చినవి. బ్రహ్మము నందు బీజరూపముగా అణగి మణిగి యున్న సత్వరజస్తమో గుణములు మూడు కలసి త్రిగుణాత్మకమగు మూలమాయగానున్నది. ఇందు:

1. సత్వగుణము = శుద్ధ మాయ మహత్తు జ్ఞానశక్తి చిచ్ఛక్తియని పిలువబడును.
2. రజోగుణము = మిశ్రమమాయ, మహదహంకారము యిచ్ఛాశక్తి యనబడును.

3. తమోగుణము= మలినమాయ, పంచతన్మాత్రలు,ఆవరణశక్తి లేక ద్రవ్యశక్తియనబడును.

గుణత్రయ పద్ధతిగా గాక శక్తి బాహాటముగా రెండు ప్రధానశక్తులుగా చెప్పవచ్చును.

1. చేతన శక్తి, జీవశక్తి లేకపురుషశక్తి. ఇదియే పరాప్రకృతి యనబడును. తెలివిరూపమగుచిచ్ఛక్తి.

2. అచేతన శక్తి:- జడశక్తి, ప్రకృతి శక్తి. ఇది అపరా ప్రకృతిరూపముగా నున్నది. యిది విస్మృతి రూపమగు ఆవరణశక్తి.

చేతనశక్తి ప్రాణుల యందును, అచేతన శక్తి భౌతిక పదార్థములందునూ కలవు. అచేతన శక్తికి, అగ్ని యొక్క దాహక శక్తియు వాయువు యొక్క చలనశక్తియు ఉదాహరణలు. పరమాణువుల యందున్నది అచేతన మగు చలనశక్తియే. శక్తి యొక్క అచలరూపము పురుషుడనియు, చలనరూపము మాయ యనియు లేక ప్రకృతి యని యనదగును. పురుష ప్రకృతులు రెండు తన యందే గర్భీకృతము జేసుకొనియున్నదే బ్రహ్మము. ఇట్టి శక్తి రూపమునను బ్రహ్మము పరిపూర్ణ పరబ్రహ్మము నందులేదని నిశ్చయము.

**సర్వవ్యాప్తం :** పరిపూర్ణ పరబ్రహ్మము అంతట వ్యాపించియున్నదని అర్థము. శ్రీ కృష్ణదేశికేంద్రులవారు క.ద.34 **"పలుకున బలుకగరాకను । తలపోయుదమనిన మదికి దగులక యెపుడున్ । ములుగృచ్ఛ సందులేకను। కలిగున్నది బట్టబయలు । గదరా మాయన్న । యిదిగో చూడు కదులాదో యన్నా ।"** అని శెలవిచ్చియున్నారు. అనగా పరిపూర్ణబ్రహ్మము అంతట సర్వవ్యాప్తమై ఎట్లున్నదంటే ములు గుచ్చుటకు కూడ సందులేక యున్నది. మరెట్లు వ్యాపించి యున్నదంటే కదిలేందుకు కూడ వీలు లేదు. అంటే పరిపూర్ణ పరబ్రహ్మము అంతట వ్యాపించి యుండుటవల్ల ములుగ్రుచ్చ సందులేకుండుట వల్ల అది కదలదు యితర వస్తువులను కదిలించడానికి వీలు లేకుండా యున్నది.

**147 క.ద.ఏ పరిపూర్ణ మేనికి । లోపల వెలి నిండియుండు। లోపము లేకన్ । ఆ పరిపూర్ణమే జగతికి ।లోపల వెలినుండు దాని। లోనే వున్నవి రా। పై రెండెవ్విలేని వెన్నకురా।।"**

అనగా ఏ పరిపూర్ణ పరబ్రహ్మము శరీరముల బాహ్యాంతరముల గలదో ఆ అచల పరిపూర్ణకేవలాత్మనే జగత్తు యొక్క లోపల వెలుపల ములు గ్రుచ్చ సందులేక నిండియున్నది. అంటే అది సర్వవ్యాప్తమైయున్నది.

ఈ సిద్ధాంతమును ఉద్ధరించిన శ్రీ శివరామదీక్షితులవారు పరిపూర్ణపరబ్రహ్మమును గూర్చి ఈ క్రింది విధముగా వివరించారు:-

1. "పుట్టనిది - చావనిది, రాకడపోకడలేనిది, సకల దేశాల యందు, సర్వకాలాల యందు, సమస్తమైన వస్తువులందు , మొదలుకొన లేక, చలించక, వక్క తీరుగా తనకు తానే స్వత సిద్ధమైనది" అన్నారు అంటే పరిపూర్ణ పరబ్రహ్మము సర్వవ్యాప్తమైనదని తెలియవలయును.

**సచ్చిదానందరహితం :** పరిపూర్ణపరబ్రహ్మమందు చేతన బ్రహ్మమునకు జెప్పబడిన సచ్చిదానంద లక్షణములు రహితము. మొదట సచ్చిదానందములంటే ఏమిటో తెలుసుకొందము.

సత్తు + చిత్తు + ఆనందము యను మూడు పదముల కలయికనే సచ్చిదానందము. వీటిని బ్రహ్మమునకు లక్షణములుగా జెప్పబడినవి.

1. **సత్తు** అనగా జాగ్రదావస్థ యందు శబ్ద స్పర్శ రూప రస గంధ విషయములు

నానా విధములుగా యుండుటవల్ల వేర్వేరుగా గ్రహింపబడుచున్నవి. సంవిత్తు మాత్రము (తెలివి మాత్రము) జాగ్రదావస్థ యందున్న ఏకరూపమే స్వప్నావస్థ యందున్నది. సుషుప్త్యావస్థ యందు తమోరూపముగానున్న అజ్ఞానము సంవిత్తుచే యెరుగ బడుచున్నది. కనుక జాగ్రత్త, స్వప్న, సుషుప్త్యా వస్థాత్రయ ఆచారవ్యవహారములందు మార్పుగలుచున్నవి. గాని సంవిత్తు మాత్రము భేదింపబడక ఏక రూపముగా యుండుట వలన సంవిత్తు సత్యమగును. అట్టి సత్యపదార్థము సంవిత్తే సత్తు యనబడును.

**చిత్తు :** అవస్థాత్రయములందు తెలియబడువిషయములు తెలుసుకొనునవి కానందున అవి జడములనబడును. ప్రతి దేహమందు బుద్ధి, వృత్తులకు సాక్షిగా యుండి యితర సహాయము లేక తనంతట తాను ప్రకాశించవు. తనంతట తాను ప్రకాశించుచు సర్వమును యెరుగు చున్నందున సంవిత్తు జ్ఞానమనబడును. కావున అది చిత్ యనబడును.

**ఆనందము:–** "నేను" శబ్దమునకు వాచ్యమై, నాకెపుడును నాశము లేదనే ప్రేమ స్వరూపమును ఆనందమనబడును. ఇదియే సచ్చిదానంద స్వరూపము.

సామవేదము నందు "సచ్చిదానంద మాత్మన మద్వితీయం బ్రహ్మ భావయేత్" అనగా

1. కాలత్రయమున బాధింపబడనిది సత్పదార్థము **సత్తు**
2. ఇతర సహాయములేక సర్వము తెలుసుకొనునది చిత్ పదార్థము – **చిత్తు**
3. నిరతిశయ ప్రేమరూపమైన ఆత్మానందము బ్రహ్మమే – **ఆనందము.**

ఉపాధులలో ప్రవేశించుట వలన ఆత్మయని చెప్పబడును. బ్రహ్మము ఉపాధి భేదముచే సత్తు,చిత్తు, ఆనందము, ఆత్మయని పర్యాయ పదములు చెప్పబడినవి. కాని యిన్నిటి యందు స్వప్రకాశమైన బ్రహ్మ మద్వితీయమని భావము. ఈ సచ్చిదానందములు పరిపూర్ణ పరబ్రహ్మమందులేవు. శ్రీ భూమానంద హనమయాఖ్యుడు ఒకానొక తత్వం నందు పరిపూర్ణపరబ్రహ్మను తెలియ జేస్తు యిట్లు గానము జేసి యున్నారు.

**ఉన్నది గురుదన్నది నే । కన్న దంతట నున్నది ।**
**వున్నదేమో నున్నది । నేనన్నదే లేకున్నది ॥** ॥ఉన్నది॥
**సత్తు చిత్తులు గానిది అది । వుత్తబయలైయున్నది।**
**విత్తు చెట్టుమర్మమెరిగితే । విశ్వమే లేకున్నది ।** ॥ఉన్నది॥

అనగా పరిపూర్ణ పరబ్రహ్మము సత్తు చిత్తు ఆనందము లేనిది. అది గురుముఖమున దెలుసుకొని అది వున్నదని నమ్మి నేనన్న దానిని వదిలుండుమని ప్రబోధించియున్నారు.

**2. బ్రహ్మాండ వ్యాపితం బాహ్యం । బాహ్యం సర్వత్ర వ్యాప్తం ।**
**అంతర్బహిశ్చతద్బాహ్యం । అన్యం నాస్తీతి నిశ్చయం**

పరిపూర్ణ పరబయలు బ్రహ్మాండమంతట వ్యాపించియున్నది. బ్రహ్మాండమునకు లోపల వెలుపల ఆ పరిపూర్ణపరబయలే వ్యాపించి యున్నది. అందు యితరమైనది మరొకటి లేదని నిర్ణయము. **వివరములు :–**

**బ్రహ్మాండ వ్యాపితం బాహ్యం సర్వత్రవ్యాప్తం:** బ్రహ్మాండమనగా బ్రహ్మము దానికి ఆవరణ రూపమైన శరీర తుల్యమగు ఆకాశము, ఈ రెండింటితో కూడినదని బ్రహ్మాండమున కర్థము. ఇందలి ఆకాశము అపంచీకృతమగు మహాకాశము. ఈ బ్రహ్మాండ మొక్కటియే అయి యున్నది. స్వర్గ మర్త్యపాతాళములు యని లోక నిర్ణయము గలది బ్రహ్మాండమని

నిర్ణయము. పరిపూర్ణ పరబ్రహ్మము బ్రహ్మాండమునకు లోపల వెలుపల వ్యాపించియున్నది. శ్రుతి॥ "యదేవహ తదముత్ర యదముత్ర తదన్విహ। మృత్యోస్సమృత్యు, మాప్నోతియ ఇహనా నేవ పశ్యతి" ॥ కఠోపనిషత్.తా॥ ఇక్కడేమున్నదో, దీనికి (ఈ పిండాండ మందు) బయట (అనగా బ్రహ్మాండమందు) అదే యున్నది. ఈ విధముగా గమనించని వానికి జన్మ పరం పరలు తప్పవు. కాని ఒకటి మాత్రము నిజము, పిండ బ్రహ్మాండములందు ఎక్కడ పరీక్షిస్తే అక్కడ జ్ఞానరూపమైన యెరుక వున్నట్లు తెలియబడుతుంది. ఎక్కడ చూచిన యున్నది కాని ఏక కాలంలో అంతట లేదు. ఒకనికి కాలు నొప్పి వచ్చింది. అదే సమయానికి పుప్పిపంటి బాధ అధికమైంది.అప్పుడు అతని గుర్తు కాలు నొప్పి వున్న స్థానములో తప్పుకొని పుప్పి పంటి స్థానమందు కేంద్రీకృతమైయున్నది. కాలునొప్పి అప్పుడు అతనిని బాధించుటలేదు. కాలునొప్పి కనిపిస్తూవున్న ఒక క్షణంలో రెండు మాత్రం అతడు గుర్తించుట లేదు. ఈ రెండుజ్ఞానములకు కనీసం ఒక్క క్షణమైన వ్యవధి యుండకతప్పదు.

అట్లే బ్రహ్మాండములో కూడ యని తెలియవలయును. ఉదాహరణకు టీచర్స్‌కాలనీలో వున్న నాకుమారునితో మాట్లాతున్నట్లు పగటి కల కంటున్న సమయమున నా ఎదుట నిలబడ్డ వ్యక్తి నాకు కనబడదు. అతని మాట నాకు వినబడదు. ఆ సమయములో నా గుర్తు (జ్ఞానము) నా కుమారుని రూపనామ క్రియలందు లగ్నమై తన్మయమైవున్నది. అప్పుడు నా స్థూల దేహింద్రియాదులున్న స్థానము గుర్తు లేదనుటకు వీలు లేదు. కనుక ఒకే సమయములో జ్ఞాన రూపమైన ఇతరులు చెప్పె బ్రహ్మాండమంతట కలదనరాదు. బ్రహ్మాండములంతట, లోపల వెలువల క్రింద మీద అన్నిటి యందు యనగా పరిపూర్ణపరబ్రహ్మము సర్వత్రా వ్యాపించియున్నది.

**అంతర్బహిశ్చ తద్బాహ్యం, అన్యం నాస్తీతి నిశ్చయం :**

**అంతర్బహిశ్చ తద్బాహ్యం :** అనగా పరిపూర్ణ బ్రహ్మము బ్రహ్మాండములకు లోపల వెలుపల వ్యాపించియున్నది. పరిపూర్ణ అచలధ్యానమును పరిశీలించిన పరిపూర్ణపరబ్రహ్మము తూర్పున ఆలంబనములేనిదిగా ఆగ్నేయమున నిర్గుణంగా, దక్షిణ దిక్కున శుద్ధమైనదిగా, నైఋతి దిక్కున నిరుపద్రవంగా, పశ్చిమమున కళంకములేనిదిగా, వాయవ్యమున నిరంజనముగా, ఉత్తరమున నిరాకాశముగా, ఈశాన్యదిక్కున నిర్మలముగా, పైన నిరాకారముగా, క్రింది భాగమున నిర్వికారముగా, లోపల బయట అంతట ఈ సనాతనమైన పురాతనమైన అచలము నిండి నిబిడీకృతమైయున్నది. శ్రీ కృష్ణదేశికేంద్రుల వారు 34.క.ద॥ **"పలుకున బలుకగ రాకను । తలపోయు దమనిన మదికి దగులక యెపుడున్ । ములు గృచ్చ సంధిలేకను । కలిగున్నది బట్టబయలు। గదరామాయన్నా ।"** యిదిగో చూడు కదులాదో యన్నా ! పరిపూర్ణపరబయలు ముల్లు గ్రుచ్చసందులేక యున్నది. మరెట్లున్నదనగా అది కదలక యితర వస్తువులను కదిలించక అస్థిరమనునది లేక స్థిరముగా యున్నదని తెల్పినారు.

**అన్యం నాస్తీతి నిశ్చయం:-** పరిపూర్ణ పరబ్రహ్మ మందు యితరమైనది ఏ కొంచమైనలేదని అర్థము. శ్రీ కృష్ణ దేశికేంద్రులవారు 54. క.ద॥ **"పరిపూర్ణ మొకటిదక్క । నితరమైన ప్రపంచమెల్ల దగ తెలియుమునీవెరుకేనని మదిలోపల"** అని శెలవిచ్చియున్నారు. అనగా పరిపూర్ణ పర బాహ్యమొక్కటి దక్క ఇతరమైన ప్రపంచమంతయు యెరుకయే యని మనసులో యెరుగుమని తెల్పియున్నారు.

పరిపూర్ణ పరబ్రహ్మమునకు ఆది మధ్యాంతములు లేవు. సర్వత్ర నిండి నిబిడీకృతమై సూది కొన మోపుటకైనను తావు లేక నిండి యున్నది. అది కేవల మఖండమైయున్నది. దాని యందు జ్ఞానము (ఎరుక) గాని, కర్మ చేయుటకు వలయు ప్రాణ శక్తిగాని, యింద్రియములుగాని వానిని నడిపించు అధిష్ఠాన దేవతలుగాని లేవు. పరిపూర్ణపరబ్రహ్మమును **"నిశ్శక్తిః నిర్మలం పూర్ణం"** అని వర్ణించినారు. దాని యందు గుర్తెరుగు తెలివి లేదు. వేయేల దాని యందు యితరమైనది యేది లేదు . అది తప్ప యితర మేమి లేదని చెప్పినప్పుడు దాని యందు, తెలివి, ప్రాణము గాని లేదు. వృద్ధిక్షయములు పొందనిది. ఇతరమేదైన అందుతోచిన అది ఎండమావులవలె సురస్వప్నమువలె లేనిది యగును. కనుక సృష్టి కారణమైన వస్తువు సృష్టిగా మారినది కనుక ఈ కారణ కార్యములు రెండు ఎండమావుల వలె తోచుటే గాని నిజముగా లేనేలేవు. కల యందు తోచిన శరీరములవలెనే కల యందు మాత్రమే నున్నట్లు తోచబడునే గాని కలనుండియు మేల్కొన్న పిదప యీషణ్మాత్రమెట్లు లేదో అట్లే యేమియు లేదు. అట్లే గుర్తెరుగు శరీరమునకు " ఆకాశశ్శరీరం బ్రహ్మ" అని చెప్పబడినట్లుగా మనసుకు గోచరించు మహాకాశమే శరీరముగా నున్నది. ఈ దేహి, దేహములు రెండు ఒక దాని నొకటి విడువక రెండు కలసి ఏక వుస్తువుగా నున్నది. దీనికి పరిపూర్ణపరబ్రహ్మమునందు స్థానముగాని మూలముగాని లేదు. కనుక పరిపూర్ణ పరబ్రహ్మమందు ఇతరమైనది యీషణ్మాత్రము లేదని నిర్ణయము.

**3. ఇతి నిశ్చత్యయో విద్వాన్ । అచల ఏవనసంశయః**
**సద్రూపంనాస్తిసర్వత్ర । చిద్రూపంనాస్తి సర్వదా**
**4. ఆనంద రూపగ్ంనాస్తి । అచలంచాస్తి సర్వదా**
**సర్వానందవిహీనశ్చ । అచలోయం సనాతనః**

పైన శ్లోకము నందు చెప్పబడినట్లుగా పరిపూర్ణపరబాహ్య మంతట వున్నది. లేదనెడి సంశయమున కతీతుడైన వాడే విద్వాంసుడు. అంతట గల అచలమును గూర్చి ఏలాంటి అనుమానము వలదు. పరిపూర్ణపరబ్రహ్మమందు అంతట సద్రూపము, ఎల్లప్పుడు చిద్రూపము (జ్ఞానరూపము) లేదు. అంతట అచల పరిపూర్ణపరబాహ్యమే యున్నది. అందు సర్వానందములు లేవు. అది అనాది. అతి పూరాతనమైనది శాశ్వతమైనది. **వివరములు :-**

**ఇతి నిశ్చత్వయో విద్వాన్ అచల ఏవనసంశయ :** అనగా పరిపూర్ణబాహ్యము అంతట వున్నది. లేదనెడి సంశయమున కతీతుడైనవాడే విద్వాంసుడు. చలాచలములు సత్యాసత్యములు ద్వంద్వములు సాపేక్షకములు. పలుకల కందనిది. కనుక ద్వంద్వములతో సూచించరానిది. సచ్చిదానంద బ్రహ్మము సర్వమునై వున్నందున సర్వ దంద్వములు అదే. పరిపూర్ణపరబ్రహ్మము తెలియబడినదనిగాని తెలియరానిదని గాని చెప్పుటకు వీలులేనిది. పరిపూర్ణపరబ్రహ్మము పరిపూర్ణ బోధజ్ఞులైన పండితులచే సమీపింప దగినది. పొంద దగినది అనగా దానిని అపరోక్షము గావించుకొన్నవాడే పండితుడు. అట్టి పండితునికి పరిపూర్ణ పరబ్రహ్మమున్నది, గనుక వున్నదని గాని లేదనెడి సంశయమేలేదు. విద్వాన్ అనే మాటకు శాస్త్ర పండితుడని అర్థం కాదు. "పాండిత్యం నిర్విద్యా" అనిశ్రుతి. విద్యావిద్యల రెంటికి అతీతమైన నిర్విద్యా స్వరూపమే పరిపూర్ణ పరబ్రహ్మము. గురూపదిష్టమార్గమున అనగా లేనెరుకతో దానిని గనిపెట్టిన వాడే పండితుడు. **"చూస్తునే యెరుక పారిపోవురా"** అన్నారు. శ్రీ కృష్ణదేశికేంద్రులవారు.

చూచిన యెరుక చూచితిననిగాని, చూడలేదని గాని అతడెన్నడు చెప్పజాలడు. అతనికి అది అపరోక్షము గనుక పరిపూర్ణప్రబోధజ్ఞుడని జెప్పనగును.

**1. సద్రూపం నాస్తి సర్వత్ర** = అంతట పరిపూర్ణ పరబాహ్యము నందు సద్రూపము లేదు.

**2. చిద్రూపం నాస్తి సర్వదా** = ఎల్లప్పుడు జ్ఞానస్వరూపము లేనిదది.

**3. ఆనంద రూపగ్ం నాస్తి** = ఆనందరూపములేనిదికూడ అదే.

సత్+చిత్+ఆనందములు లేనిది పరిపూర్ణపరబ్రహ్మము.

**సత్** యనగా త్రికాలములందు ఉనికి కలిగి, అనగా భూత భవిష్యత్ వర్తమాన కాలములందు ఎడతెరపి లేకుండయున్నటువంటి వస్తువేదో అదే సత్ అని చెప్పబడును.

**చిత్** యనగా నాశనము లేనిదై అఖండజ్ఞాన స్వరూపమైన దానికి చిత్ యని పేరు.

**ఆనందమనగా** అఖండానంద స్వరూపమై యుండుటయే ఆనందము.

బ్రహ్మకీ సల్లక్షణ, చిల్లక్షణ, ఆనందలక్షణములుగా నిర్ణయించబడినవి. కనుక ఈ అధిష్ఠాన చేతన బ్రహ్మకు సచ్చిదనాంద బ్రహ్మమని పేరు వచ్చినది. ఈ మూడు లక్షణములు లేనిది పరిపూర్ణ పరబ్రహ్మము.

శ్రుతి॥ **"యతోవా యిమాని భూతాని జాయంతి, యేన జాతాని జీవంతి, యత్ప్రయంత్యభిసం విశంతి తద్వి జిజ్ఞాసస్వ తద్బ్రహ్మేతి॥"** అనగా దేని నుండి సర్వభూతములు పుట్టుచున్నవో, పుట్టి దేని యందుండి పెరుగుచున్నవో రూపములు మార్చుకొని తిరిగి దేని యందు ప్రవేశించు చున్నవో అదియే బ్రహ్మమని తైత్తిరీయోపనిషత్తు చెప్పుచున్నది. అనగా సృష్టి, స్థితి, లయములకు కారణమైనది బ్రహ్మమని తాత్పర్యము.

కారణ స్వరూపమైన బ్రహ్మ లక్షణములు కార్యరూపములగు ఈశ్వరజగత్తుల యందుండక తప్పదు. ఈ సచ్చిదానంద లక్షణములు జీవేశ్వరజగత్తు నందు కానవచ్చు చున్నవి. ఎట్లు అంటే

1. వస్తువు వుండుట యే సల్లక్షణము.

2. ఆకార వికార రూప పరిణామాదులచే నది తోచబడుటయే చిల్లక్షణము.

3. ఆ వస్తువు యొక్క ప్రయోజనమును పురస్కరించుకొని దాని యందేర్పడు ప్రియమోద ప్రమోదములే ఆనంద లక్షణము.

మానవుని యందు ఈ సచ్చిదానంద లక్షణములు మరీ ప్రస్ఫుటముగా గాన వస్తున్నది. తన పరిసరము లందు సర్వులు మరణము పొందుచున్నను. ఇంకా ఎంతో కాలము తాను బ్రతక గలనని భ్రాంతి చెందుచుండుటకు తన స్వరూపలక్షణ మందు తానుత్రికాల బాధ్యుడగు సత్యరూపుడుగా నుండుటయే కారణము.

తనకు తెలియనిదంటూ లేదని సర్వము తాను తెలుసుకొనవలెనని అకాంక్షిస్తూ వుండుటకు స్వరూప స్థితి యందు తానఖండ స్వరూపుడగు చిత్స్వరూపుడై యుండుటకు కారణము.

సర్వకాల సర్వావస్థల యందు ఆనందమే కావాలని కోరుకొనుట తాను ఆనంద స్వరూపుడై యుండుట మాత్రమే. ఈ విధముగా మానవుని యందు సచ్చిదానందములు ద్యోతకము లగుచున్నవి.

అట్లే ప్రాణభీతి, ఆహార, సముపార్జన విషయములలో తల్లి వలన తెలివి సంపాదించి

శరీర సుఖమునకై ప్రాకులాడుటను బట్టి పశుపక్ష్యాదులందు సచ్చిదానందములు భాసిస్తునే యున్నవి.

సచ్చిదానంద స్వరూపమగు బ్రహ్మమే సగుణ రూపములో ఈశ్వరుడనిపించు కొనుచున్నందున ఈశ్వరునియందలి సచ్చిదానంద లక్షణము గలవని చెప్ప నక్కరలేదు.

ఈ విధముగా జీవేశ్వర జగత్తు సచ్చిదానంద మయమైయున్నది. "**తేనవినాతృణాగ్రమపి నచలతి**" అనగా ఆ బ్రహ్మము లేక గడ్డిపోచయైన కదలదు. ఆ బ్రహ్మమే గొప్పవస్తువు. అంతకంటే గొప్పది లేదు. అదియే గురు స్వరూపము.

పరిపూర్ణపరబ్రహ్మమునకు ఈ సచ్చిదానందములు లేవు. అది స్వయం ప్రకాశముగాదు. అది స్వతసిద్ధమైనది. అచలమే సర్వదా యున్నది.

**సర్వానంద విహీనంచ :** పరిపూర్ణ పరబ్రహ్మము సర్వానందములు లేనిది. సుఖదుఃఖము లనేటివి ద్వంద్వములు. ఈ సుఖదుఃఖములు రెండు శబ్ద, స్పర్శ రూప, రస, గంధాత్మకముగా నున్నవి. కాని ఆనందము శబ్దాది విషయ జన్యమగునట్టిది కాదు. వాని కతీతమైనది బ్రహ్మము. పంచతన్మాత్రరూప పరిణామము చెందని స్థితిలో తానుతానుగా నిస్సంకల్ప స్థితిలో నున్న బ్రహ్మము యొక్క విలక్షణ స్థితియే ఆనందము. ఆనందమే బ్రహ్మమునకు స్వరూప లక్షణమై యున్నది. " ఆనందోబ్రహ్మేతి విజానీయాత్" అని అభివర్ణింపబడినది.

విషయపంచక మనునది విషయానందము. ఇది క్షణికము, నశ్వరము దుఃఖాత్మకమై యుండును. "**సంతోషాసంతోషము లంతలో గాన వచ్చి పిదప నరుగు నెచటికో వింతయై యున్నది చూచితే**" అని అన్నారు శ్రీకృష్ణదేశికేంద్రులవారు.

విషయానందమే మనుష్యానందము. దీని పైన 1. మనుష్య గ్రంధర్వానందము 2. దేవ గంధర్వానందము 3. పితృదేవతల ఆనందము 4. అజ్ఞాన జ్ఞాన దేవానందము. 5. కర్మదేవానందము 6. దేవానందము 7. ఇంద్రానందము 8. బృహస్పత్యానందము 9. ప్రజాపత్యానందము. 10. బ్రహ్మానందము. ఇందు చెప్పబడ్డ పూర్వానందముల కంటే పుత్తరోత్తరానందముతో నూరు రేట్లు హెచ్చు. అనగా మనుష్యానందము కంటే నూరు రేట్లు మనుష్య గంధర్వానందములు. దానికంటే నూరురేట్లు దేవ గంధర్వానందము. ఇట్లు లెక్కిస్తే మనుష్యానందము కంటే బ్రహ్మానందము $(100)^{10}$ హెచ్చు. అనగా ఒకటేసి ఇరవై సున్నలు చుట్టుతే ఏ సంఖ్య వచ్చునో అన్ని రేట్లు బ్రహ్మానందము విషయానందము కంటే హెచ్చు. అన్ని ఆనందములతో పాటు హెచ్చైన బ్రహ్మానందము కూడ పరిపూర్ణబ్రహ్మమునలేదని యర్థము.

**అచలోయం సనాతనం:-** అనగా అచల పరిపూర్ణపరబ్రహ్మము శాశ్వతమైనది. అతి పూరాతనమైనది. అనాది, మూలము (కారణము) లేనిది. ఆరంభమంటు లేనిదని రెండర్థములు. శాశ్వతమైనది సామాన్యార్థము. మూలము లేదనుట వల్ల దానికి మాతృత్వము లేదని స్పష్టము. స్వత సిద్ధమైన దొక్క పరిపూర్ణ పరబ్రహ్మమే. మరియు అది కార్యకారణ పరంపరలో చేరదు.

ద్వంద్వములన్ని సచ్చిదానంద పరమాత్మ రూపాంతరములే. కనుక యే స్థానములో చూచిన, పిండ బ్రహ్మాండములో గాని, అఖండాత్మ స్వరూపము నందు గాని కేవాలచల స్థితి లేదు. ప్రత్యగాత్మ సమాధి యందు నిశ్చలముగా యున్నదని చెప్పినా సృష్టికి పూర్వము పరమాత్మ

అచలంగా యున్నదని చెప్పినా తదనంతరము చలన రూపము వహిస్తూ ఉన్నవి. కనుక చలాచల స్థితులు రెండు ప్రత్యగాత్మ పరమాత్మ రెంటికిని వున్నవి. ఈ రెంటి యొక్క అఖండత్వము నందు కూడా చలాచలస్థితులు రెండున్నవని చెప్పాలి. కనుక అచలోయం సనాతనః అని చెప్పబడిన మాట కేవలం అచల స్వరూపముగా నుండి చలనమెప్పుడు ఎరుగని పరిపూర్ణపరబ్రహ్మ యొక్క దానికే చెల్లును.

**5. ఆనంద రహితమచలం । కర్తృకార్య వివర్జితం**
**సత్యాసత్య విహీనంచ । విద్యావిద్య వివర్జితం**
**6. ద్వైతాద్వైత హీనంచ । ధర్మాధర్మ వివర్జితమ్**
**బంధాబంధాది రహితం । అమృతం చాస్తి సర్వదా**
**సూక్ష్మాత్సూక్ష్మతరం నాస్తి । మహతోన్మహిత వర్జితః**

అందు కర్తృ (కారణబ్రహ్మము) కార్యము (జీవేశ్వర జగత్తులు) లేనిది. ద్వంద్వముగా గల సత్యా సత్యములు లేదు,విద్య (జ్ఞానము) అవిద్య (అజ్ఞానము) లేదు. పరిపూర్ణ పరబ్రహ్మమందు, ద్వైతము (జీవుడు ఈశ్వరుడు వేరగుదురుగాని, ఏకము కాదు) అద్వైతము (జీవేశ్వరులకు ఏకత్వము తెలియజేయుట) లేనిది, ధర్మము (దేహి లేక ఆత్మ) అధర్మము (అనాత్మ లేక దేహము) లను వదిలినది, మరియు బంధము (నరకము సంసార బంధము) మోక్షము (ముక్తి - సంసార బంధము నుండి విడుదల) లేనిది, అది ఎల్లప్పుడు అమృతమయమైనది (చావు లేనిది) బ్రహ్మము కంటే సూక్ష్మము కంటే సూక్ష్మముగానిది. మహత్తు కంటే మహత్తుగానిది. ఇవన్ని గాని దేదో అదే భూమాయని వ్యవహరించ బడుచున్నది.

**ఆనందరహితమచలం :**

సుఖదుఃఖములు ద్వంద్వ స్వరూపములు. ఒకదాని కొకటి ఆశ్రయించి వెలుగు నీడల వలె సాపేక్షికములై యున్నవి. ఇవి శబ్ద స్పర్శ రూప రస గంధములను పంచ విషయ రూపముగా నుండును. సుశబ్దము సుఖమును, దుశ్శబ్దము దుఃఖమును కలిగించును. అట్లే మిగత నాలుగు కూడ సుఖదుఃఖములకు కారణములై యున్నవి.

పంచ తన్మాత్ర రూపముగా పరబ్రహ్మతత్వమే పరిణమించినది. ఎట్లనగా **"బ్రహ్మణోరవ్యక్తాన్ అవ్యక్తాన్ మహత్, మహతో మహదహంకారాత్ పంచతన్మాత్రాణి".** అని చెప్పబడినది. అంటే పంచ తన్మాత్రలు ప్రకటము కానప్పుడు అవి బ్రహ్మమునందు బీజ రూపములో యున్నవన్నమాట. ఆ విధంగా అవి బీజరూపంగా నున్నప్పుడు సుఖ దుఃఖములనే ద్వంద్వ స్థితి లేదు. అప్పుడేక రూపస్థితియే. దానినే ఆనందమన్నారు. **ఆ స్థితి కలగాలంటే జీవుడు కూడ తన వ్యష్టి సమిష్టి లక్షణములను అతిక్రమించి బ్రహ్మమే తాననే తాదాత్మ్యస్థితి ఆరూఢ పరుచు కొన్నప్పుడు ఆ బ్రహ్మానందము గురు కృపవల్ల కలుగును.** సకలానందములోని బ్రహ్మానందము కూడ పరిపూర్ణ పరబ్రహ్మములో లేవు. ఏది కానిది ఏది లేనిదది. కనుక ఆనంద రహితమచలము. **వివరములు :-**

**కర్తృకార్యవివర్జితము:** కర్తృత్వమనగా ఒక పనిని చేసేందుకు బాధ్యత. కర్తయనగా చేయువాడు. అతడు చేసిన పనియే కర్మ. ఈ రెండే కర్తృకార్యము. పరిపూర్ణపరబ్రహ్మమందు కర్త లేదు కనుక కర్మ, కార్యము కూడ లేదనెడి నిశ్చయము.

మనస్సు, వాక్కు, శరీరము యివి పని చేయుటకు ముఖ్యమైన పనిముట్లు. కనుకనే

వాటికి త్రికరణములని పేరు. అందేఒక్కటి పని చేసిన కర్మ జరిగినట్లే. గాఢ సుషుప్తిలో కూడ శ్వాస క్రియ, పచన క్రియ, రక్త ప్రసరణము మొదలుగ పనులు సర్వప్రాణ శరీరములందు అనైచ్ఛిక క్రియలుగా జరుగుచునే యుండును. కనుక సజీవమైన యే ప్రాణియైన ఎట్టిపనిచేయక వూరక నుండ జాలదు.

జ్ఞాని **"ఆత్మనోన్యం నకించిన"** ఆత్మ కంటే అన్య మేమి కొంచమైనది లేదనే నిశ్చయముతో దృశ్యాదృశ్యమగు సర్వము ఆత్మ స్వరూపముగా గుర్తించి కర్మ చేయు చుండును. కాని అజ్ఞాని ప్రత్యగాత్మ శివోహం, శివోహం అన్న జ్ఞానము లేక అంతఃకరణమే తాననుకొని పంచతన్మాత్రల యందు మగ్నత చెంది మనోహంకారములతో ప్రవర్తించుచు కర్మలొనర్చును. పరిపూర్ణ భావజ్ఞులు కర్మలొనర్చు విధానమువేరు. గుర్తెరుగ కుండ యెవరును యే కర్మచేయరు. కనుక గుర్తెరిగే ఈ శరీరము సకల కర్మలకు మూలము. పరిపూర్ణపరబ్రహ్మమందు ఈ ఎరుకకు మూలం లేదనే నిశ్చయముతో కర్మలొనర్చును. పరిపూర్ణపరబ్రహ్మమందు ఎరుక పుట్టనే లేదు. దాని యందు లేకనే తోచినది. గురుపాదము లాశ్రయించి గురుభక్తి, గురుసేవ, గురునిష్ఠ కలిగి గురుకృపకు పాత్రులై అశరీర స్థితిలో శేషజీవితమును గడుపవలయును. ఈ విధానమున కర్తృత్వము కార్యము లేదు.

**సత్యాసత్యవిహీనంచ:–** పరిపూర్ణపరబ్రహ్మమందు ద్వంద్వరూపములో యున్న సత్యాసత్యములు లేవు. సత్యమున శబ్దమునకు ఆత్మ యనియు,జగత్తు అసత్య మనియు మిథ్య యని చెప్పబడుచున్నది. సత్యమునకు అసత్యము సాపేక్షికము, ద్వంద్వములు కనుక అవి లేనివే కనుక ఈ సత్యాసత్యములు (ఎరుక) యేదియు పరిపూర్ణపరబ్రహ్మము గానేరదు. సత్యము ఒక్కటే. అసత్యము లనేకము లుండవచ్చును. అట్లే సత్యత్వ నిత్యత్వం గల వస్తు వొక్కటే. "ఏకమేవాఽద్వితీయం బ్రహ్మ" అను శ్రుతి యొక్క తాత్పర్యముయిదే. పరిపూర్ణము, ఎరుక యను రెండు సత్యము లుండటకు వీలులేదు. పరిపూర్ణము సత్యమంటే ఎరుక అసత్యమనాలి. కనుక శ్రీ కృష్ణదేశికేంద్రుల వారు సెలవిచ్చినట్లు క.ద.**(150) "సత్యమగు బట్టబయలు నసత్యంబగు యెరుక నెరిగి । సద్గురు కృపచే । సత్యగాదని యెరుకను । సత్యముగా నమ్మి వుంటే చాలు చాలన్న । వాని తోటి సాటెవరన్నా!"** అనగా సత్యమైనది బట్టబయలు, అసత్యమైనది యెరుక లేనిదని సత్యముగా నమ్మియుండుటే పరిపూర్ణత. కనుక సత్యాసత్యములు పరిపూర్ణపరబ్రహ్మమందు లేవని గట్టిగా నమ్మవలయును.

**విద్యావిద్యవర్జితము:–** పరిపూర్ణపరబ్రహ్మము విద్య (జ్ఞానము) అవిద్య (అజ్ఞానము) లేనిది. ఈ రెండింటిని వదిలినప్పుడే పరిపూర్ణము స్వతసిద్ధము.

విద్య (జ్ఞానము) అనగా ప్రపంచ విషయము లంటక తర్కవితర్కములకు సాధ్యముగాక కేవలము పరిపూర్ణపరబ్రహ్మమును తెలియునట్టి తెలివి జ్ఞానమని విద్యయని చెప్పబడును. అవిద్యయనగా అజ్ఞానము. తెలివి లేని తనము. అనగా ప్రపంచ పారమార్థికత తెలియని తనము. ఈ రెండును పరిపూర్ణపరబ్రహ్మ నిర్ణయ విధానము తెలుసుకొను సమయము లందు, ప్రపంచ విధానములగు మాయ మరుపు లొచ్చికప్పి వేయును.

బ్రహ్మము చిద్ఘనము అఖండజ్ఞాన స్వరూపము. మహో చైతన్యవంతమగు సద్వదార్థముగా నున్నది. ఇక అజ్ఞానము జడము, అత్యంత జ్ఞాన రహితము, అసద్వదార్థము. ఇట్టి అజ్ఞానమునకు ఆ బ్రహ్మమే కారణము. ఎట్లనగా బ్రహ్మము నందు బీజరూపముగా

అణగిమణగి యున్న సత్వ రజో, తమో గుణముల మూడింటిలో తమోగుణ విజృంభణయే సచ్చిదానంద బ్రహ్మమును అనృత, జడ,దుఃఖాత్మకమైన అజ్ఞానముగా, మార్చి వేయుచున్నది. ఈ విధముగా కారణ బ్రహ్మము అజ్ఞానమునకు మూలకారణమగుచున్నది. అందుకే శ్రీ కృష్ణదేశికేంద్రులవారు తమ కంద పద్యములలో క.ప.89. **"జ్ఞానాజ్ఞానంబులు యీ జ్ఞానంబువె కాని వేరుగా వెన్నటికి"** అని సెలవిచ్చియున్నారు. ఒక్క జ్ఞాన రూపమగు సత్వగుణాధిక్యతచే కేవల జ్ఞానరూపముగా నున్నట్లు కనబడుచున్నది. అయినను అజ్ఞానమునకు అత్యంత మూలకారణము బ్రహ్మమే. సమన్వయ దృష్టితో పరిశీలించిన, సూర్యుని ఆవరించిన మేఘము సూర్యుని వలన పుట్టినదే, అట్లే అజ్ఞానము బ్రహ్మ వలన పుట్టినదే. జ్ఞానాజ్ఞానములు విద్యావిద్యలు అధిష్ఠానచేతనబ్రహ్మమునకే గాని పరిపూర్ణపరబ్రహ్మమునకు గాదు. శ్రీ భూమానంద హన్మద్దేశికుల వారు **"జ్ఞానాజ్ఞానము గానిది । అది ఘనులకు సాధ్యంబైనది । స్వానుభవాతీతులకు సర్వసమయైయున్నది"** అని గానము చేసి యున్నారంటే పరిపూర్ణ పరబ్రహ్మము జ్ఞానాజ్ఞానము గానిదని నిక్కచ్చిగా జెప్పినారు." పాండిత్యం నిర్విద్యా" అని శ్రుతి. విద్యావిద్యలకతీతమైన నిర్విద్యాస్వరూపమే పరిపూర్ణపరబ్రహ్మము.

**ద్వైతాద్వైత విహీనంచ : ద్వైతులనగా** జీవేశ్వరులు వేరులగుదురు గాని ఏకము కాదు. ఎట్లనగా తేజోంధకారములు ఏకము కానట్లు మరియు జీవుడు కించిద్గుణములు కలవాడు. ఈశ్వరుడు సర్వజ్ఞ గుణములు కలవాడు. కనుక వీరిరువులకు ఐక్యము పొసగదు. అయిన ఈశ్వరుడు వరమిచ్చువాడు. జీవుడు వరము ననుభవించు వాడని ద్వైతుల నిర్ణయము.

**అద్వైతులు :** అద్వైతులనగా జీవేశ్వరులకు ఏకత్వమును తెలియజేయువారు. ఎట్లనగా అఖండానందరూపమగు చైతన్యమొక్కటే సత్యపదార్థము. అదియే బ్రహ్మము. సకల ప్రపంచమునకు సాక్షిభూతము. నిర్వికారమగు బ్రహ్మము నందు జగద్భ్రాంతి అవిద్యా (అజ్ఞానము) ప్రభావము వలన కలుగుచున్నది. అవిద్య మాయ, ప్రకృతి యనబడును.

1. మాయ యగు సత్వగుణము నందలి చేతన ప్రతిబింబము+ చేతనము + మాయా ఈ మూడు కూడి = ఈశ్వరుడు.

2. అవిద్యయగు రజోగుణము నందలి చేతన ప్రతిబింబము + చేతనము + అవిద్యమూడు కూడి = జీవుడు

మాయా అవిద్యోపాధులగు జీవేశ్వరులను తీసివేయగ చేతన బ్రహ్మము శాశ్వతముయని నిర్ణయము కలవారు అద్వైతులు.

ద్వైతాద్వైతములు ద్వంద్వములు కనుక లేనివి. వీటికి పరిపూర్ణ పరబ్రహ్మమందు స్థానము లేదు. అందుకే శ్రీశ్రీ భూమానందహనుమంతదేశికులు పరిపూర్ణమును గూర్చి యిట్లు గానము జేసి యున్నారు:

**"ద్వైతమన్నది లేనిది । అద్వైతమనగ రానిది.**

**ద్వైతాద్వైతముల మీరియు । దోషరహితంబైనది॥** అదేరిపూర్ణము

**ధర్మాధర్మ వివర్జితము:-** పరిపూర్ణపరబ్రహ్మము ధర్మాధర్మములను వదిలినది. ధర్మ శబ్దమునకు **"ధార్యతే ఇతి ధర్మః"** అనే నిర్వచనాను సారము ఏది ధరించు, భరించునో అది ధర్మము. పరమాత్మయే ధర్మ శబ్దమునకు వాచ్యుడు. "ధర్మోరక్షతి రక్షితః" ధర్మాచరణతో ధర్మమును రక్షించిన ధర్మమాతని రక్షించును. ధర్మమునకు విరుద్ధములైన లక్షణములతో

జీవించుట విరుద్ధము. అధర్మములను వదిలి వేయుటయు ధర్మమే యగును. కాని ధర్మాధర్మములను రెంటిని వదిలి వేయుమని దిగువన నున్న భ్రాంతి రహిత శ్లోకము జెప్పుచున్నది.

**శ్లో ॥ త్యజ ధర్మ మధర్మంచ ఉభేసత్యానృతే త్యజ**
**వుభే సత్యానృతే త్యక్త్వా యేనత్యజసి, తత్యజ ॥**

అనగా ధర్మా ధర్మములను, సత్యాసత్యములను వదిలి వేయుము. దేని చేత వానిని వదిలితివో దానిని కూడవదిలి వేయుమని అర్థము. ఇది పరిపూర్ణపరబ్రహ్మస్థితికి సరియైన పద్ధతి.

ఇది ధర్మము అని నిర్ణయించుటకు గుర్తెరిగే శరీరము కారణమై యున్నది. ఏలననగా గుర్తెరుగ కుండ యెవరును యే కర్మ చేయరు. ధర్మాధర్మములను నిర్ణయము చేయునది గుర్తెరుగునది ఈ గుర్తెరిగే శరీరమే. అదే ఎరుక. ధర్మాధర్మములను విడువుమన్నారంటే ధర్మాధర్మములను నిర్ణయించి ధర్మములను గుర్తెరిగి యాచరించుటయు, మరొకటి అధర్మమని మానుటయు యెరుక క్రియలే. కావున ఎరుక యనగా గుర్తెరిగే శరీరమును వదులుమని ఆదేశించినట్లయినది. ధర్మమనగా ఆత్మ, అధర్మమనగా అనాత్మ (శరీరము) యని అర్థము స్వీకరించవలసియున్నది. అపుడు ఆత్మానాత్మలను వదిలి వేయుమంటుంది.

ఇచట విడువ వలసినది ఎరుక యని తెలిసినది. "యేనత్యజసి తత్యజ" అని చెప్పుటచే ఎరుకను దేని చేత విడువవలెను? ఎరుక గాని దొక్క పరిపూర్ణ పరబ్రహ్మమే. దానిని ఒక పనిముట్టుగా జేసి దానితో ఎరుకను విడుచుట అసాధ్యము. కావున పరిపూర్ణ బోధచే పరిపూర్ణమును యెరుకను తెలసి ఎరుక లేనిదని దృఢం చేసుకొన్నమీదట ఆ యెరుకయే బ్రహ్మమనే తన పూర్వానుభవమును, భ్రాంతిని పూర్తిగా వదిలి వేయుటయే యెరుకను విడుచుట. ఇదిఅంతయు భావనా రూపమే. కనుక "యెరుకచేతనే పట్టి తీసివేయరా" అన్నారు శ్రీ కృష్ణదేశికులు. విడిచేవాడు, విడువబడేది, విడిచే పనిముట్టు(సాధనము) మూడు ఎరుకే. ఈ త్రిపుటిని యనగా జ్ఞాతృ, జ్ఞాన, జ్ఞేయములను వదులుటయే పరిపూర్ణ బోధకుల లక్ష్యము. ఈ త్రిపుటి రహితమందే సర్వభ్రాంతి రహితము, శాశ్వత జనన మరణ రహితము. భ్రాంతి రహితమే మోక్షము.

**బంధా బంధాది రహితం :** బంధము, మోక్షము పరిపూర్ణ పరబ్రహ్మమునందు లేవు. "పుట్టుకతో మానవుడు సర్వస్వతంత్రుడు కాని సర్వత్ర సంకేళ్ళచే బంధించబడియున్నాడు" అని ఫ్రెంచ్ తత్వవేత్త యైన రూసో "మానవుని బంధ మోక్షముల గురించి చెప్పినమాటలివి. దీని వలన తెలసిన దేమనగా పుట్టుకయే బంధము.

బంధమనగా కట్టుబడి యుండుట. అనగా తన యిచ్ఛవచ్చిన రీతిని, సంచరించుటకు, కోరిన ఫలప్రాప్తి కలుగుటకు, దుష్టఫలితములు రాకుండుటకు, స్వేచ్ఛా స్వాతంత్ర్యములు లేకుండుటకు ఏదో అవ్యక్త శక్తిచే సంకెళ్ళు వేయబడినట్లుండుట బంధమన బడును. త్రికరణములగు మనస్సు , వాక్కు, శరీరముపై అందలి నానా విధ యింద్రియములపై తనకెట్టి పెత్తనము లేకుండుటయే బంధము. బ్రహ్మాండ పిండాండములకు కూడా ఉచ్ఛ్వాస నిశ్వాసలనే సూత్రముతో ముడిబడి దేహాకారమైనది. తన కెట్టి పెత్తనము లేకుండుటయే బంధము.

ఈ సృష్టికే మూలకారణము బ్రహ్మమే యని సర్వశాస్త్రముల అభిప్రాయము. అట్టి సృష్టికర్తకు

సృష్టించుటలో (స్వ+ఇచ్ఛ) స్వేచ్ఛ లేదు. ఏ అవ్యక్త శక్తియో తన్ను ప్రేరేపించి బంధించి ఈ సృష్టిలోకి యీడ్చుకొని పోవుచున్నది. సృష్టికి బ్రహ్మము లేక సగుణరూప ఈశ్వరుదన్న మొత్తము మీద సృష్టి కర్తయే బద్ధుడైయున్నాడు. బ్రహ్మాదిస్తంభ పర్యంతము ఏదో తెలియరాని ఒక సూత్రమునకు బద్ధమై యున్నది. ఇదే బంధము. ఈ బంధము సృష్టికి అత్యంత మూలకారణమగు వస్తువునందు యుంటేనే తప్ప సృష్టి యందున్న ప్రతి పదార్థమునకు ఆ బంధము సంక్రమింపజాలదు. బ్రహ్మాండ పిండాండములకు కూడ ఉచ్ఛ్వాస నిశ్వాసలనే, సూత్రముతో ముడిబడి దేహాకారమైనది.

శబ్దాది విషయములందు దోషమే బంధ కారణము. ఉ॥ కురంగ మాతంగ,పతంగ, మీన, భృంగములు ఒకొక్క విషయము చేత బంధింప బడుచున్నవి. **"గుణ దోషమయం సర్వంస్రష్టాసృజనకౌతుకీ"** అను న్యాయమున తనయందే దోషమున్నదని తెలియవలయును. శబ్దాది విషయములను గుర్తించునది మనస్సు కదా । మనస్సు గుర్తించనిచో బంధమేలేదు. కనుకనే "మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయో" అన్నారు. బంధము లేనిది, బంధము గానిది ముక్తి లేక మోక్షము. మోక్షమునకు ముక్తి, కైవల్యము, నిర్వాణము, నిరతిశయ సుఖావిర్భావము, అత్యంత దుఃఖనివృత్తి అను మాటలు నుపయోగించు చున్నారు. పంచవిధముక్తులుగా, జెప్పబడు సాలోక్య, సామీప్య, సారూప్య సాయుజ్య, సార్ష్టికము యనుముక్తులు, విష్ణు, శివుడు, మొదలగు యిష్టదైవముల లోకములు, సామీప్యాదులు పొందుట యని అర్థము కాని అవి కూడ బంధములే అయితే అవి బంగారు సంకెళ్ళ వంటివి.

అనంత కోటి జన్మలలోని కర్మవాసనల కూటమికి సంచితము, వర్తమాన జీవితములో ననుభవించుటకు తెచ్చుకొన్న శుభా శుభ సంస్కార జన్యమగు పుణ్యపాప కర్మఫలములు. ప్రారబ్దము. వర్తమాన జన్మల యందలి మనోవాక్కుశరీరములతో చేయబడిన కర్మ వాసనల రూపమే ఆగామి. ఈ త్రివిధ కర్మలు నశించిన గాని మోక్షము లేదని పెద్దలు జెప్పుదురు. అనగా జనన మరణ రాహిత్యమే మోక్షమని, ప్రారబ్దము అనుభవించుట చేత, సంచితము గురుముఖతః ఆత్మ నిశ్చయజ్ఞానము చేతను, ఆగామి కర్మత్యాగ, కర్మఫలత్యాగముచే గాక, కర్తృత్వరహిత కర్మాచరణ వల్లనే సాధ్యమని గుర్తింవలయును.

అయితే ఏపనికైనను కర్త యెవరు?నేను అను వ్యష్టి అహంకారమే కర్తయని యితరులు పలుకుచున్నారు. కాని ప్రత్యగాత్మ ప్రకాశము లేనిదే యింద్రియ వ్యవహార ముండదు. కనుక దానినే కర్తయనవలెను. " **అందుకే శ్రీ కృష్ణదేశికేంద్రులవారు. క.ద. 52" ఆటాడి అడ కుండును । ఆటాడిన మేను బొమ్మ యాటాడకనే । ఆటాడు ఎరుక యనియెడి । యాటాడించేడి వాడు అతడే రాకర్త । అంతటికి యీ అచల మకర్తా।"** యని సెలవిచ్చియున్నారు. అంటే ఎరుక యగు పురుషుడు ఆటాడును. ఆడకుండ యుండును. మరియు శరీరముచేత ఆడకుండ తనలోనే తాను ఆడుచుండును. గనుక ఆటాడించువాడు యెరుకయను పురుషుడే, కర్తయని నిర్ణయము. ఈ సర్వమునకు పరబాహ్యము అకర్తయని తెలుసుకొనుము.

కనుక శాశ్వతముగా జన్మరాహిత్యము కావలయునంటే బంధ మోక్షములుగా మారుచున్న ఈ బ్రహ్మము నుండియే ముక్తి కావలసి యున్నది. బంధ మోక్షములు రెండు బంధమే. కనుకనే **"కేవల మోక్షాపేక్ష సంకల్పోబంధః"** అని నిరాలంబోపనిషత్తు సిద్ధాంతము.

పరిపూర్ణపరబ్రహ్మము నందు బ్రహ్మ స్వరూపుడనైన నీవు గాని, నీ బంధమోక్షములుగాని లేవు. పరిపూర్ణపరబ్రహ్మము శాశ్వతమని తెలసి బ్రహ్మస్వరూపడవైన నీవు లేనేలేవని గురుముఖతః తెలసి లేక పోవుటయే, జన్మరాహిత్యము. అదియే నిజమైన మోక్షము.

**అమృతం చాస్తి సర్వదా :** అమృత మనగా చావు లేనిది. చావులేనప్పుడు పుట్టుకనే లేదు. చావు పుట్టుకలు లేనిది పరిపూర్ణ పరబ్రహ్మము. అది ఎల్లప్పుడు యున్నది. ఒకప్పుడుండి వేరొకప్పుడు లేకుండ యుండునది నేనైన బ్రహ్మము. కాని పరిపూర్ణ పరబ్రహ్మము భూత భవిష్యత్ వర్తమాన కాలములనక సర్వదా యుండును. అద్వైత సిద్ధాంతరీత్య నాల్గు వేదముల మహావాక్యముల నిర్ణయముచేత నేనే బ్రహ్మనే సిద్ధాంతము చేయుచున్నవి. అయితే నేను ఏ బ్రహ్మనగుదునో నిర్ణయించవలసి యున్నది. పరిపూర్ణ భావజ్ఞులు పుట్టనిది, చావనిది ఒక్క పరిపూర్ణపరబ్రహ్మము మాత్రమే.
అయితే " అజోహం అమరోహం" అనుమాటలకు సమన్వయమెట్లనిన, పరిపూర్ణ పరబ్రహ్మము నందు నేననే వృత్తి ఎన్నడు లేదు. నేను పరిపూర్ణ పరబ్రహ్మ మందు పుట్టనే లేదు. పుట్టని నాకు మరణ మెట్లుండును. నాకు చావున్నులేదు. నా హృదయమందు గురువును ధ్యానము చేయుట చేత పరిపూర్ణ పరబ్రహ్మము నందు నేను పుట్టనే లేదను పూర్ణభావము కలుగుచున్నదని పరిపూర్ణభావజ్ఞుల అభిప్రాయము. అందుకే పరిపూర్ణపరబ్రహ్మము ఎల్లప్పుడు యున్నది. అదినిత్యము, శాశ్వతమైనది.

**సూక్ష్మాత్సూక్ష్మతరం నాస్తి:-** పరిపూర్ణమందు సూక్ష్మము కన్న సూక్ష్మమైన దానికన్న సూక్ష్మమైనది లేదు. "అణోరణియాన్" అని చెప్పబడునటువంటిది కూడా లేదు. ఉదాహరణకు ఇంటికప్పులోని రంధ్రము గుండ సూర్యకిరణము యింటిలోనికి ప్రవేశించునపుడు ఆ కిరణముల వెలుగులో తేలియాడు అనేక నలుసులు కాననగును. అందొక నలుసు అణు ప్రమాణముగలదని చెప్పనగును. అంతకంటే సూక్ష్మమైన వస్తువు మనకు కానరాదు. ఆత్మ అంతకంటే సూక్ష్మముగానుండుటచే అది మనకు కానరాదు. అనేకాణువులు కరిచి పెట్టుకొని యుండుటవల్ల వస్తువేర్పడినది. వస్తువు నందు సూక్మముగా అణువులు, అంతకంటే సూక్ష్మముగా ఆత్మ నిండి యున్నది. అట్లే బ్రహ్మాండ భాండములందు ఆత్మ నిండి యున్నది. అట్లని, ఆత్మ కానరాక నిరవయముగానున్న వాయువు ఆకాశములందు కూడ ఆత్మనిండి యున్నది. పంచభూతములు ఐదు, కాలము, దిక్కులు, మనస్సు, ఆత్మకూడి నవవిధ ద్రవ్యము లనబడును. ఈ నవవిధ ద్రవ్యములందు కూడ ఆత్మ సూక్ష్మాతి సూక్ష్మంగా వ్యాపించియున్నది. ఏ వస్తువు యొక్క సూక్ష్మము ఆ వస్తువు నందే యుండును. కాని పరిపూర్ణపరబ్రహ్మము ఒక వస్తువు కాదు. అందు వస్తువునకుండే గుణములు సూక్ష్మముగా కూడలేవు. కనుక అది సూక్ష్మాతి సూక్ష్మము కాదు. అది ఏది కానిది.

**మహతోన్మహిత వర్జితః :-** పరిపూర్ణ పరబ్రహ్మము ఆత్మవలె, మహత్తుకంటే మహత్తైన దాని కంటే గొప్పది కాదు. ఆత్మయే అణు రూపముగా విభు రూపముగా అనగా గొప్పగా కూడ అయియున్నది. మహత్తులోనే సృష్టి జరిగినది. సృష్టి యెంత వరకు యున్నదో ఆ ఆవరణ కంటెను పెద్దదై దానిని కూడ మీరి అతిక్రమించి నేను (ఆత్మ) యున్నదన్నమాట, సృష్టివిధానమును పరిశీలించిన " బ్రహ్మణో అవ్యక్తాన్, అవ్యక్తాన్ మహత్" అనగా బ్రహ్మము నుండి అవ్యక్తము, అవ్యక్తము నుండి మహత్, బ్రహ్మము లోపలనే అవ్యక్తము, మహత్తు

కలిగినవి. మహత్తు కంటే బ్రహ్మము, అవ్యక్తము పెద్దవై యున్నవి. అట్లే "తస్మాద్వా, ఏతస్మాదాత్మన ఆకాశ సంభూతో, ఆకాశ ద్వాయుః" అను శ్రుతి యందు, ఆత్మ యందు ఆకాశము పుట్టినదని చెప్పబడుటచే ఆకాశము కంటే ఆత్మ పెద్దదని చెప్పవలయును. నేను ఆ సృష్టికి పూర్వమున్న ఆత్మను లేక బ్రహ్మమును అయివున్నాను. నేను అణువు కంటే చిన్నవాడను మహత్తు కంటే గొప్పవాడను అని వర్ణించబడినది. **"నేను లేనప్పుడు అది"** నేను (ఆత్మ) లేనప్పుడే అది (పరిపూర్ణ పరబ్రహ్మము) శుద్ధము. **"యధానాహం తథా శుద్ధం".** పరిపూర్ణ పరబ్రహ్మము స్వతసిద్ధము కనుక అది అణువు కంటే చిన్నదికాదు, మహత్తు కంటే మహత్తుకాదు. అది ఏది కాదు, ఏది లేనిది.

**7. అవేద్య। మసంగ। మబాధ్య। మబోధ్య। మలక్ష్య। మకర్మ।అప్రమేయ। మద్వయ। మవిష్క్రియ। పరమాకాశమచలమ్। సర్వదా భాతి పూర్ణమ్**

పరిపూర్ణపరబ్రహ్మమందు పంచతన్మాత్రలు లేవు. అది అవేద్యము అనగా అది తెలియదగినది కాదు. అది అసంగము (Non Attachment) అది దేనిని అంటి పెట్టుకొని యుండదు. అది అబాధ్యమనగా హింసా హింసలు గానిది. అది అబోధ్యమనగా అది యిటువంటిది అటువంటిది యని చెప్పుట కలవి గానిది లక్ష్యములేనిది. అకర్మ యనగా త్రివిధ కర్మలైన సంచిత, ప్రారబ్ద, ఆగామి కర్మలు లేనిది. అప్రమేయము అనగా తెలుసు కొనశక్యము గానిది లేక మితి చెప్పవీలులేనిది. అది అద్వయము అనగా ద్వంద్వములుగానిది ఏకమైనది. అది అనిష్క్రియము. పరమాకాశమచలమ్ అనగా ఆకాశము కంటే (పరమాత్మకంటే) శ్రేష్ఠమైనది. పూర్ణము (కారణ బ్రహ్మము) ఎల్లప్పుడు ప్రకాశించునటువంటిది.

**వివరములు :-అవేద్యము:-** వేద్యము గానిది అవేద్యము. అవేద్యమనగా తెలియరానిది. పరిపూర్ణ పరబాహ్యము తెలియరానిది గనుక దానిని అవేద్యమన్నారు. **క.ద. 39 ॥ "లేదనకు మున్నదదిగో । నేదెలిసితిననకు దీన్ని నీవెరిగేలా కాదది నీచె దెలియును । యేదిరా తన్మాత్ర సమితి యీ బట్టబెటా"॥** అని శ్రీకృష్ణదేశికేంద్రులవారు శెలవిచ్చియున్నారు. పరిపూర్ణ పరబ్రహ్మమును తెలియుటకు సాధ్యముగాదు. ఎందుకనగా దాని యందు పంచ తన్మాత్ర స్వరూప స్వభావములు లేవు. మరియు పరిపూర్ణ పరబాహ్యమునకు సమమైనది యితర మేదియు లేదు. కనుక అది తెలియరానిది. పంచతన్మాత్రలను విషయేంద్రియములని యందురు.

1. జ్ఞానము, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము యివి శబ్ద తన్మాత్ర నుండి కలిగినవి. **అంతరేంద్రియములు.**

2. సమానము, వ్యానము, ఉదానము, ప్రాణము, అపానము స్పర్శతన్మాత్ర నుండి కలిగినవి. **పంచప్రాణములు.**

3. శోత్రము, త్వక్కు, చక్షువు,జిహ్వా, ఘ్రాణము రూప తన్మాత్ర నుండి కల్గినవి. **జ్ఞానేంద్రియములు.**

4. శబ్దము, స్పర్శ, రూపము, రసము, గంధము రస తన్మాత్ర నుండి కల్గినవి. **విషయేంద్రియములు.**

5. వాక్కు, పాణి, పాదము, గుహ్యము, గుదము గంధ తన్మాత్ర నుండి కలిగినవి. **కర్మేంద్రియములు.**

కావున పంచతన్మాత్రల నుండి విషయేంద్రియములు కలిగినవి. ఈ పంచ తన్మాత్రలు

వాటి నుండి కల్గిన యితర యింద్రియములు పరిపూర్ణపరబ్రహ్మమందు లేవు కనుక పర బాహ్యము అవేద్యము - తెలియరానిది.

"అస్తీత్యేవో పలబ్ధవ్యః" అంటున్నాయి శ్రుతులు. అస్తి అని భావిస్తే అది భావాతీతమెట్లౌతుంది? మరన్ని ఆస్తి-నాస్తు"లు రెండూనూ పరస్పర సాపేక్షికములుగాదా! అయితే యిక యెట్లు? "అది తెలియబడనిది అని తెల్పుకొంటి" అంటేసరిపోతుందేమో? ఈసందర్భంలో యీ దిగువ శ్రుతులను పరికించవలెను.

**1. "యస్యామతంతస్యమతం। మతంయస్యనవేదసః॥**
**అవిజ్ఞాతం విజానతాం। విజ్ఞాతమవిజానతాం"** ॥కేన॥

తా॥ ఎవడు తెలియదనెనో వానికి తెలియును. తెలుసునన్నవాడే నిజంగా తెలియనివాడు. దానిని ఏసాధనచేతను తెలిసికొనరాదని తెలిసనవాడే దానిని యెరిగినవాడు.

**2. "యదిమన్యసేసువేదేతి దభ్రమేవాపినూనం, త్వంవేత్థ బ్రహ్మణోరూపం"** ॥కేన. ఉ.॥ తా॥ నేనీబ్రహ్మమును చక్కగా తెలుసుకొంటిని అని నీవందువేని, నీవు తెలిసికొన్నది నిశ్చయముగ అల్పమైనదే.

3. "నాహం మన్యేసు వేదేతి, నోనవదేతి, వేద-" (కేవ. ఉప)

తా॥ ఆ బ్రహ్మమును నేను తెలుసుకొంటినిగాని తెలుసుకొనలేదనిగాని తలంపను.

4. "అన్యదేవతద్విదితాధథో అవిదితాధధి" - కేన. ఉప.

తా॥ తెలుసుకొన్న దానికంటె తెలియని దానికంటె అది పరముగాయున్నది.

అది యిట్టిది, అట్టిది, ఎట్టిదో చెప్పలేము. మనసుచే నూహించలేము. యిత్యాది వాక్యములచేగూడ నది లక్షింపబడజాలదు. కావున అట్టి నిరపేక్షిక సత్యమగు కేవలత్వ మొందు గలదు అనిమాత్రము శ్రుతియుక్తి అనుభవములకు గోచరమగుచున్నది. - (పరిపూర్ణ దర్శనముపుట సంఖ్య (10,11)

**అసంగము :** సంగములేనిది, కూడనిది, పొసగనిది యని అర్థము - పరిపూర్ణ పర బాహ్యము, దేనితో కూడుకొని యుండుట లేదు. అది ఏకమైనది. ఆకాశము సమస్త వస్తువుల బాహ్యాభ్యంతరములందు వ్యాపించియున్నను, వస్తువును గాని వస్తువు ధర్మమును గాని అంటక వానిచే ఏవిధముగా వికారము చెందక అసంగమై యున్నది పరిపూర్ణపరబాహ్యము బాహ్యాభ్యంతరము లందు నిండి నిబిడీ కృతమైయున్నప్పటికిని వాటి నంటక మరియు వాటి ధర్మములను అంటక యున్నది.

ప్రపంచీకుడు తెలివి, తెలివికి తెలియబడేదీ సత్యమేనని భ్రాంతి జెంది కాంక్షతో కర్మలు చేస్తాడు. పరిపూర్ణ భావజ్ఞుడు యెరుక లేదనే సత్యము ఆరూఢము చేసుకొని ఆ విషయము లేకుండానే సకలక్రియలు చేస్తుంటాడు. అంటే ఎరుక లేక చేస్తుంటాడు. ఎరుక లేనే లేదని నమ్ముతే కర్మ ప్రవృత్తి పోత్సహించు త్రిపుటిగాని, కర్మచేయు త్రిపుటిగాని లేవని అపుడే నమ్మకము కలుగును. అనగా దృఢమగును. ఎట్లనగా ఎండమావులలో నీరు లేనే లేదని గట్టిగా తెలుసు కొన్న తర్వాత నీళ్ళవలె కాన వస్తున్న లేనే లేవనెడి నిశ్చయముండును గదా !

జ్ఞానము, జ్ఞేయము, జ్ఞాత యను త్రిపుటి కర్మను ప్రోత్సహించును. ఎందువల్లననగా గుర్తెరుగకుండ యెవ్వరు యేపని చేయరు గదా ! కర్త, కర్మ, కరణము (పనిముట్టు) అను

త్రిపుటిచే కర్మ జరుగుచున్నది. జ్ఞాతయే కర్త, జ్ఞానమే కరణము. ఈ రెండు లేనేలేవని దృఢ నిశ్చయమై కర్మ చేస్తే ఆ కర్మ చేసియు చేయనట్లే యగుచున్నది. ఇదే, చేయకనే చేయుట, వినకనే వినుట. కనకనే కనుట యను మాటల అభిప్రాయము. ఈ రెండు త్రిపుటులు లేవని నిశ్చయమున్న వానికి కర్మప్రవృత్తి కవసరమగు కాంక్ష (ఫలాసక్తి) గాని కర్తృత్వ అహంకారముగాని ఉండదు.

**84.** సీ॥ జలజపత్రములందు సలిలమంటనియట్లు అద్దమందున రూపమంటనట్లు॥ బురదయా కుమ్మరిపురుగు కంటనియట్లు" ఆజ్యంబు జిహ్వకు యంటనట్లు॥ భువి చింతపండుపై బొబ్బరంటనియట్లు బలుచల్లతో వెన్నగలయనట్లు॥ చిత్రభానునకును చీకటంటనియట్లు నాకాశమున వాయువంటనట్లు॥ బ్రహ్మవేత్తలు మాయా ప్రపంచమందు నఖిల వ్యవహారములు జేసి యంటరధిప ॥రమ్య॥ అని భద్రాది రామశతకకర్త గానము చేసినారు.

తామరాకునందు నీరు, అద్దమందు రూపము, కుమ్మరిపురుగునకు బురద, నాలుకకు నెయ్యి, బొబ్బరకు చింతపండు, చల్లలో వెన్న, సూర్యునకు చీకటి, ఆకాశమునకు వాయువు యేలాగు నంటదో అలాగే జ్ఞానులు ప్రపంచమందు సకల వ్యవహారములుచేసి అంటరని యెరుగవలెను. పరిపూర్ణ పరబ్రహ్మము ఉన్నది. దేనిని అంటకుండ ఉన్నది.

**అబాధ్యము :** అబాధ్యమనగా కాలత్రయములందు మార్పు లేక నొక్కతీరుగా నుండునది. అంటే యితరులు చెప్పే బ్రహ్మము కాలత్రయ మందు అబాధ్యమంటారు. కాని పరిపూర్ణ మొక్కటే సర్వకాలములందు సర్వావస్థల యందు అబాధ్యము, మార్పులేనిది. అధిష్ఠాన చేతనబ్రహ్మము మార్పులేనట్లు గోచరించిన, మార్పులు మనకు స్పష్టముగా గోచరించును. ఎట్లనగా:

1. సృష్టికి పూర్వము **"సదేవసోమ్యేఽ దమగ్రఅసీత్"** సృష్టికి పూర్వము ఆ బ్రహ్మము సత్ పదార్థముగా నుండెను.

2. అనంతరము **"సో కామయత బహుస్యాం ప్రజాయేయతి"** అనగా ఆ బ్రహ్మమే అనేకము కావలెనని కోరెను. కోరి,

3. **"ఏకం అనేకం భవతి"** ఏకమైన ఆ బ్రహ్మమే అనేక మాయెను.

4. **"తత్సృష్ట్వా తదేవా ను ప్రావిశత్"** ఆ పిమ్మట తానే అందు అను ప్రవేశము గావించెను.

5. **"యయేకో జాలవాన్ఈశత ఈశనీభిః॥ సర్వాన్ లోకానీశత యీా శనీభిః॥ యఏవైక ఉద్భవేసంభవేచ॥ యయేతద్విదురమృతాస్తే భవన్తి"** (శ్వేతా॥ ఉ॥ 3 అధ్యాయం 1వ మంత్రం)

ఆ బ్రహ్మమే ఆశక్తులచే సర్వమును నియమించుచున్నాడు. సృష్టి స్థితి లయములు చేయుచున్నాడు.పిదప లీల ముగించి సర్వము తనలోనికి ఉపసంహరించుకొనుచున్నాడు. కనుక సృష్టికి పూర్వమొక రీతిగా, సృష్టికాలమందొక రీతిగా, సృష్టియనంతరము మరొక రీతిగా వివిధ నామరూప క్రియాత్మకముగా వుంది. కనుక కాలాను సారము మార్పులు చెందుతు వుందనాలి. కాలత్రయా బాధ్యమనరాదు. పిండాండ మందు విచారిస్తే కాలాన్ని అనుసరించి కలుగు మార్పులు మరీ ప్రస్ఫుటముగా కనిపిస్తాయి.

తల్లి గర్భములో పిండరూపముగా నున్నప్పుడు, పుట్టిన పిదప, శైశవావస్థ, బాల్య

యౌవ్వన కౌమార వార్ధక్యములందు జ్ఞాన మెన్ని మార్పులు చెందుతుందో, గమనిస్తే జ్ఞానరూపమైన బ్రహ్మము దేశకృత, కాలకృత వస్తుకృత పరిచ్ఛేదములు కలిగి యున్నదో తెలియుచున్నది. ఈ త్రివిధ పరిచ్ఛేదముగానిది యొక్క పరిపూర్ణ పరబ్రహ్మమే. కనుక అది అబాధ్యము, మార్పులేనిది.

**అబోధ్యము :** పరిపూర్ణపరబ్రహ్మము అబోధ్యము అనగా బోధించుటకు వీలు కానిది. ఏమనరానిది. ప్రమాత, ప్రమేయ ప్రమాణములకు అతీతమైనది. **"నతత్ర చక్షుర్గచ్ఛతి, నవాఙ్గచ్ఛతి, నోమనః నవిద్మో నవిజానియో, యథైవ తదను శిష్యాదన్య దేవ తద్విదితా తథో అవిధితా దధి యితి శుశ్రుమ పూర్వేషా యేన స్తద్వ్యాచచిక్షిరే."** కేనోపనిషత్తు

తా॥ వాక్కుకు అందదు, మనస్సుకు, కన్నుకు అందదు, జ్ఞానమునకు కూడ తెలియరానిదేదో, అది తెలిసిన దాని కంటెను, తెలియరాని దాని కంటెను వేరుగా నున్నదని పూర్వము పెద్దలు తెలుసుకొని శిష్యుల కుపదేశించిరి. శ్రీ శ్రీకృష్ణదేశికేంద్రులవారు **క.ప.42॥ "అట్టిది యిట్టిది యన రానట్టిది బయలనుచుదెలసి"** అని 43॥ **"అది ఇది యంచని యనరానిది బయలని తెలసి నీవు"** అని సెలవిచ్చియున్నారు. అంటే పరిపూర్ణ పరబ్రహ్మము అటు వంటిదియనగా పరమాత్మ వంటిదని, ఇటువంటి దనగా ప్రత్యగాత్మ వంటిది యని అనుటకు వీలుకానిది. అంటే ప్రమాత ప్రమాణ ప్రమేయలు గానిదని తెలియుచున్నది. పరిపూర్ణమందు లేనెరుక యీషణ్మాత్రములేదు. దానిని గుర్తించుటకు వీలు లేదు. అది ఏకైక ఆస్తిక్యత గలది. దానిని తెలుసుకొనే తెలివి లేదు. ఇంద్రియరూపముగా కూడా లేదు. అతీంద్రియరూపమైన ఎరుకచే గూడ తెలియరాదు. అందు పంచతన్మాత్రలు లేవు కనుక అది దేనికి విషయము కాదు. అయితే దీనిని తెలుసుకొనుటెట్లు? మరియు యితరులకు తెలుపుట ఎట్లు? అంటే పరిపూర్ణ దర్శనాచార్య శ్రీ యిలపకుర్తి వీర వెంకట రామచంద్రరావుగారు ఈ విధముగా సమాధానము జెప్పియున్నారు.

"ఉన్నవి రెండే. 1. పరిపూర్ణము 2. లేని ఎరుక. కనుక లేనెరుకను క్షుణంగా వివరించి చూపించి, అది కానిది, అది లేనిది యేదో అదే పరిపూర్ణమని చెప్పవచ్చును. అట్టి లేనెరుకను విడిచితే అంతా పరిపూర్ణ పరబ్రహ్మమే. ఇక దీనిని గురించి ఈ విధముగా విన్న శిష్యుడు ఎట్లు దీనిని తెలుసుకొనును? అంటే గురువు చెప్పి చూపించిన లేనెరుకను ముందుగా తెలుసుకొనును. అది మాత్రం అంత సులువుగా తెలియబడునా? అంటే - తెలియబడదు. కాని అంతఃకరణ శుద్ధి గల శిష్యుడైతే ఆ లేనెరుక స్వరూపమైన అఖండాత్మ స్వరూపుడు తానే అయి నిలుచుటే ఆ లేనెరుకను తెలియుట. అట్టి స్థితి యందే తాను కాని, తాను లేని పరిపూర్ణ పరబ్రహ్మమున్నది. తానే లేదనే యదార్థజ్ఞానము శిష్యునికి కలుగుచున్నది. ఇదే పరిపూర్ణమును వుండజూచుకొనుట. అట్లే వుండ జూచిన తెలివి లేనే లేదని దాని రహిత మొనర్చుకొనుట లేనెరుకతో పరిపూర్ణము కనిపెట్టుట. ఇదే ఎరుక లేక సేవించుటకు ప్రథమ సోపానము ఈ విషయమంతయు అనుభవవిషయమునకు సంబంధించినది. అనుభవము యింత కంటే అనువదించుటకు సాధ్యము కాదు." (ప.ద. పుట 269) సద్గురువులకు శుశ్రూషలు జేసి ఆత్మ సాక్షాత్కారము కలిగించుకొన్న పిదపనే యిదిగ్రాహ్యమగు విషయము. గురుకృపాపాత్రులకే యిది సాధ్యము. శాస్త్ర పాండిత్య ప్రక్రియల ద్వార యిది బోధించుటకు వీలుపడదు.

**అలక్ష్యము :** పరిపూర్ణ పరబ్రహ్మము లక్ష్యాలక్ష్యములు గానిది. లక్ష్యమనుట చేతనే సాపేక్షకమైన అలక్ష్యము గుర్తునకు వచ్చును. లక్ష్యాలక్ష్యములు ద్వంద్వములు. సర్వద్వంద్వములు అశాశ్వతములు. పరిపూర్ణ పరబ్రహ్మము శాశ్వతమైనది. లక్ష్యములు లక్ష్యత్రయముగా ప్రసిద్ధి.: 1. **అంతర్లక్ష్యమనగా** సకలము అయిన అంతరేంద్రియములు - జ్ఞానం, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారములను అంతరేంద్రియార్థములు జూచునట్టి చూపు లోచూపు (insight)

2. **బాహ్యాలక్ష్యమనగా** బాహ్యేంద్రియములు - శ్రోత్రము, త్వక్కు, చక్షువు,జిహ్వా, ఘ్రాణముల వృత్తులు జూచునట్టి వెలిచుపూపు. (External sight)

3. మధ్య లక్ష్యమనగా సకలమైన బాహ్యేంద్రియముల వృత్తులను జూచునట్టి మధ్య దృష్టి. ఈ లక్ష్యసాధనచే శాంభవీ ముద్ర సిద్ధించుటే ఫలము. శాంభవీ ముద్రయందు బాహ్యదృష్టి కలిగి మారుతంబుల వికారంబులుడుగించుట శాంభవీ ముద్రయన బడును.

ఈ ముద్రల లక్ష్యములు పరిపూర్ణపరబ్రహ్మమందు లేవు. ఈ ముద్రలందు మరిగి బ్రహ్మమును గాంచుట యనునది భ్రాంతియే "భ్రాంతియుడగిన బ్రహ్మంబు బట్టబయలు".

**అకర్మ :** పరిపూర్ణపరబ్రహ్మము నందు కర్మలు గాని, కర్మ ఫలములుగాని లేవు. కర్మయనగా 'పని' యని సామాన్యార్థము. ఐతే:

**"కర్మమున బుట్టు జంతువు । కర్మమున వృద్ధిపొందు, కర్మమున చెడున్ । కర్మమె జనులకు దైవము । కర్మము సుఖదుఃఖములకు కారణ మధిపా"** అని భారతమున జెప్పబడినది. సృష్టి స్థితి లయములకు, సుఖదుఃఖములకు కారణమైన కర్మ యొక్క విశేషార్థమేనగా ఫలమునీయని కర్మలు నిర్వీర్యములై నశించును. అట్టి పనులకు కర్మ లనుటకే వీలు లేదు. కనుక కర్మ యనగా కర్మఫలమే.

కర్మ, అకర్మ, వికర్మ యని భగవద్గీతా కర్మలను మూడు తరగతులుగా విభజించినది. ఇందు కర్మయనగా శాస్త్రోక్తమైన కర్మయని, వికర్మయనగా శాస్త్రములందు నిషేధించిబడిన కర్మయని, అకర్మయనగా కర్మ శూన్యత యని సామాన్యముగా జెప్పుదురు.

కాని కర్మచేయుకుండ వుండుట అసంభవము. ఎందుకనగా ఊరక యుండుట కూడ కర్మయే. నిద్రపోయినను కర్మయే. కాయిక వాచిక కర్మలను అరికట్టిన మానసిక కర్మ తప్పదు. కనుక కర్మత్యాగము అసంభవము.

కర్మచేయుచున్నను కర్మఫలము అంటకుండ పోవలయును. కర్మచేయుచు ఆ కర్మ పునర్జన్మకు కారణ భూతము గాకుండుటకు గాను చెప్పబడిన కర్మత్యాగ, కర్మఫల త్యాగ, కర్త )త్వ త్యాగము అను మూడు విధానములలోను కర్తృత్వ త్యాగము ప్రశంసింపదగినది.

గురుభక్తుడు సద్గురువునకు తను మన ధనములు మరియు పంచతన్మాత్రలు అర్పించి యుండగా ఇంకనూ కర్తృత్వబుద్ధి అతడు పూని యుండడు. పరిపూర్ణ పరబ్రహ్మమునందు యెరుకకు (నేను లేక ఆత్మకు) మూలముగాని స్థానము గాని లేదు అని ఆరూఢమైనవానికి తానే లేడుగనుక స్వధర్మ కర్మాచరణములో తాను చేయు కర్మలకు తాను బాధ్యుడు కాడు. ఈ దృక్పథముతో కర్మ లాచరించువానికి సంస్కారములంటవు. అట్లు చేసిన కర్మయే వికర్మయగును. నేను అకర్తను, అసంగుడను అను చిత్త వృత్తితో కర్తృత్వమును వీడి కర్మలు చేసినను యిట్టి మనో వృత్తితో ఆచరించుటయే వికర్మ. కనుక కర్మ+ వికర్మ = అకర్మయగుచున్నది. అకర్మ

యనగా కర్మలు మానుట గాదు. కర్మచేసియు చేయని వాడు కావలెను. అట్టికర్మయే అకర్మయగును. పరిపూర్ణభావములో ఆరూఢత సాధించినవాడు. ఈ విధముగా కర్మాచరణ గావించి కర్మఫల మంటకుండ జేసి కొనును. "యోగః కర్మ సుకౌశలం" ఇట్టి కర్మ కౌశలమే యోగమని గీత జెప్పుచున్నది. ఇదే నైష్కర్మ్య సిద్ధి. ఇట్టి అకర్మకూడ పరిపూర్ణ మందులేదు.

**అప్రమేయము :** అప్రమేయమనగా తెలిసికొనశక్యము గానిది. మితి చెప్ప వీలు లేనిదని అర్థము. ప్రమేయ ప్రమాణములు లేనిది గనుక తెలుసుకొనుటకు శక్యము గానిది. శ్రీ కృష్ణదేశికేంద్రులవారు **క.ద.33. "ఎరుకైన రీతి నుండును। యెరుగ నశక్యంబటంచు। యెన్నిన యెరుకన్ యెరుగుదు ననినను యెరుకకె। యెరుగుట దుర్లభము సుమ్మి। యీ పుత్తబయలూ।"** అని **34 క.ద. "పలుకున బలుకగ రాకను, తలపోయుదమనిన దగులక మెపుడున్।"** అంటే పరిపూర్ణపరబాహ్యము వాచ్యవాచ్యార్థములకు లక్ష్యార్థములకు అందు నట్టిదిగాదు. లక్ష్యలక్ష్యార్థముగా తలపోయదమనిన మనసుకు సాధ్యముగాదు. అనగా మనసుకు తగలదు. రూపము గల దానిని మాటలచే వర్ణించవచ్చును. కాని పరిపూర్ణమునకు రూపము లేదు. కావున దానిని మాటలచే వర్ణించుటకు వీలు గాదు. మరియు బాహ్యమందు మనస్సు తోచుచున్నది గాని మనస్సు పరబాహ్యము నందు లేదు. ఎట్లనగా సముద్రమునందు చేపయున్నదని తెలియుచున్నది గాని చేప లోపల సముద్రములేదు. చేపకు సముద్రమును మననము చేయుటకు ఎట్లు సాధ్యముకాదో అట్లు పరిపూర్ణపరబ్రహ్మమును మనన చేయుటకు వీలు లేదు. మరియు దానిని పొందుటకు మనస్సుకు తరము గాదు. అట్లే కందపద్యములలో **క.ప॥61॥ బయలనిన కండ్లబడనిది క.ప॥62 "బయలనిన పలుకులేనిది క.ప.63 "చెప్పి చూపించరానిది"** అని గానము జేసినారు. అవాఙ్మానస గోచరమైనది పరిపూర్ణ పరబ్రహ్మము. ఇట్టి దట్టిదని చెప్పి చూపించరానిది. మనసు, వాక్కు దేనిని తెలుసుకొనుటకు అసమర్థములై వెనుకకు మరలెనో యది పరిపూర్ణపరబ్రహ్మము. అణు ప్రమాణము, మధ్యప్రమాణము, మహత్ ప్రమాణమని అన్ని వస్తువులు యేదో ఒక ప్రమాణములో యుండక తప్పదు. ప్రమాణములు లేనిదానిని గుర్తించుటకు వీలు లేదు. ఏ మార్పులు యెరుగని, ఏ ప్రమాణములు లేనిది ఒక తీరుగా నుండే పరిపూర్ణము తెలుసుకొనుటకు శక్యముగాదు కనుక దానిని అప్రమేయమన్నారు. కారణ బ్రహ్మమును స్వవశీయ మనస్సు, అతీంద్రియ మనస్సుతో తెలుసుకొనవచ్చును. కాని అట్లు పరిపూర్ణపరబ్రహ్మను తెలుసుకొనుటకు వీలు పడదు.

**అద్వయము :** అద్వయమనగా ద్వంద్వములు లేనిది, రెండు గానిది. ఏకానేకములు గానిది. ఆ పరిపూర్ణపరబ్రహ్మ మందు ద్విపుటి త్రిపుటులుగాని లేవు. అందుక్షేత్ర క్షేత్రజ్ఞులు, కారణ కార్యములు, శివశక్తులు, విక్షేపావరణములు, క్షరాక్షరులు, అమృత మృత్యువులు, గురు శిష్యులు మొదలగు ద్విపుటలు లేవు.

"అమృతం చైవ మృత్యుశ్చ సదసచ్చాహ మర్జున" (భ.గీ) అమృత మృత్యువులు, సదసత్తులు, జ్ఞాతృ, జ్ఞాన జ్ఞేయములు కర్తకర్మ క్రియలు మొదలగు త్రిపుటులు లేవు. అందు దశావతారములులేవు, 84 లక్షల జీవోపాధులు లేవు. ముక్కోటి దేవతలు లేరు. మరియే యితరము లేదు." అది యిది కాదు, యిది అది గాదు" అని శ్రీ శివరామదీక్షితులు వుద్ఘాటించి యున్నారు. శ్రీ భాగవత కృష్ణ దేశికులు, ద్వంద్వములను తెలుసుకొని, పరిపూర్ణమును తెలుసుకొని తదుపరి ఈ రెంటిని తెలిసిన తెలివిని ఆ తెలివితోనే తీసివేయుమన్నారు: **క.ద.51.**

**తల్లిదండ్రులు జీవేశులు । యిలవ్యోమము నేనుమేను । లెరుక మరుపులున్ । కలమేల్కలు శుక్లాశ్రమంబులు ।నీరాన్నములు ప్రకృతి పురుష దాల్మగదూ । గానై యెరుక కెరికే కానబడూ। తెలసి బయలున్నాది దెలశీ యీ తెలివినీ తెలివిచేతనె బట్టి తీసివెయ్యము"** అని అన్నారు. శ్రీ కొండమడుగుల వెంకట రెడ్డిగారు ద్వంద్వములు పరిపూర్ణమును గూర్చి బహూ చక్కగా గానము చేసి యున్నారు.

**" అమృత మృతంబులు ఆత్మానాత్మలు అఖిల ద్వంద్వములు నేనేరా ।**
**ఆత్మా నాత్మల కవ్వలిదచలము । అర్జున యిదిగో చూడుమురా ॥భాస్కరుడప్పుడు॥**

**అవిక్రియము :** పరిపూర్ణపరబాహ్యము అవిక్రియము. క్రియ యనగా పని, అవిక్రియమనగా పని చేయకుండ యుండుట. పని చేయనట్లుకనబడిన పని ఏదో విధంగా జరుగుతూనే వుంటుంది. అవిక్రియమనగా బాహ్యంగా, అంతరమందు ఎటువంటి పని జరుగకుండ యుండుట అని అర్థము. పరిపూర్ణపరబ్రహ్మమొక్కటే అవిక్రియమైనది. అది తప్పయితర మైనదంతా ఏదో రూపములో క్రియ, చలనము, కదలిక కలిగి యున్నవని చెప్పి తీరవలసినదే. సృష్టికి పూర్వము బ్రహ్మము తాను తానై అచల స్థితిలో నున్న పరబ్రహ్మమును అవిక్రియమని వర్ణిస్తారు. కాని సృష్టికామన కలుగుట వల్ల చలనమేర్పడి, సృష్టిజరిపించి, సర్వము నందు తానే అనుప్రవేశము చేయుట వల్ల ఆ బ్రహ్మము ఒకప్పుడు చలనము, మరొక్కప్పుడు అచలముగా నుండుటవల్ల అచలఋషులు పరిపూర్ణపరబ్రహ్మమొక్కటే అవిక్రియమన్నారు. అణువును పరిశీలించిన పైకి అది కదలకుండ నున్నట్లు కనబడిన అందుగల ప్రోటాన్లు ఎలక్ట్రానులు అతివేగముగా కదులుతున్నవి. అట్లే సుషుప్తి యందు బాహ్య శరీరమందు క్రియ కనబడకపోయిన ఉశ్చ్వాస నిచ్ఛ్వాస క్రియలు జరుగుచున్నవి. అదే విధంగా సద్పదార్థముగా నున్న స్థితిలో బ్రహ్మము నందు త్రిగుణములు నిద్రాణావస్థలో నుండి విజృంభణ లేనంత మాత్రాన క్రియ జరుగుట లేదనుటకు వీలులేదు. మరియు విత్తులోని అంకురము నందు ఏలాంటి క్రియ లేదనుటకు వీలులేదు. సరియైన ఉష్ణమునీరు భూమి లభించిన అంకురమే, మహా వృక్షముగా మారును. కావున ఇతరులు జెప్పే బ్రహ్మము అవిక్రియముగాదు కేవలము పరిపూర్ణ పరబ్రహ్మమే అవిక్రియము.

**పరమాకాశమచలం :** పరమాకాశమనగా శ్రేష్ఠమగు అకాశము. ఆకాశమనగా అసలు ప్రకాశింపని జడము అని ఒక అర్థమున్నది. మరియు ఉత్తర గీతలో:

**శ్లో॥ ఆకాశోహ్యవకాశశ్చ । ఆకాశ వ్యాపితంచయత్ ।**
**ఆకాశస్య గుణ శబ్దో । నిశబ్దోబ్రహ్మముచ్యతే ॥** ఉ.గీ.1-50

ఆకాశమనగా అవకాశరూపము. కాళీ ప్రదేశము. (Space) నామ రూపాత్మకమగు సర్వజగత్తునందు సూక్ష్మముగా వ్యాపించి యున్నది. దానికి గుణము శబ్దము. బ్రహ్మము నిశ్శబ్దమైయున్నది అని ఈ శ్లోకమున చెప్పబడినది. ఈ నిశ్శబ్దరూపమగు ఆకాశమే పరమాకాశమని శ్లోక మందు వర్ణించబడింది. నిశ్శబ్దమనగా నిర్+ శబ్దము=నిశ్శబ్దము. స + శబ్దము = సశబ్దము=శబ్దముతో కూడినది. శబ్దముతో కూడుట, కూడక పోవుట రెండు లక్షణములు ఆకాశమున కున్నవి. శబ్దముతో కూడినపుడు భూతాకాశము, శబ్దముతో కూడి లేనప్పుడు అదే పరమాకాశము. దాని యందు శబ్దము బీజరూపముగా నున్నది. దానినే పరావాక్కని అందురు. నిశ్శబ్దమనగా తాను తానైయున్న ఆత్మనే వర్ణించియున్నారు. కావున

పరమాకాశము (నిశ్చల స్థితిలో నున్న బ్రహ్మము) కంటే శ్రేష్ఠమైనది పరిపూర్ణపరబ్రహ్మమని నిర్ణయము. పరమాకాశమే అచలం.

**సర్వదాభాతిపూర్ణమ్ :** ఇచట పూర్ణము అనగా పరిపూర్ణపరబ్రహ్మమని అర్థమును గ్రహించరాదు ఎందులకనగా పరిపూర్ణపరబాహ్యము ఎల్లప్పుడు ప్రకాశించునట్టిదిగాదు. అదొక వస్తువుకానేకాదు. ప్రకాశమెక్కడిది. అది స్వయం ప్రకాశ వర్జితం అని 10 వ శ్లోకమున జెప్పబడినది. పరిపూర్ణ పరబ్రహ్మమే సదా ప్రకాశించుచున్నదని చెప్పిన 10 వ శ్లోకమున జెప్పిన అర్థమునకు విరుద్ధమగును. అయినను నిజమైనదేమనగా పరిపూర్ణ పరబ్రహ్మము "నిష్క్రియము, నిర్మలము అన్నప్పుడు ప్రకాశము కూడలేదు. స్వప్రకాశము గలది కారణ బ్రహ్మమే. స్వయం జ్యోతి, స్వప్రకాశము గల బ్రహ్మను అచ్చ తెలుగులో ఎరుక యన్నారు. పుట్టని పరిపూర్ణము నుండి యేది పుట్టదు. దాని యందెట్టి కారణ బీజములు లేవు. పుట్టించే సత్తా కలిగనది మరియు పుట్టేది కూడ ఎరుకే. కనుక యెరుకకు ఎరుకనే మూలము. అందుకే స్వతఃకారణమని, లేక స్వకారణమని, స్వయం ప్రకాశమని, స్వయంభూయని ఆ లేనెరుకనే (అధిష్ఠాన బ్రహ్మమునే) వర్ణించ బడుతుంది. అంటే బ్రహ్మకు బ్రహ్మమే కారణమనాలి. ఈ బ్రహ్మమే తనకు తాను తోచినది. "బ్రహ్మైవ జగత్కారణం" అను శ్రుతి ప్రకారము బ్రహ్మమె జగత్తునకు కారణ వస్తువైనది. అంటే ఈ జీవేశ్వర జగత్తునకు కారణభూతమై, కారణమని, స్వకారణమని, స్వయం ప్రకాశమని ఈ బ్రహ్మనే వర్ణించబడింది. పరిపూర్ణపరబ్రహ్మము ప్రకాశించునట్టిది గాదు.

**8. నిష్కళం నిష్క్రియం పూర్ణం । నిరవద్యం నిరామయమ్।**
**నిర్దేశరహితం నిత్యం ।బాహ్యబ్రహ్మేతి నిశ్చితం.**

పరిపూర్ణపరబ్రహ్మము కాంతి పుంజము లేనిది, క్రియ (పని) లేనిది, క్రియగానిది, నిందలేనిది, నిరామయము అనగా ఎట్టి వ్యాధులు లేనిది, లేక నిర్దోషమైనది. నిర్దేశరహితం అనగా నిర్దేశించుటకు (ఉపదేశించుటకు) రానిది, నిత్యం అనగా ఎల్లప్పుడు వుండునట్టి, శాశ్వతమైనదే పరిపూర్ణపరబాహ్యము.

**వివరములు :- నిష్కళం :** నిష్కళం అనగా కళలు లేనిది, కాంతి పుంజములేనిది (చంద్రకళలు) లేనిది, వీర్యము లేనిది, భాగములు లేనిదని అర్థములు గలవు. ఇవన్ని కూడ లేనిది పరిపూర్ణపరబ్రహ్మము.

చంద్రుడు షోడశ కళా పూర్ణుడని చెప్పబడుచున్నాడు. అవి యేమనగా. శ్లో "అమృతా, మానదా, పూషా, తుష్టిః, పుష్టీ, రతి, ధృతిః, శశినీ, చంద్రికా, కాంతి ర్జ్యోత్స్నా, శ్రీః, ప్రీతి, రంగదా।, పూర్ణాపూర్ణమృతా, కామదాయిన్యః, స్స్వరజాః కలాః॥. ఈ కళలన్ని మనస్సును ఆహ్లాద పరుచునవి. ఈ పదారు కళలు పరిపూర్ణ పరబ్రహ్మమందులేవు. వీర్యము లేనిది అనగా అదిశక్తి బలక్రియ, సామర్థ్యములు చూపనిది" క.ద. 35 **"సామర్థ్యమేమి జూపదు । కామక్రోధాదికముల గలయదనిశమే । బాములెరుంగదు యితరులు । యేమనిను మారుబల్కా। దీబట్ట బయలూ।"** అని శ్రీ కృష్ణదేశికేంద్రులవారు గానము జేసినారు. అది భాగములు లేనిది. ఆత్మనే ఖండాఖండముగా నున్నది గాని పరిపూర్ణ పరబ్రహ్మము అఖండమై సూదిమొన గ్రుచ్చుటకైన తా విచ్చక అంతట నిండి నిబిఢీకృతమైయున్నది. అందుకే శ్రీ కృష్ణదేశికేంద్రుల వారు క.ద.34 ములు గ్రుచ్చసందులేకను । కలిగున్నది బట్ట బయలు ।

గదరా మాయన్నా । యిదిగో చూడు కదలాదో యన్నా ।" అని పరిపూర్ణమును గురించి గానము జేసి యున్నారు. చతుష్షష్టి (64) కళలని పేర్కొన్నబడినవి కూడ పరిపూర్ణ పరబ్రహ్మమందు లేవు. అందుకే దానిని నాద బిందు కళా తీతమని పేర్కొనబడినది.

**నిష్క్రియము :** నిష్క్రియమనగా పని లేకుండుట, చేయకుండుట, ఊరక యుండుట అని అర్థములు. **"స్వయవేవ పరంబ్రహ్మా పూర్ణ మద్వయమక్రియం"** అనగా పరిపూర్ణ పరబ్రహ్మము తన యందు గాని తనకు వేరుగా గాని రెండవదనేది ఏమియు లేక,ఒక్కటియై నిష్క్రియమైయున్నది. ఇతరులు జెప్పిన బ్రహ్మము అచల ఋషులు జెప్పిన ఎరుకేగాని పరిపూర్ణపరబ్రహ్మముగాదు. ఈ ఎరుక బ్రహ్మము (అనగా జ్ఞాన రూపమైన బ్రహ్మము) నిష్క్రియము, సాక్షి మాత్రమని యితరులంటారు. కాని యిది సరిగాదు. ఎరుక (జ్ఞానము) ఒక స్థితి యందు అజ్ఞానరూపమైన మరుపు చెందుతుంది. తాను తానై యున్న స్థితి యందు అనగా సృష్టికి పూర్వము బ్రహ్మము "జ్ఞాన దేవతు కైవల్యం" అనే రీతిగా ప్రజ్ఞానమై యుండి తనను తాను మరిచిన స్థితి యందు అవ్యక్తరూపమైనది. అనగా తన స్వరూప జ్ఞానము నిష్క్రియమనుటకు వీలులేదు. జ్ఞానమునకు యెరుగుట అధిభౌతిక వ్యవహారము. ఎరుగుట ఎరుగక పోవుట యను రెండు.క్రియలు గలవు. అయితే పని చేయు శక్తి యున్నచో పనిని ఆపుచేయుశక్తి వుండును. ఒకానొక స్థితిలో పని చేయనట్లు తోచిన దానిని నిష్క్రియమనరాదు. నిష్క్రియమైన దొక్క పరిపూర్ణపరబాహ్యామే. అది పుట్టించదు గిట్టించదు. దాని యందు జ్ఞానము గాని, కర్మలు చేయుటకు వలయు శక్తి లేదు. అందుకే దానిని "నిశ్శక్తిః నిర్మలం పూర్ణం" అని అన్నారు. శ్రీ కృష్ణదేశికేంద్రులవారు తను కంద పద్యములలో క.ద.32॥"...... **చట్టువలె కదలకుండును॥ బట్ట బయల్..."** అని క.ప:60॥ **బయలెప్పుడు జేయబోదు॥ పనులెవ్వైనన్॥** అని వర్ణించియున్నారు. అనగా పరిపూర్ణ పరబ్రహ్మము అక్షర పురుష డొనర్చునట్టి ఉత్పత్తి,స్థితి, లయ, విస్తీర్ణ, ఆకర్షణములు (సమిష్టికర్మలు) క్షరపురుషుడు జ్ఞానేంద్రియములచే విషయ పంచకము తెలుసుకొని కర్మేంద్రియములచే (వ్యష్టి కర్మ) కర్మ ఆచరించును. పరిపూర్ణ పరబ్రహ్మము సమిష్టి కర్మలు గాని, వ్యష్టికర్మగాని చేయదు. అందుకే దానిని నిష్క్రియమని ప్రశంసించినారు.

**నిరవద్యం :** నిరవద్యమనగా నిందలు లేనిది. ఉత్కృష్టమైనది అని అర్థములు గలవు. పరిపూర్ణపరబాహ్యాము నిందలులేనిది, ఉత్కృష్టమైనది, నింద అనె పదము స్తోత్రము నపేక్షించును. కనుక సాపేక్షికము, ద్వంద్వరూపమైనది. నిందా స్తోత్రములు గలది బ్రహ్మామే. ఎందుకనగా పరిపూర్ణ పరబాహ్యామందు ఎరుక లేదు. కనుక దాని కహంవృత్తి లేదు. అది అహం ను పుట్టించదు, అహంకారమును యెరుగదు. ఎరుకే లేదు గనుక యే నిర్ణయమును చేయదు. ఉపాసించదగినది గాని, ధ్యానింపదగినది గాని కాదు. వరమీయదు శపించదు.**"తదేవ బ్రహ్మత్వం విద్ధినేదం బ్రహ్మ యదిద ముపాసతే"** అని కేనోపనిషత్తు చెపుతుంది. అనగా ఉపాశింపబడేదేదీ బ్రహ్మము కాదని తెలుకో అని తాత్పర్యము. **"ఆత్మావారే ద్రష్టవ్యశ్రోతవ్యో మంతవ్యో నిధి ధ్యాసి తవ్యః॥బృహ॥** అనగా ఆత్మయే చూడదగినది, వినదగినది, మననముచేయ దగినది, ధ్యానముచే పొందదగినది అనగా మనస్సుచే తెలియదగినదిగా నున్నది. పరిపూర్ణ పరబ్రహ్మము మనస్సుచే కూడ గుర్తింపరానిది. **"అథాతో బ్రహ్మ జిజ్ఞాసా"** అని చెప్పిన వ్యాసులు వెంటనే **"జన్మాద్యస్యయతః"** అని సూత్రీకరించినారు.

అనగా సృష్ట్యాదులకు కారణమగు బ్రహ్మమే జిజ్ఞాసగావింపబడుచున్నదని వ్యాసులు స్పష్టముగా జెప్పినారు. పరిపూర్ణ బ్రహ్మము జిజ్ఞాసితవ్యముగాదు. శబ్దబ్రహ్మమునకు సంబంధించినదే. అదే వుపాసింపతగినది. శబ్ద బ్రహ్మము తెలిసిన గాని పరిపూర్ణము తెలియబడదు.

**"ఉపాసకానాం హితార్థాయ బ్రహ్మణోరూపకల్పనా"** భక్తుల సౌలభ్యము కొరకు బ్రహ్మమునకు సగుణరూపమును కల్పించినారు. **"ఏ కోదేవా స్త్రీదా భిన్నా బ్రహ్మా విష్ణు మహేశ్వరః"**ఒకటైన స్వయం ప్రకాశ వస్తువే బ్రహ్మవిష్ణు మహేశ్వరులుగానైనది. 'Neither praise nor blame' నానుడి ప్రకారము నిందచేయువాడే స్తోత్రము చేయును.అందుకే నిందా స్తోత్రములు చేయు వాడొక్కడే. కారణ కార్యములు గలవాడే. మరియు నిందాస్తుతి ఎరుకపనే. కనుక పరిపూర్ణ పరబ్రహ్మము నిందచేయదు. స్తోత్రము చేయదు. వైశేషికులు ఆత్మను వస్తువన్నారు. కనుక ఆత్మను నిందా స్తుతులు జేయవచ్చును గాని ఏమికాని దానిని నిందా, స్తుతులు చేయుట వల్ల ప్రయోజనమేమి? ప్రయోజనము శూన్యము. పరిపూర్ణ పరబ్రహ్మము దేనికి విషయముకాదు. విషయమే కానప్పుడు నిందించిననేమి, స్తోత్రము జేసిననేమి?

**నిరామయము :** నిరామయమనగా వ్యాధులు లేనిది. నిర్+అమయః= నిరామయము. అనగా పరిపూర్ణ పరబ్రహ్మము వ్యాధులు లేనిది. " ఆకాశ శ్శరీరం బ్రహ్మ" అని శ్రుతి. ఆకాశము అసంగము. అచలము నిష్క్రియము అయివున్నది గదా ! దాని యందు వ్యాధులేమిటి. అంటే ఆకాశము జడ ప్రకృతి రూపముగా నున్న అదియే పరమాత్మతో కూడి మిగతా నాలుగు భూతములుగా మార్పుచెంది సర్వమునకు తావిచ్చుటయే దానికి గల ముఖ్యవ్యాధి. ఆకాశమునకున్న వ్యాధులు ఈ గుణత్రయ ప్రకృతిని బీజరూపముగా తనయందే యిముడ్చుకొని తాను తానై యున్న కేవల బ్రహ్మ స్థితి యందు మాత్రమే ఆ పరమాత్మ నిరామయుడు. ప్రకృతితో గూడిన సగుణ రూపుడగు పరమాత్మకు ఆ నిరామయ శబ్దము వర్తించదు. "సోఽకామయత బహుస్యాం ప్రజాయేయతి" అని, " ఇచ్ఛామాత్ర ప్రభు సృష్టి" అని చెప్పుచున్న శ్రుతివాక్యములలో ఇచ్ఛా ద్వేష ప్రయత్నాది సర్వగుణత్రయ వ్యాధులు గానవచ్చుచున్నవి.

ఇచట వ్యాధి యనగా యోగము. యోగవిఘ్నములు లేని వాడు నిరామయుడు. అనగా యోగమునందే యెడతెగక యుండు వాడని వర్ణించియున్నారు. తన ఆవరణ రూపమైన ప్రకృతితో విడిచి వేరుకాకుండ నున్నవాడు నిరామయుడని పిలువబడుచున్నాడు. ఆ పరమాత్మతో ఏకత్వ సాధన చేయువాడు నిత్యముక్తుడని గీత వర్ణించినది. కాని ఎట్టి వ్యాధుల ఎట్టి యోగములేనిది పరిపూర్ణ పరబ్రహ్మము అనగా పరిపూర్ణ పరబ్రహ్మము నందు ఎట్టి వ్యాధులు అనగా గుణత్రయములు లేనిదీ, యోగముగానిది.

**నిర్దేశరహితం :** నిర్దేశము అనగా ఆజ్ఞ, ఉపదేశము, నిశ్చయము, చెప్పుట అని అర్థములు గలవు. పరిపూర్ణ పరబ్రహ్మమును నిర్దేశించి, నిశ్చయముగా జెప్పవీలుకానిది. ఉపదేశించుటకు వీలు పడనిది. పరిపూర్ణపరబ్రహ్మము మనస్సునకు, వాక్కునకు తెలియని దానిని ఎట్లు నిర్దేశించవచ్చును? అనగా అది యిట్టిది అట్టిది యనరానిది. ఇటు వంటిదని చెప్పరానిది. అందుకే కేనోపనిషత్తు నందు "నతత్ర చక్షుర్గక్షతి, నవాగ్గచ్ఛతి, నోమనః ........యేనస్తద్వ్యాచ చక్షిరే" అనగా వాక్కుకు అందదు, మనస్సుకు, కన్నుకు అందదు. జ్ఞానమునకు కూడ తెలియరానిదేదో, అది తెలిసిన దానికంటెను,తెలియరాని దాని కంటెను

వేరుగా నున్నదని పూర్వము పెద్దలు తెలుసుకొని శిష్యులకుపదేశించిరి. **"అచక్షుష్క, మశ్శ్రోత్రమనాగ్గమనః"** అనగా కండ్లు, చెవులు, వాక్కు మనుసులు, లేనిది పరిపూర్ణ పరబ్రహ్మము. **"అప్రాణోహ్యమనః శ్శుభ్రోహ్యక్షరాత్ పరతఃపరః"** - ముండక॥ అనగా అది మనః ప్రాణములు లేనిది. క్షర, **అక్షర పురు కంటే** పరముగా నున్నది.

**నిత్యం బాహ్యబ్రహ్మేతి నిశ్చితం :** నిత్యమనగా శాశ్వతమై ఏలాంటి మార్పులేనిది. బ్యాహ్య బ్రహ్మేతి అనగా పరిపూర్ణపరబాహ్యము, నిశ్చితం అనగా నిర్ణయించబడినదని అర్థము. అన్నిటిని కలిపి చూచిన పరిపూర్ణపరబాహ్యము నిత్యమై శాశ్వతమైనదని నిర్ణయము. శ్రీ కృష్ణదేశికేంద్రులవారు కంద పద్యములలో **॥61॥ "బయలనిన నిత్యవస్తువు । బయలనిన నొక్క రీతి నుండు బ్రహ్మాండములో బయలనిన కండ్ల బడనిది । బయలనిన బ్రహ్మాండ మవల బరగెడిది సుమీ ॥**అని శెలవిచ్చియున్నారు. అనగా అచల పరిపూర్ణ పరబయలు శాశ్వతమైనది. కాలత్రయములతో బ్రహ్మాండము మార్పు చెందునట్లు మార్పు చెందక ఇటువంటిదని చెప్పుటకు వీలుకాక ఆదిమధ్యాంతములు లేక నిండి నిబిడీకృతమై బ్రహ్మాండము లోపల బయట అచల పరిపూర్ణ పరబయలుండును.

**శ్లో॥ అస్తిభాతి ప్రియం రూపం । నామచ్ఛేత్యంశ పంచకం ।**
**ఆద్యత్రయం బ్రహ్మరూపం । బగద్రూపం తతోద్వయం ॥**

అస్తి (సత్), భాతి (చిత్), ప్రియం (ఆనందము), రూప, నామములు, ఐదు లక్షణములతో మొదటి మూడు నిత్యమైన బ్రహ్మముగాను, నామరూపములు అనిత్యమగు జగత్తుగాను జెప్పబడినవి. బ్రహ్మము ఏకము, అనంతము, నిత్యము. నామరూపములు లసంఖ్యాకములు అనేకములు అనిత్యములు. "ఏకం అనేకం భవతి" అనే న్యాయంగా ఒకే బ్రహ్మము ద్వివిధముగా నున్నది. నిత్యానిత్యములనే ద్వంద్వ లక్షణములుగా గలిగి కారణ బ్రహ్మమని, కార్యబ్రహ్మమని చెప్ప తగియున్నది. నిత్యానిత్యాములనే నిర్ణయమెరుగని కేవల నిత్యత్వ మొక్క పరిపూర్ణ పరబ్రహ్మమందే గలదు. కనుక పరిపూర్ణ పరబాహ్యమే నిత్యమై శాశ్వతమైనదనెడిది నిశ్చయము.

**9. మాయాత్పరం భవేద్యస్తు । తత్పరం పరమశ్శివః**
**సర్వపరిపూర్ణగ్ం సత్యం । శివాదన్యం నకించిన**

మాయకు పరమై శ్రేష్ఠమైనది పరిపూర్ణపరబ్రహ్మము. అదే శివము. శివ మనగా మంగళకరమైన పరిపూర్ణపరబాహ్యము. సర్వపరిపూర్ణమైనదే సత్యము. సత్యము అనగా శాశ్వతమైనది. అట్టి శివము కన్న అన్యమైనది ఇతరమైనది కొంచమైనలేదు.

**వివరములు :- మాయాత్పరం భవేద్యస్తుతత్పరం పరమశివః :** మాయకంటే పరమైన శ్రేష్ఠమైనది పరమశివము. "యా మా సా మాయా" అని మాయకు నిర్వచనము. అది అనాది. ఒకప్పుడుండి ఒకప్పుడు లేకుండునో అది మాయయని అర్థము. అంటే ఎల్లప్పుడుండేది ఒకటి, లేకుండేది ఒకటి యని రెండు వస్తువులున్నట్లు చెప్పినట్లయినది. ఈ రెండవ వస్తువు మాయ. అద్వైతరీత్యా పరబ్రహ్మమొక్కటే ఎల్లప్పుడుండేది కనుక దాని యందే తోచి, దాని యందే యుండి, దాని యందే మరల లేకుండ పోవుచున్నది. సృష్టికి పూర్వము అసలు లేనేలేనట్లు తోచుచున్నది. సృష్టి ప్రారంభకాలమున బ్రహ్మము నందు తోచి, బ్రహ్మము తోకూడి జీవేశ్వర జగత్తుకు కారణమైనట్లు చెప్పబడినది. మాయ బ్రహ్మము నుండే కలిగినది.

వృక్షకారణము బీజమునందు అణగి మణగి యున్నట్లే జీవేశ్వర జగదాది మాయా కార్యములు సహితం బ్రహ్మనందు బీజరూపముగా యణగిమణగి యున్నవని చెప్పాలి. ఎక్కడ దాగి యుండెనో అక్కడే ప్రకటమై అక్కడే యుండి అక్కడనే తిరోభావము చెందినవి.

అధిష్ఠానబ్రహ్మముతో పాటే మాయ యున్నదని చెప్పాలి. ఈ మాయ బ్రహ్మములలో మాయ అనిత్యమని, బ్రహ్మము నిత్యమని యనరాదు. మాయాది గుణములు ఆ బ్రహ్మమునందు అవిర్భావ తిరోభావములు చెందుచున్నవేగాని బ్రహ్మమున కన్యదేశమున లేవు. మరియు "బ్రహ్మణోన్యం నకించిన" అనగా ఆ బ్రహ్మమునకు అన్యముగా కొంచమైనను లేదు." సర్వం ఖల్విదంబ్రహ్మ" అంతా బ్రహ్మస్వరూపమే. కనుక మాయబ్రహ్మములు రెండు బ్రహ్మము యొక్క రూపాంతరములేయని చెప్పాలి. **"మీయతే అనేన యితి మాయా"** అనే నిర్వచనాను సారము అమితమైన దానిని ఒక మితిలోనికి తెచ్చి ప్రదర్శించుచున్నదేమాయ.

మాయ బ్రహ్మములు సృష్టి, స్థితి, లయములు గావించుచున్నవి. అందులకే శ్రీ కృష్ణదేశికేంద్రులవారు క.ద. **50॥ "అన్నియు తానై । తన కవి పన్నుగ వేరనుచ నోటబలుకుచు। మరి తానన్నిటి యెరిగే యెరుకై । యున్నానని యెరుకే నెరుక। నూహింపుచుండూ । తనలో తాను మోహింపుచుండూ । యెన్నో విచిత్రాలు యెరుక సేతలు వింటె। వున్నాది లేదు। లేకున్నాది గలదని । వూహింపుచుండూ॥"**అని సెలవిచ్చియున్నారు. కనుక ఈ అధిష్ఠాన చేతన బ్రహ్మము కంటే అద్భుతమైనది మరొకటి లేదు. కనుక మాయ కంటే పరమైనది బ్రహ్మము అనకుండ మాయ బ్రహ్మము కంటే పరమైనది పరబ్రహ్మము లేక పరమాత్మలేక శివము. శివము కంటే పరమైనది పరమశివము యిది అత్యంత మంగళకరమైనది.అదే పరిపూర్ణపరబ్రహ్మము.

**సర్వపరిపూర్ణగ్ం సత్యం । శివాదన్యం నకించిన :** సర్వమునందు గల పరిపూర్ణ పరబాహ్యం సత్యము శాశ్వతమైనది అని అర్థము. పరిపూర్ణ మొకటి తప్పా మిగతా దంతా అసత్యమే. అదే ఎరుక. పరిపూర్ణమే సత్యమైనది శాశ్వతమైనది. ఆ యెరుక పరిపూర్ణమందు లేకనే తోచినది. పరిపూర్ణము ఎరుకగా మార్పుచెందలేదు. పరిపూర్ణ మందు గుర్తెరిగే ఎరుక యెన్నడు లేదు. కనుక అఖండ యెరుకగాని, జీవేశ్వర జగత్తుగా మారవలెననిగాని సంకల్పించలేదు. పరిపూర్ణమందు ఎట్టి అహం వృత్తిలేదు. కర్తృత్వ భోక్తృత్వములు లేవు. అది దేనికి అనగా జీవేశ్వర జగత్తులకు ఆధారముగాని అధిష్ఠానము గాని కాదు. త్రిగుణములు లేవు. పరిపూర్ణమందు ఎరుక లేదు. పరిపూర్ణమే సర్వ వస్తువుల యందు నిండి నిబిడీకృతమై యున్నది. అదొక్కటే సత్యమైనది. ఎరుక వున్నట్టుగా తోచబడుటయే గాని అదిలేనే లేదు. గుర్తెరిగే తెలివిగా తోచినది తానే, తోచి తన్ను తాను చూచుకొని, తాను సత్యమైన బ్రహ్మనని తన్ను తానే నమ్మినది. తానే బ్రహ్మనను కొన్నది. తానే అనేకముగానవలెనని తలంచి తానే జీవేశ్వర జగత్తులుగా మారి, సుఖదుఃఖములు పొందుచు పట్టుకాయలోని పట్టుపురుగువలె బంధమున తగులుకొన్నది. తానుగాని తానులేని పరిపూర్ణ బ్రహ్మమున్నదని తెలుసుకొనే వరకు భ్రాంతిలో మునిగి జనన మరణ ప్రవాహమున పడి కొట్టుకొనుచున్నది. **క.ప॥67 "కడువేద్కబయలుగనెనా। ఘడియైనను నిల్వలేక కల్లపోవును"** రీతిగా లేనిదిగా లేకుండ పోయినది. సత్యమైన పరిపూర్ణ పరబ్రహ్మమే శేషించియున్నది. రెండు సత్యములుండుటకు వీలు లేదు. కావున సత్యమైనది శాశ్వతమైనది శివము ఒక్కటే ఇతరమైనది ఏదిలేదు.

**అయం వ్యర్థః బాహ్యః కోపిన భవతి**

ఈ ఉత్త బట్టబయలు ఏమిలేదు.

అయం = ఈ ఆత్మ,

వి+అర్థం = విశేష అర్థము గలదియగు మోక్షస్వరూపమనియు లేక

విగతః + అర్థః = ప్రకృతి సంబంధమైన సంపదగల మహదహంకారాది అష్ట ప్రకృతులకు పరమైనదనియు.

వ్యర్థః = సర్వము శూన్యమైనది కావున ఏమియు లేదనియు.

బాహ్యః= బయలున, కోపి = ఏదియును, నభవతి=పుట్టలేదు.

బయలనగా, ఆవరణతో కూడిన ఆకాశము కాని దాని కతీతమై సూర్యాకాశము, దహరాకాశము, నిరవయాకాశము, మహాకాశములు కాని కాదు. వీని కంటే అతీతమై అవకాశ రహితమై, తేజోంధకార రహితమై రాకడపోకడ కలిగన దానికి అవకాశముగాని, యునికినిగాని లేశ మాత్రము గుర్తెరుగనిదై సర్వకాల సర్వావస్థలయందు ఏకరీతిగా అచలమై పూర్ణమై బట్టబయలై యున్నదేదో అదే బయలు. శ్రీ మద్భాగవత కృష్ణదేశికేంద్రులవారు గురు మంత్ర నిర్ణయమందు క.ద. 226. **ఆ మంత్ర యుగము దెల్పెద । నేమముతో దలపు ముత్తదీ బట్టబయల్। యేమి లేదని పలికిన యా మంత్రమే ద్వాదశాక్షరి"** అని సెలవిచ్చియున్నారు. మరియు **క.ద227 తొలు మంత్రర్థ మెక్కడ కలదోయని వెదుక నేల కలదంతట యా"** అనగా ద్వాదశాక్షరి మంత్రము ఎచ్చట గలదోయని వెదుకవలసిన పని లేదు. అది యెరుక మరుపు యనునది లేక సర్వత్రా నిండి నిబిడీకృతముగా ములుగ్రుచ్చ సందు లేక యున్నదని స్పష్టముగా తెల్పినారు. క.ద.॥ **150 "సత్యమగు బట్టబయలు నసత్యమగు యెరుక నెరిగి। సద్గురు కృపచే। సత్యము గాదని యెరుకను। సత్యముగా నమ్మి వుంటే। చాలు చాలన్న"** అని గానము చేయబడినది.

అట్లే గురు మంత్రజపము నందు క.ద. 228 **"రానిది పోనిది బయలని । లేనిది ఈ యెరుక యనుచు లెస్సగ దృఢమౌ । దాకను నీవీమంత్రము మానక జపి యుంచు చుందుమా నీతిశాలి"** అనగా అచల పరిపూర్ణపరబయలు జనన మరణములు లేనిది. నామరూపనటనాత్మకమగు ఎరుక లేనిది. కనుక ఇహపరాదులందు ఎచ్చట లేనేలేనిదనియు. వస్తు నిశ్చయముగా నీ మనంబునకు దృఢమయ్యేవరకు నీ మంత్ర రహస్యమును మరువక జపించుమన్నారు. ఈ మంత్రమును, మంత్ర రహస్యమును మరియు మంత్రము యొక్క ధర్మములు గురుముఖతః విన్నప్పుడే సార్థకమగును. కావున జనన మరణ రహితమును గావించుకొనదలచినవారు సాంప్రదాయక పరిపూర్ణ గురువులనే ఆశ్రయించవలయును. ఈ ఉత్తబట్టబయలు ఏమిలేదంటే, ఈ వుత్తబట్టబయలు తప్ప యేమి లేదని అర్థము గైకొననలయును. అనగా పరిపూర్ణము తప్ప యేమి లేదని గ్రహించవలయును.

**10. నిరాభాసం నిరాధారం । స్వప్రకాశ వివర్జితం**
**భ్రాంతి జ్ఞానం పరిత్యజ్య । సర్వం నాస్తీతి నిశ్చితం**

పరిపూర్ణపరబాహ్యము అభాస లేనిది. అనగా లేనిది వున్నట్లుగా తోపింపజేయునది. ప్రతిబింబము లేనిది. అది దేనికి ఆధారముగాదు. దాని కింకొకటి ఆధారముగాలేదు. స్వయం ప్రకాశము కానిది. జ్ఞానమనే భ్రాంతిని వదిలినది. అందు సర్వము లేనిదని నిర్ణయము.

**నిరాభాసం :** నిరాభాసం అనగా అభాసలేనిది. అభాస యనగా లేనిది వున్నట్లుతోచుట, ప్రతిబింబమను అర్థములు గలవు. **"ఉన్నది లేదని యూహింపగా నేర్చు, లేనిది కలదన లెస్స నేర్చు"** అని మాయా ప్రభావము వర్ణింపబడినది. కనుక "అభాస" మాయా ప్రభావము. నిరాభాసము అనగా మాయా ప్రభావమునకు లోబడనిది. తన యందు బీజరూపములో నున్న మాయా శక్తి విజృంభణ కానంతవరకు, త్రిగుణ స్వరూపియగు మాయా ప్రభావమునకు, సృష్టికి పూర్వము బ్రహ్మము లోబడని మాట సత్యమే. మాయా ప్రభావమునకు లోబడుటవలననే ఆ బ్రహ్మము జగద్రూపముగా భాసించుట. కనుక ఒక స్థితిలో నిరాభాసము, మిగతాస్థితులలో అది సాభాసమే. ఆ బ్రహ్మమునకు ప్రతిబింబము లేదని చెప్పుటయు నట్టిదే. మాయ యందు ప్రతిబింబించి ఈశ్వరుదని, అవిద్యయందు ప్రతిబింబించి జీవుడనియు నామరూపములు చెందినది కారణబ్రహ్మమే. కావున కారణ బ్రహ్మము సృష్టికి పూర్వము నిరాభాసమే. తర్వాత ఆ స్థితి దానికి లేదు. నిజముగా నిరాభాసమైనది పరిపూర్ణపరబాహ్యమొక్కటే.

**నిరాధారము :** నిరాధారము అనగా ఆధారముగానిది ఆధారము లేనిది. పరిపూర్ణపరబాహ్యము. నిరాధారము అనగా దానికి ఇంకొకటి ఆధారముగా లేదు. అది ఇంకొక దానికి ఆధారముగా నిలిచి యుండుటలేదు. అందుకే దానిని నిరాధారమన్నారు. కార్యరూపమగు జీవేశ్వర జగత్తు యొక్క సృష్టి, స్థితి, లయములకు మూలకారణమైనది యెరుక. సృష్టి యందున్న సమస్త పదార్థములకన్నిటికి ఈ యెరుకే (బ్రహ్మమే) ఆధారము అధిష్ఠానమునై యున్నది. ప్రళయము నందు జీవేశ్వర జగత్తు బీజరూపము దాల్చి ఈ యెరుక యందు గర్భీకృతమైయుండి పునః సృష్టి యందు తిరిగి ఆవిర్భావము చెందుతుంది. పరిపూర్ణ పరబ్రహ్మము సకల దేశాల యందు సర్వకాలాలయందు సమస్తమైన వస్తువులందు వున్నది. కనుక యెరుకయు తత్కార్యరూపమగు సమస్తము పరిపూర్ణములోనే తోచును. కాని అన్యస్థానము లేదు గదా ! కనుక పరిపూర్ణము ఎరుకకు అధిష్ఠానమైయున్నదని అంటారు. కాని అది సరిగాదు. ఇందుకు ఉదాహరణ రజ్జు, సర్పమును స్వప్నానందమును జెప్పుదురు.

స్వప్నములో కలిగిన ఆనందము కేవలం లేనిదికాదు. స్వప్న మందలి దృక్ ద్రష్ట దృశ్యములు మూడు మనస్సే అయినవి. శోక మోహములు మనోధర్మములు. ఆ మనస్సు స్వప్న కాలమున ఆనందించినది. స్వప్నగతుడగువానికి ఏడ్పు, భయము, వీర్యస్ఖలనము వాని స్థూల శరీరమున కనబడుతున్నాయి. ఇది కేవలం లేనిది గాదు. స్వప్నానందమునకు మనస్సు ఆధారము అధిష్ఠానముగానున్నది. కనుక పరిపూర్ణ బ్రహ్మము దేనికి ఆధారముకాదు. కనుక అది నిరాధారము అని చెప్పబడినది.

**వివరములు :- స్వప్రకాశ వర్జితం:** పరిపూర్ణ పరబ్రహ్మము, స్వప్రకాశము లేనిది. అది స్వ ప్రకాశమును వదిలినదని ఈ శ్లోకమున వర్ణించబడినది. స్వయం జ్యోతి స్వప్రకాశము గలది అధిష్ఠాన చేతన బ్రహ్మమని తెలియవలెను. ఈ బ్రహ్మమునే అచ్చతెనుగున ఎరుక అన్నారు. పుట్టని పరిపూర్ణ పరబ్రహ్మమునుండి మరేది పుట్టదు. దాని యందెట్టి కారణ బీజములు లేవు. పుట్టించే సత్తా కలిగినది మరియు పుట్టేది కూడ యెరుకే. కనుక యెరుకకు యెరుకే మూలం. అందుకే స్వతఃకారణమని స్వయం ప్రకాశమని, స్వయం భూ అని ఈ లేనెరుకను వర్ణించబడుతుంది. అట్టి బ్రహ్మమునకు బ్రహ్మమే కారణము, దానికదే స్వకారణము అందుకే అధిష్ఠాన చేతన బ్రహ్మము స్వప్రకాశము గలది, స్వయం భూ అనీ అంటారు. పరిపూర్ణ

పరబ్రహ్మము దేనిని పుట్టించదు. సృష్టికి కారణ భూతము కాదు. కనుక అది స్వప్రకాశములేనిది.

**భ్రాంతి జ్ఞానం పరిత్యజ్య :** పరిపూర్ణ పరబ్రహ్మము భ్రాంతి యను జ్ఞానమును వదిలి పెట్టినది. అనగా అందు భ్రాంతి యనెడి జ్ఞానము లేదు. భ్రాంతి యన్నను, భ్రమ అన్నను పర్యాయ పదములే"భ్రం" అను ధాతువు నుండి ఈ పదమేర్పడి నది. భ్రం అనగా భ్రమణము, తిరుగుట యని అర్థము. అంతేగాదు 'భ్రం' యనగా చలనము, చలించునది. దీనికి వ్యతిరేకము అచలము. కనుక అచలపరిపూర్ణపరబాహ్యమునకు యెట్టి భ్రాంతి, యెట్టిభ్రమణము, యెట్టి చలనము లేదన్నమాట. కనుక పరిపూర్ణమొక్కటియే భ్రాంతి రహితస్థానము. సృష్టి సంకల్పము కలిగిన బ్రహ్మమే జగత్కారణము. చలనము లేనిదే ఏ సృష్టియు జరుగుటకే వీలు లేదు. కనుక ఈ చలనము, చలనము పొందిన వస్తువు చలన కార్యమైన జీవేశ్వర జగత్తు అంతయు చలనమే. భ్రాంతియే యనజెల్లును. ఈ చలనము చెందిన వస్తువునకే భ్రాంతి రహితము గావలసి యున్నది. ఈ చలించు లక్షణము భ్రాంతి ఎరుకకే కలిగినది. కావున ఎరుకే భ్రాంతి, భ్రాంతియే ఎరుక. ఇట్లనుట కోసం దేహమే లేదు గాని తొలగవలసినది ఎరుక కాదు. ఎరుక యందలి భ్రాంతియే.

అయితే అఖండ ఎరుకను గురుకృపచే వదలి అనగా తన నిజస్వరూపమునకు పరిపూర్ణ పరబ్రహ్మమందు మూలముగాని స్థానము గాని లేదని ఆరూఢత చెందినవాడు కర్తృత్వత్యాగియై అశరీర స్థితిలో నుండును. అట్టి వానికి పాపకార్యములు చేయవలెననెడి సంకల్పము కూడ నుండదు. అతనికి పాప పుణ్యములంటవు.

"ఏకమేవాఽద్వితీయం బ్రహ్మ" అని కొనియాడబడే వస్తువు భ్రాంతిచే అన్నియు తానైనది. తానైన సమస్తము నందు భేద బుద్ధిబూని అవి తనకంటే వేరని తాను వేరని భ్రాంతి చెంది రాగద్వేషములకు, భ్రాంతులకు పట్టణమన జెల్లియున్నది. ఆ విధముగా భ్రాంతి, భ్రాంతి చెందే వస్తువు, భ్రాంతికలిగించే వస్తువు (భ్రాంతి కారణ వస్తువు) తానై త్రిపుటి రూపంగా నున్నది. గిర గిర తిరుగువాడు వున్న వస్తువును వున్నట్లుగా గ్రహించడు. అంటే చలనమున్నప్పుడే భ్రాంతి. అచలమన్నప్పుడు భ్రాంతియేలేదు. కనుక యెరకయే భ్రాంతి. భ్రాంతి రహిత మెట్లగుననగా:

**శ్లో॥ అశరీరం సర్వదాస్తి శరీరం రహితం సదా ।**
**అయమేవ సద్యోముక్తి రన్యదా భ్రమకారణం ॥**

అనగా శరీరములేని పరిపూర్ణ పరబ్రహ్మమే ఎప్పుడు వుండి యున్నది. శరీర మెప్పుడును లేదు. ఈ సిద్ధాంతము దృఢమైన తక్షణమే సద్యోముక్తి.

**సర్వం నాస్తీతి నిశ్చితం :** పరిపూర్ణ పరబ్రహ్మమందు వున్నట్లు తోచిన దంత లేనెరుకనే వున్నట్లుగా తోచుచున్నది. కావున సర్వము లేనిదేయని నిర్ణయము. పరిపూర్ణమందు అన్యమేమి లేదు. తదన్యమంతయెరుక స్వరూపమే. ఆ లేనెరుక పరిపూర్ణ మందు యీషణ్మాత్రములేదు. పరిపూర్ణము గుర్తించు ఎరుక పరిపూర్ణమందు లేదు. కనుక అది గుర్తింప బడజాలదు. అట్లని అది శూన్యముగాదు. అది ఏకైక అస్తిక్యతగలది. దానిని తెలుసుకొనే తెలివి లేదు. ఇంద్రియ రూపముగా అతీంద్రియరూపముగా నున్న దెరుకే. పరిపూర్ణ పరబ్రహ్మము అట్టి అతీంద్రియరూపమైన మనస్సుచే కూడ గుర్తింపరానిది. దానియందు పంచతన్మాత్రలు లేవు. కనుక దేనికిన్ని అది విషయము కాదు. పరిపూర్ణము తప్ప తదన్యమంత లేనిదని నిశ్చయమును

శ్రీ కృష్ణదేశికేంద్రులవారు. క.ద. ॥54॥ **పరిపూర్ణ మొకటి దక్క నితరమైన ప్రపంచమెల్ల దగతెలియుము నీవెరుకేనని మదిలోపల"** అని సెలవిచ్చినట్లు పరిపూర్ణమందు లేనెరుక లేదు. ఇతరము ఈషణ్మాత్రము లేదనెటిది నిశ్చయము

**11. ద్రష్టుదృక్చ జగత్సర్వం । సంభవం నాస్తి సర్వదా**
**మర్కటశ్శృంగవద్భాతి । సత్యం సత్యం నసంశయః ॥**

ద్రష్టయనగా సమస్తమును గాంచుచుండు జీవుడు. దృక్కు అనగా జీవ సంబంధమైన జ్ఞానము. దృశ్యమనగా జీవున కెరుకై నట్టి సకల ప్రపంచము. ఈ జీవేశ్వర జగత్తు పుట్టినట్లు తోచిన, ఎల్లప్పుడూ లేనిది. దీనిని కోతి కొమ్ముతో జెప్పినారు. కోతి కొమ్ము సత్యమైతే జగత్తు వునికి కూడ సత్యము. కోతికి కొమ్ముండదు కావున జగత్తు సత్యము గాదని దృఢపరుచుటకు సత్యం సత్యమని రెట్టించి చెప్పబడినది.

**"ద్రష్టుదృక్చజగత్సర్వం । సంభవం నాస్తి సర్వదా:"** దృక్కు అశాశ్వతమని శాశ్వతమని రెండు రకములు:

**1. అశాశ్వతదృక్కు :** నేత్రశ్రోత్రాదుల ద్వార విషయగ్రహణము చేయునది అశాశ్వత దృక్కు. ఇది అంతఃకరణ మార్పునకు లోబడి జ్ఞానేంద్రియముల ద్వార విషయపంచకము నెరిగి నానాత్వము చెంది బంధకారణమగుచున్నది.

**2. శాశ్వత దృక్కు :** పిండ బ్రహ్మాండముల వుత్పత్తి స్థితి, నాశనములను చక్కగా విచారించి వ్యష్టిసమిష్టుల యందు, శరీరత్రయ, అవస్థాత్రయ అభిమానములనెరిగి ఈ అన్నిటి యందు అనువృత్తముగా తానే యున్నానని గ్రహించి యింద్రియములు తనను ప్రకాశింపజేయజాలవని, ఆయా యింద్రియముల వలననే సూర్యచంద్రాగ్నులు సహితము ప్రకాశింపజేయు స్వయం ప్రకాశ మూర్తియే తానని గుర్తించుటయే శాశ్వత దృక్కు.

**"తమేవ భాంతమను భాతి సర్వం తస్య భాసా స్వర్వమిదం విభాతి"** అనగా అదియే స్వయం ప్రకాశమగు వస్తువు. దాని ప్రకాశములోనే యీ సర్వము ప్రకాశించుచున్నది.

సర్వజీవ వ్యవహారమునకు స్థూల దేహ మాధారముగా యున్నది గాని ఆ స్థూలదేహము కంటే యింద్రియములు, యింద్రియములకంటే మనస్సు, మనస్సు కంటే బుద్ధి, బుద్ధి కంటే ఆత్మ వుత్తరోత్తర గొప్పవై యున్నవి. పిండ మందేగాక బాహ్యమందు గల బ్రహ్మాండ మందు తెలియబడు సమస్తము నాచే తెలియబడుచున్నది. కనుక అవి యేవియు నేను గాను. "ద్రష్టుర్యోగ్యం దృశ్యం" కనుక అవన్నియు నాచే చూడదగిన దృశ్యములు. కనుక అవినేను గాదు. "యద్దృశ్యం తన్నశ్యం" కనుక అవన్నియు నశ్వరములే. నేను వాని యన్నిటి నాశనమునకు కూడ సాక్షినైయున్నాను. దృశ్యము మారును కాని నేను మారను. ఖండ ఖండములుగా కనబడుచున్నానుగాని నిజముగా నా స్వరూపమఖండమే. దృశ్యములనేకములు గాని ద్రష్టలేక దృక్కు మాత్రం ఏక రూపము. సకల దృశ్యములకు నేను ద్రష్టగా సాక్షిగా నున్నానేగాని నాకు మరొక సాక్షిలేదు. నా స్వరూపమును నా వునికిని తెలుసుకొనువాడను నేనే. నేను సచ్చిదానంద స్వరూపుడను. నేతి నేతియని సర్వనామరూపములను నిషేధించుచు పోగా ఏ జ్ఞానము శేషించునో అదియే దృక్ స్వరూపముగా నిర్ణయించి దృక్ బ్రహ్మయని యన్నారు.

"దృశ్యం మాయ" ఇంత ప్రత్యక్షముగా గోచరించుచు మానవుని సుఖ దుఃఖాలకు

కారణమైన దృశ్యరూపప్రపంచ మంతయు మాయ యని విశ్వసించవలయును. ఎందుకనగా సృష్టికానేలేదు, సృష్టిలేనేలేదు. ఉన్నట్లు తోచబడుట మాత్రమే. దీనినే వివర్తవాదమందురు. వివర్తమనగా యదార్థమై నిలిచి యున్న ఒక వస్తువు నందు యెట్టి మార్పు కలుగ కున్నప్పటికి తాను మరొక వస్తువుగా భాసించుట వివర్తమనబడును. త్రాటి యందు నిజముగా పాము ఎన్నడును లేక పోయినప్పటికి ఒకప్పుడు తోచబడినట్లే బ్రహ్మము నందు ఏక కాలమున లేని ఈ ప్రపంచము తోచబడినదని చెప్పుదురు.

జగత్తునందు తోచబడు సకల పదార్థములు ఏక దేశీయములు. మితి పరిమాణములు, క్షణికములు, అనృత జడ దుఃఖము స్వరూపములు, నామరూపాత్మకములు అయియున్నందున యివి పారమార్థికముగా లేనివే కనుక మిథ్యయని చెప్పబడినది.

**మర్కటశ్శృంగవద్భాతి । సత్యం సత్యంన సంశయః :**

జగత్తు కోతి కొమ్మువంటిదని దృష్టాంతమిచ్చి యున్నారు. కోతికి కొమ్మే యుండదు. కోతి యున్నది గాని కొమ్ములేదు. అట్లే జగత్తు సత్యమే కాని నామ రూపాలు సత్యముగావు. వాటికి పారమార్థిక సత్యత్వము లేదు. కోతికి కొమ్ము పుట్టనే లేదు. అట్లే బ్రహ్మముచే అయిన ఈ జగత్తు పుట్టనే లేదు. కోతికి కొమ్ము వ్యవహారికము. అట్లే జగత్తు, దానిరూపనామములు వ్యవహారికము ఆందుకే ఎరుక ఎరుక యందు సత్యమే. పరిపూర్ణ పరబ్రహ్మమందు ఎరుక (కారణబ్రహ్మము) ఎరుకచే సృష్టించబడ్డ సకల ప్రపంచ వ్యవహారములకు పారమార్థిక సత్యత్వములేదు. కనుక కోతికి కొమ్ముండుట సత్యమైతే జగత్తు వునికి సత్యమని జెప్పి జగత్తు పుట్టనే లేదనుటను దృఢ పరచుటకు రెట్టింపు జేసి చెప్పబడినది.

**12. కార్యమాయా ద్వయంనాస్తి । భయ భ్రమస్సదానహి
బ్రహ్మోస్మ్యహం భ్రమోనాస్తి । వంధ్యాసూనురివాపిచ ॥**

పరిపూర్ణ పరబాహ్యమందు కార్యము (జగత్తు) మాయా రెండు లేనిది. భయము మరియు భ్రమలు ఎప్పుడు లేనివి. గొడ్రాలి బిడ్డవలె నేను బ్రహ్మననే భ్రాంతి లేనిది.

**కార్యమాయా ద్వయం నాస్తి :** కార్యము, మాయను గురించి ముందుగా తెలుసుకొందము.

**కార్యము :** ఏ వస్తువు లేనిచే మరి యొక వస్తువు తోచబడదో అది కారణవస్తువు. అట్టి కారణ వస్తువు యొక్క నామ రూపములకంటే భిన్నమగు నామరూపములు గలదై విచారించగ కారణవస్తువు యొక్క మూలద్రవ్యమునకు మాత్రము భిన్నము కానిదై యున్న వస్తువును కార్యమని చెప్పబడును. ఉదాహరణకు మట్టి లేనిచో మట్టితో చేయబడే ఘట శరావాదులు ఉత్పత్తి కాజాలవు. కనుక మట్టి కారణవస్తువు. మండిగలు కుండలు కార్యరూపవస్తువులు, నామరూపములు వేరుగాని వానికి మట్టియే మూలద్రవ్యముగా నున్నది. కనుక అవి మృత్కార్యములు. కార్యకారణవస్తువులు వేర్వేరు రూపనామములతో గాన వచ్చు చున్నను తత్వతః ఆ రెండు మూలద్రవ్యమగు మట్టి కంటే భిన్నములు గావు. ఈ విధనుగానే కారణము బ్రహ్మ, కార్యము జగత్తు. ఈ సృష్టికి అత్యంత మూలకారణము బ్రహ్మమే. కావున బ్రహ్మమును కారణబ్రహ్మమందురు. మరియు ఆ బ్రహ్మనుండి కలిగిన జీవేశ్వర జగత్తంత కార్యముగా జెప్పబడుచున్నది.

"ఏకం అనేకం భవతి, అనేకం ఏకంభవతి" అనె రీతిగా ఏకానేకములుగా వుంటు కారణ కార్యరూపములుగా అధోర్ధ్వ పరిణాములు చెందుతు వుండు అఖండవస్తువే ఎరుక.

ఉత్పత్తి స్థితి లయములు దాని యందే జరుగుచున్నవి. దాని కదే కారణము గాని దాని కన్యకారణము లేదు. అదే స్థూల సూక్ష్మములుగా నుంటు జీవేశ్వర జగత్తు నంతటికి ఆధారము అధిష్ఠానము అయియున్నది. ఈ ఏకానేకములకు అత్యంత భిన్నమై అవాఙ్మానస గోచరమై ఎప్పుడు ఎట్టి మార్పులేక సర్వత్రా నిండి నిబిడీకృతమై యున్నది అచలపరిపూర్ణపరబ్రహ్మము మాత్రమే. ద్వంద్వములన్ని మాయ. కార్యము మాయా ద్వంద్వములు. మాయ లేనిది కావున కార్యము మాయ పరిపూర్ణమందు లేనివని గ్రహించవలయును.

**మాయా :** శుద్ధ బ్రహ్మమును ఆశ్రయించుకొని యుండెడి దానినే ఆవరించుకొని అనగా మరుగుపరుచుచు నుండు నొక యనిర్వచనీయమగు అనగా యితమిత్థమని నిర్ణయించుటకు వీలుకాని విచిత్ర వస్తువునకు మాయయని పేరు. ఉత్పత్తి లేనిది గనుక అనాది యని చెప్పబడినది. కాని బ్రహ్మజ్ఞానముచే బాధింపబడునది గనుక త్రికాలా బాధ్యమైన సద్వదార్థము కాదు. అవస్థాత్రయము నందును బాధ్యమై సద్వదార్థము కాదు. అవస్థాత్రయము నందును మాయా కార్యప్రకటమగుటచే అసద్వదార్థమని చెప్పుటకు వీలు పడదు. పరబ్రహ్మమును ఆశ్రయించుకొనియే యున్నందున బ్రహ్మమున కంటే భిన్నమని చెప్పరాదు. బీజముననున్న అంకురమువలె ఈమాయ సావయవమును నిరవయవమును కాదు. జీవుని యందు వ్యష్టి రూపముగాను ఈశ్వరుని యందు సమిష్టి రూపముగా నున్నందున దీనిని వ్యష్టియని కాని, సమిష్టియనిగాని చెప్పతగదు. కాని సర్వద్వంద్వములు తానే అయియున్నది. కనుక మాయ అనిర్వచనీయమని ఆది శంకరులు అభిప్రాయపడినారు. ఇన్ని రూపములుగా నున్న మాయ, ఏరూపములేని, పరిపూర్ణ పరబ్రహ్మమందు లేదని నిశ్చయము.

**భయభ్రమసదానహి :** అనగా పరిపూర్ణ పరబ్రహ్మము నందు భయము, భ్రమ ఎల్లప్పుడు లేదని అర్థము.

**భయము :** ఆకాశార్థములో వ్యష్టి నాల్గవ భాగము పృథ్వి భూతములో చేరుట వల్ల అంతఃకరణము నందు భయము కలుగునని సాంఖ్యము చెప్పుచున్నది.
భయోత్పత్తికి అత్యంత మూలకారణము ఉపనిషత్తులు చాల గొప్పగా సిద్ధాంతీకరించినవి. "ద్వితీయా ద్వైభయం భవతి" అనగా ద్వైత మందు (రెండవదంటు ఒకటి యుంటే) భయము పుట్టుక తప్పదన్నమాట. తాను తప్ప రెండవది లేక పోతే ఇక దేనిని గురించి భయముండును? కనుక ఏకమేవాఽద్వితీయం బ్రహ్మ" అను శ్రుతికి బ్రహ్మము వంటిది మరొకటి లేదని అన్యులు వాఖ్యానిస్తే "నేహనా నాస్తి కించన" "బ్రహ్మణోన్యం నకించిన" అను శ్రుత్యర్థములలో మేళవించి బ్రహ్మమొక్కటే తప్ప రెండవది లేనేలేదు అని అద్వైతులు సిద్ధాంతము చేసి యున్నారు. కాని "ఏకం అనేకం భవతి" (అనగా మొదట ఏకమై ఒకటిగా నున్న వస్తువే పిదప అనేకముగా మారినది. లేక" అనేకం ఏకం భవతి" అనేకములై వున్నవన్ని ఏకవస్తువు నుంచే కలిగినవి అని చెప్పబడుచున్నప్పుడు అద్వితీయ ఏక బ్రహ్మమే భయమునకు మూల కారణమని చెప్పక తప్పదు. కనుక ఏకానేకములుగా నుండే కారణబ్రహ్మము ఒకప్పుడు అభయస్వరూపము మరొకప్పుడు భయ స్వరూప మగుచు ద్వయదోష భూషిత మగుచున్నదని చెప్పుట శ్రుతి సమ్మతమైయున్నది. కనుక ఏకానేకములు, సదసత్తులు, అస్తినాస్తులు, భావాభావములు మొదలగు సాపేక్షిక శబ్దములచే వర్ణింపరాని కేవల నిరపేక్షక పరిపూర్ణ పరబ్రహ్మమే కేవలం అభయ స్వరూమని అచలబుషుల సిద్ధాంతము.

ప్రాణులన్నిటికి మరణ భయమే గొప్ప భయము. జ్ఞానియైన వాడు మరణ మంటే యేమిటో తెలుసుకొనవలెను. తిరిగి జన్మ కలిగించు బీజము నిలిచియే యుండగనే అట్టి త్యాగము బీజమును నాశనము జేసుకొని శరీర త్యాగము చేసినచో దానిని మరణమనరాదు. దానిని బ్రహ్మైంద్రైక్యమో, సిద్ధి యనో వ్యవహరించవలసి యుండును. ఆగామి, సంచిత, ప్రారబ్ద కర్మఫలములు లేనిచో తిరిగి జన్మయే యుండదు. తన్ను లేకుండ చేయునది పరిపూర్ణ బోధ. అందారూఢత సాధించిన వానికి ఏ సంశయముండదు. భయముండదు.

**శ్లో॥ జన్మాభావే కర్మం నాస్తి । కర్మాభావే ఫలం నహి ।**
**ఫలాభావే భయంకుత్ర । భయాభావేన నసంశయం ॥**

ఈ భ్రాంతి రహిత శ్లోకము యొక్క అర్థమేమనగా జన్మలేనిచో కర్మ లేదు. కర్మలేనిచో కర్మ ఫలమును యుండదు. కర్మ ఫలములేనిచో ఇక భయము ఎక్కడుండును. భయము లేదు. భయములేనప్పుడు సంశయమే లేదు. అప్పుడు పరిపూర్ణపరబ్రహ్మమే స్వతసిద్ధము.

**భ్రమ :** భ్రయ యనగా భ్రాంతి. భ్రాంతి యనగా యదార్థముగానున్న వస్తువును గ్రహించకుండ అన్యవస్తువుగా దానిని తెలుసుకొనుట భ్రాంతి యనబడును. భ్రమ, భ్రాంతి "భ్రం" అను ధాతువు నుండి వ్యుత్పత్తి చెందిన శబ్దములు. భ్రం యనగా తిరుగుట. గిరగిర తిరుగువాడు వున్న వస్తువును వున్నట్లుగా గ్రహించడు. అట్లే మనో వేగములో అనంత సంకల్పములు తిరుగుటలో పూర్వ దృష్టవస్తు సంస్కారబలముచే అన్యథా గ్రహణము కలుగు చుండును.

అద్వైతులు, ద్వైత బుద్ధియే భ్రాంతి యని నిర్ణయించిరి. **"ద్వితీయాద్వై భయం భవతి"** రెండంటూ వుంటే భయభ్రాంతులు తప్పవు అన్నారు. రెండు అంటే భేదము అన్న మాట. భేద మంటే రెండన్నమాట. అద్వైత సిద్ధి యందు భేద బుద్ధి కలుగదు. భేదమే అన్నిటికి మూల కారణము. "మొదలు వంకరైతే చివర వంకరే" అని దీక్షితుల వారన్నట్లు మాయా బ్రహ్మములను వేరుగా పరిగణించుటయే మొదటి వంకర. అట్లు గాక పూర్ణ భావజ్ఞులు ఎరుకే (అధిష్ఠాన చేతన బ్రహ్మమే) జీవేశ్వర జగత్తుగా పరిణమించినదని అన్నారు. భ్రాంతియే యెరుక, యెరుకయే భ్రాంతి. క.ప.**135. "భ్రమ యనిన పుట్టు కనినను । భ్రమకే నామంబు లిట్టి । భ్రమకే నీవుం । భ్రమ యీమేను జగత్తులు । భ్రమె యెరుకయు మరుపురెండు భ్రమె భ్రమ వినరా॥"** అన్నారు శ్రీ కృష్ణదేశికేంద్రులవారు. భ్రమయే ఎరుక యనుట సందేహము లేదు. గాని తొలుగవలసినది ఎరుకగాదు, ఎరుక సత్యమనే భ్రాంతియే, భ్రాంతి రహితమే నిజమైన మోక్షము. అదియే జన్మ రాహిత్యము. శరీరము లేని పరిపూర్ణమే ఎప్పుడు యున్నది. శరీరమెప్పుడును లేదు. ఈ సిద్ధాంతము దృఢమైన తక్షణమే సద్యోముక్తి లభించును. కనుక భయము భ్రమ రెండును పరిపూర్ణ పరబ్రహ్మమందెప్పుడును లేవు.

**బ్రహ్మోస్మ్యహం భ్రమో నాస్తి :** పరిపూర్ణ పరబ్రహ్మము నందు నేను బ్రహ్మనసే భ్రాంతి లేదనుట నిశ్చయము. వేదాంతమగా పరబ్రహ్మమును తెలియజేయునదై పరబ్రహ్మవలన కలిగినదై ప్రకాశించు నాలుగు వేదములలో ఋగ్వేదాంతర్గతమగు ఐతరేయోపనిషత్తు నందలి "ప్రజ్ఞానంబ్రహ్మ" యను సాక్షాత్కారవాక్యము నిరూపించి అనుభవము కలుగనందున, యజుర్వేదాంతర్గతమై బృహదారణ్యకోపనిషత్తు నందలి "అహంబ్రహ్మాస్మి" యను మహావాక్యము చేత అనుభవమును చూపినారు. అహం, బ్రహ్మ, అస్మి యనుమూడు పదములలో "అహం"

అను పదము ముఖ్య వృత్తిచే జడమైన అహంకారమును, గౌణ వృత్తిచేతను బుద్ధి సాక్షిగా యుండి నేను నేను, అని స్ఫురించు ప్రత్యగాత్మను సూచించుచున్నది. వాచ్యార్థమైన జడమగు అహంకారమును త్రోసివేసి లక్షణా వృత్తిచే కూటస్థా చైతన్యమునే గ్రహించవలసి యున్నది. స్వతః పూర్ణమైన పరమాత్మయే బ్రహ్మమను పదమునకు లక్ష్యార్థము. బుద్ధి వృత్తుల కెల్లను సాక్షియై యుండు కూటస్థాత్మయగు నేనే బ్రహ్మను, 'అసి' అనగా అయితిని యను మహావాక్యలక్ష్యార్థము. ఈ నాలుగు మహావాక్యములు లక్ష్యార్థముచే ప్రత్యగ్బ్ హ్మైక్యమునే ప్రతిపాదించుచున్నవి.

మహావాక్య విచారణ వల్ల జ్ఞేయబ్రహ్మము యొక్క స్వరూప మపరోక్షమై తానే ఆ బ్రహ్మస్వరూపుడనను అఖండ జ్ఞానము (శ్రవణ, మనన, నిధి, ధ్యాసల రీత్యా) జిజ్ఞాసికి లభించుచున్నది. కాని జ్ఞాతృ జ్ఞాన జ్ఞేయరూప త్రిపుటి కతీతమై **"యతోవాచోనివర్తంతే అప్రాప్యమనసాసహ"** యని యుపనిషత్తులు కూడ మౌనము వహించినవి. పరమసత్య స్వయం సారమగు పరిపూర్ణ పరబ్రహ్మము మాత్రము ఆ విచారణకు దూరమై యున్నది. "అహం బ్రహ్మాస్మి వాక్యము నందు "అహం" నేను అను స్ఫురణ మిగిలి యున్నది. పరిపూర్ణపరబాహ్యమందు అహం స్ఫురణలేదు. ఆమాటకొస్తే పరిపూర్ణపరబ్రహ్మము నందు ఏమి లేనిది.**"నేను లేనప్పుడే అది"** కనుక అహం బ్రహ్మాస్మి యనెడి భ్రాంతియే లేదు.

**వంధ్యాసూనురివాపిచ :** బిడ్డలను కనలేనిదానిని గొడ్రాలందురు. మరొకనిని దత్తత తీసుకొంటే అపుడా కుఱ్ఱవానిని వంధ్యాసూనుడని అందురు. అట్లే సృష్టికారణ వస్తువు తన యందేమి లేక గొడ్రాలి వంటి దగు బయలందు తోచిన యెరుక వంధ్యా సూనుని వంటిదే.

గొడ్రాలికి ఎన్నడు బిడ్డ పుట్టనేలేదు. ఆమె దత్తత తీసుకొన్నవాడు కూడ ఆమెకు పుట్టలేదు. అయినను ఆమె కొడుకని చెప్పినట్లే లేని యెరుక పరిపూర్ణమందు పుట్టనే లేదు. అయినను అందువున్నట్లు తోచుచున్నది. వంధ్యాసూనుడను శబ్దమునకు వంధ్య యొక్క దత్త పుత్రుడు ఆధారము, అధిష్ఠానము అయియున్నాడు. కాని వంధ్యకాదు. అటులనే పరిపూర్ణములేని ఎరుకకు ఆధారము గాదు. వంధ్యకు దత్తపుత్రుడు ఎట్లు పుట్టలేదో అట్లనే పరిపూర్ణమందు ఎరుక పుట్టనే లేదు. కనుక బ్రహ్మాస్మ్యహం అనగా నేను బ్రహ్మనైతిని అనుట తొలి భ్రాంతి. తొలగవలసినది బ్రహ్మము కాదు. నేను బ్రహ్మనైతిని అనే భ్రాంతి పోవలెను. "నేను" అనెటి అహం స్ఫురణ ఎరుక యందలి భ్రాంతి యని తెలియవలయును.

**13. మరీచిక జలాపూర్ణ కుంభవద్భాతి యజ్జగత్**
**క్షీరపానేన సర్పస్య । విషం నశ్యేజ్జ గద్భవేత్**

ఎండమావులందు కుండలో నీళ్ళు నిండుగానున్నవనుట ఎంత సత్యమో జగత్తు యొక్క యునికి అంతే సత్యము. పాము,ప్రాలుత్రాగుటవల్ల దాని విషము నశించినదనుట సత్యమైతే జగత్తు పుట్టినదనుట సత్యమగును.

**వివరములు :-మరీచిక జలాపూర్ణకుంభవద్భాతి యజ్జగత్:** ఎండమావులు (మృగజలములు) సూర్యుని కిరణముల వలన కలుగు చున్నవని, సూర్యుడస్తమించిన పిదప పోవునని అందరు యెరుగుదురు. అయితే ఉదయముగాని, సాయంత్రముగాని అవి తోచవు. మధ్యాహ్నము సూర్యకిరణముల ఉష్ణోగ్రత ఎక్కువగా నుండు నపుడు భూమి కాలి అందలి చెమ్మ ఆవిరి రూపముగా పైకి లేచునపుడు మాత్రమే జలముగా తోచుచున్నది. అట్లే పరిపూర్ణమందు లేని

ఎరుక తానే తన యందు తోచుచున్నది. క.ద.156 "నేననని బ్రహ్మలోపల । లేనిదే సంభవము నొంది। లీల తనకుదా। మెను జగములై వెలిసెను నేనది మృగజలమురీతి। నిజముగాదనుచూ। లోకుల నేటి। గజిబిజి వినుచూ। మానాసమున వారి మాట కామోదించి। దానికీ బోధకు తగునందు వినజేస్తి నిజము గాదనుచూ।।" శ్రీకృష్ణదేశికులన్నారు. ఎండమావులందు నీరెట్లు లేదో అట్లే బ్రహ్మము నందు జగత్తు లేదని మాత్రమే పూర్ణజ్ఞుల భావన. పరిపూర్ణ భావములో ఎండమావుల జలము సూర్యకిరణములందు లేనప్పటికి సూర్యకిరణము లందున్నట్లు ఎట్లు తోచుచున్నదో, అటులనే పరిపూర్ణ మందు యెరుక లేనప్పటికి పరిపూర్ణము నందే తోచబడుచున్నదని, ఆవిరి యందున్నజలమే ఎండమావులవలె తోచు జలమునకు కారణమై ఎటులున్నదో అటువలనే యెరుకకు యెరుకే కారణమై యున్నదని తెలియవలెను. కనుక ఈ దృష్టాంతము పరిపూర్ణబోధకు తగియున్నదని శ్రీ కృష్ణదేశికేంద్రులవారు శెలవిచ్చియున్నారు.

**క్షీరపానేన సర్పస్య। విషం నశ్యేజ్జగద్భవేత్ :** పాము పాలు త్రాగుటవల్ల విషము నశించుట ఎట్లు అసంభవమో అట్లే జగత్తు కలిగినదనుట అసంభవము. వేప విత్తనములోని బద్దలను కొంతవేడి పాలలో ముంచి యుంచిన గాని తేనెలో ముంచి యుంచిన గాని దాని చేదుతనము పైభాగమునందు పోయినట్లునిపించును. వాటిని నీటితో కడిగి రుచి చూచిన చేదుతనము మిగిలియే యుండును. చింత చచ్చిన పులుపు చావదన్నట్లు పాముకు విషము సహజము. సహజమైనది పుట్టుకతో వచ్చును. మరణముతో నశించును. మధ్యపాలుపోసి పెంచిన పాముల విషము హరించదు. విషము మిగిలియే యుండును. కనుక పాలు త్రాగుట వల్ల విషము పోవుట అసత్యము. సత్యమెన్నటికి కాదు. ఇచట జగత్తును పాము విషముతో పోల్చినారు. జగత్తు పరిపూర్ణమందు కలుగనే లేదనుటకు ఈ దృష్టాంతమును జెప్పినారు. జగత్తునకు పారమార్థిక సత్యత్వము లేదు. వ్యవహారిక సత్యమున్నదని అచల ఋషుల అభిప్రాయము.

**14. తమః ప్రకాశమానేన । భాసతేత్యస్థితే జగత్**
**హిమం సూర్యకరే చాస్తి । జగత్సత్యం భవిష్యతి.**

చీకటి వలననే వెలుతురు యనుట ఎంత సత్యమో జగత్తు యొక్క ఉనికి అంతే సత్యము. అనగా చీకటి వలన వెలుతురు కలుగదు. కావున జగత్తుకు వునికి లేదని తెలుసుకొనవలయును. సూర్యకిరణములందు మంచుండుట సత్యమైతే జగత్తు సత్యమగును.
**వివరములు :- తమఃప్రకాశమానేన । భాసతేత్యస్థితే జగత్ : తమ :** అనగా చీకటి. ప్రకాశమనగా వెలుతురు. చీకటి వల్లనే వెలుతురు ప్రకాశించుచున్నదనుట సత్యముగాదు. వెలుతురు రాగానే చీకటి పారిపోవును. వెలుతురు పోతేనే చీకటి ఆవరించును గాని చీకటి వచ్చి వెలుతురును తరిమి వేయజాలదు. ఇచట చీకటి వెలుతురునకు ఆధారము అధిష్ఠానము గాదు. అట్లే పరిపూర్ణ పరబ్రహ్మము ఈ జీవేశ్వర జగత్తునకు (ఎరుకకు) ఆధారము అధిష్ఠానము గాదు. మరి జగత్తు యింత స్పష్టముగా వుండి ప్రకాశిస్తుంటే లేదనుట సబబు గాదందురు నిజమే. పరిపూర్ణ మందు ఎరుక సత్యము గాదు. కాని ఎరుక యందు ఎరుక సత్యమే. వ్యవహారికముగా ఈ జీవేశ్వర జగత్తు పరిపూర్ణమందు తోచుచున్నది గాని పారమార్థికముగ దానికి సత్యత్వము లేదు. ఎందుకనగా పరిపూర్ణ మంతట నిండి నిబిడీకృతమైయున్నది.

సూది మొన మోపుటకైనా సందు లేని దానిలో అన్యవస్తువు ఉండుటకు వీలులేదు. అందుకే అచల ఋషులు ఈ జగత్తు పరిపూర్ణమందు తోచుచున్నదిగాని, నిజముగా లేదన్నారు.

**హిమం సూర్యకరేచాస్తి జగత్సత్యం భవిష్యతి :** హిమము అనగా మంచు. సూర్యకరేచ యనగా సూర్యకిరణములందు, అస్తి అనగా వుండుట. అంటే సూర్యకిరణములందు మంచువుండుట సత్యమైతే జగత్తుండుట సత్యమగును.

సున్నాడిగ్రీ ఉష్ణోగ్రతకు పడిపోయినప్పుడు నీరు ఘనీభవించి మంచు గడ్డగా మారును. ఉష్ణమధికమైన కొలది కరిగి ద్రవరూపముగా మారును. వేడిమిచే మంచు ద్రవరూపముగా మారుగుణ మున్నప్పుడు ఉష్ణముతో కూడియున్న సూర్యకిరణములలో మంచుండుట అసంభవము. అట్లే జగత్తు కూడ పరిపూర్ణ మందు లేదనుటకు ఈ దృష్టాంతమీయబడినది. జగత్తు కేవలము తోచుచున్నది.గాని, దానికి పరిపూర్ణ మందు (ఎరుకకు) ఏవిధంగాను యుత్పత్తికారణము లేదు. పరిపూర్ణమందు ఎరుక లేదు గనుక జగత్తు యొక్క వునికి మిథ్య. సూర్యుని యందు చీకటి లేదు. గుర్తెరిగే తెలివికూడ లేదు. అట్లే బయలందు యెరుక లేదు. బయలుకు గుర్తెరిగే లక్షణము లేదు. ఒకటి గానవస్తే రెండోది వుండదు. క.ద. 68. **"తలయెత్తి జూడ జాలునె అల చీకటి యెదుట నిల్చి। యబ్జాప్తుకళన్। కలవచ్చి మేల్కు యందున గల చేష్టలు। మ్రోలనిల్చి కనుగొనగలదా। అట్లనె యెరుక కనుగొనగలదా। యిలలో సద్గురు బోధ నెరిగీన నరుని। చేష్టలు గంటె నుళ్ళక్కి। సద్గురు బోధౌట। కనుగొనగలదా."** అనగా సూర్యప్రకాశము ఎదుట చీకటి నిలిచి తలయెత్తి చూడజాలని విధమున, కలవచ్చి మెలకువముందు నిలిచి దాని యందలి చేష్టలు నెరుగజాలదు. ఈ ప్రకారముగనే పూర్ణగురు బోధ బడసి అచలపరిపూర్ణ స్థితిగా యున్నపురుషుడు చేయు కర్తృత్వరహిత కర్మాచరణ విధానంబుల వలన ఎరుక నిలిచి కనుగొన జాలదని భావము.

**15. మహిషీగోరూపవద్భాతి । జగత్సంత్యం భవిష్యతి**
**అగ్ని స్పర్శాజ్జలంపిండం । భవేత్సత్యం భవిష్యతి**

మహిషీ (బఱ్ఱె) ఆవురూపములో నున్నదనుట సత్యమైతే జగత్తు సత్యమగును. అగ్ని స్పర్శ వలన జలము ఘనరూపము దాల్చిన దనుట సత్యమైతే జగత్తు సత్యమగను.

జగత్తునకు లౌకిక సత్యత్వమున్నదిగాని పారమార్థిక సత్యత్వము లేదు. ఎట్లనగా ఎరుక యెరుక యందు సత్యమే. కాని అట్టి ఎరుకకు పరిపూర్ణ పరబ్రహ్మము నందు స్థానము గాని నిలిచే యందుకు చోటుగాని లేదు. ఈ విషయమును తేటతెల్లముగా చెప్పుట కొరకు ఈ దృష్టాంతము లీయబడినవి. ఎరుకకు పరిపూర్ణము ఆధారము అధిష్ఠానము గాదు. ఎరుకకు ఎరుకేయే ఆధారము అధిష్ఠానమై యున్నది. అదెట్లనగా బఱ్ఱె ఆవురూపముగానువుంటే, అగ్ని స్పర్శ వల్ల నీరు గడ్డ కట్టుకొనిన జగత్తుండునని దృష్టాంతము లీయబడినవి. బఱ్ఱె ఆవు కాజాలదు. అగ్నిస్పర్శ వల్ల నీరు గడ్డ కట్టదు, ఆవిరి రూపము చెందును.

కొన్ని వస్తువులు సాదృశ్యాది సారూప్యాది సమాన లక్షణములు వుండవచ్చును. మహిషిని జూచి ఆవుయని భ్రాంతి జెందుట ఈ శ్లోకములో దృష్టాంతముగా జెప్పబడినది. అద్వైత పద్ధతినందు వివర్తవాదమున మహిషి మరియు గోవునకు సాదృశ్యలక్షణములు లేనిచో భ్రాంతికే తావులేదు. కనుక యెరుక యొక్క ఒకానొక నామరూపములు క్రియలు చూచి యెరుక యందలి మరొక వస్తువుగా భ్రాంతి చెందుటకు అవకాశము కలదు. ఏలననగా

మూలమందు ఆ రెండూ ఒకే పదార్ధమునకు సంబంధించినవి కనుక సాదృశ్య సాధర్మములుండును. అన్యోన్య ధ్యాసకు తగిన సామగ్రి యుండును. కనుక భ్రాంతి చెందింపజేయునది అధిష్ఠాన వస్తువు. భ్రాంతి జన్యవస్తువు రెండు కూడ సమాన ప్రతి పత్తి కలిగినవేగాని అందొకటి నిత్యమగు బ్రహ్మము, మరొకటి అనిత్యమగు జగత్తుగాదు. కావున యిది భ్రాంతి.

అగ్నిస్పర్శ వల్ల హిమము పిండముగా మారదు. అది కరిగి నీరగును. అట్లు జలము పిండమైతే జగత్తు యొక్కవునికి నిజమన్నారు. అది నిజము గాదు కావున జగత్తు పరిపూర్ణమందు సత్యము గాదు.

**16. పవనోస్త్రేణ భిద్యేతే । జగత్సత్యం భవిష్యతి**
**పర్వతేపి భవేత్పత్రం । జగత్సత్యం భవిష్యతి.**

వాయు వస్త్రముచే ప్రపంచము భేదింపబడిన నిజముగా జగముండును. పర్వతము చిగిరించినచో ఈ జగత్తు నిజమగును.

**పవనాస్త్రేణ భిద్యేతే, జగత్సత్యం భవిశ్యతి :** వాయువస్త్రముచే ప్రపంచము భేదింపబడిన యెడల జగత్తు సత్యమగును. వాయువు అస్త్రము వుపయోగించినట్లు పురాణాలలో మనము చదివి యున్నాము. యుద్ధములలో అస్త్ర శస్త్రముల ప్రయోగములు ప్రావీణ్యత పొందిన గురువుల చేతనో లేదా, వరముతోనో మంత్ర శక్తి వలననో వాటిని ప్రయోగించెడి వారట. కాని అవి శత్రు సేనల నాశనమునకే పరిమితమయ్యేవిగాని ప్రపంచము నంత ఏకముగా ఒకే సమయములో భేదించే అస్త్ర శస్త్రములు వున్నవని యిప్పటికి వినలేదు. చూడలేదు. వాటి ప్రభావము పరిమితమే. కనుక వాయువస్త్రము ప్రపంచమును భేదించుటకు వీలులేదు. అది అసంభవము, అసత్యము.

అట్లే ఈ జగత్తుకూడ పరిపూర్ణ మందు అసత్యము. రెండు పరమసత్యమైన వస్తువులుండుటకు వీలు లేదు. శ్రీ కృష్ణదేశికేంద్రులవారు పరిపూర్ణమనే దొకటి, లేనెరుకనేదొకటి, అని రెండు అన్నారంటే లేనెరుక కూడ కలదని చెప్పి నట్లేగాని, లేనెరుక అసలే లేదని గాదు. శాస్త్రరీత్యా రెండు సత్యము లుండుటకు వీలులేదు. రెండున్నాయంటే "ఏకమేవాఽద్వితీయం బ్రహ్మ" అనే శ్రుతికి భంగము కలుగును. కనుక యెరుకను లేనెరుక అన్నారు. పరిపూర్ణమందు యెరుక లేనేలేదు గాని ఎరుక యందు ఎరుక సత్యమే. అది వ్యవహారిక సత్యము. ఈ రెండు సమసత్తాకములు గావు. అందుకే ఈ శ్లోకమున ఎరుక రూపముననున్న జగత్తు వాయు వస్త్రముచే భేదించబడిదనుట అనుట కూడ సత్యము గాదు, కావున జగత్తు సత్యముగాదు.

**పర్వతేపిభవేత్పత్రం । జగత్సత్యం భవిష్యతి :** అనగా పర్వతము చిగిర్చినచో నీ జగత్తు నిజమగును. పర్వతము జడము అది చిగిరించుటకు వీలు లేదు. కాని పర్వతముపై గల గడ్డి, పొదలు మొక్కలు చెట్లు తగినంత తేమ లభించినపుడు అవి చిగిర్చి పర్వతమంతా పచ్చగా కనబడును. కాని పర్వతము చిగిర్చదు. భ్రాంతి వల్ల పర్వతము చిగుర్చునట్లుతోచును. అట్లే పరిపూర్ణ మందు ఈజగత్తు లేనే లేదు. నీవులేవు. నీవు వున్నావని అనుకొంటే నీకు జగత్తున్నది. నీవులేవనుకొన్నచో నీకు జగత్తులేదు. **"నీవుండిన జగముండును । నీవేగిన జగము లేగు యవినీతోడన్ । భ్రావింపనిలుదలచిన । యీవిశ్వముబండి సున్న గదరా**

**వేమా ॥** అని వేమనార్యులు అంటే యిదే భావమును శ్రీ కృష్ణదేశిక ప్రభువులు క.ప 228. **"నే నిల్వజగములేకను । నేనేగిన జగము లేదు నిజమీ జగమున్। నేనును లేనప్పుడు గల। దానిని పరిపూర్ణ మనచు దలపోయదగున్॥** లేని నీవు లేనే లేనని భావించుటయే చాలునని ఉద్బోధించబడినది..

**17. ఖరశృంగేణ మహిషో । మృతేశ్చే జ్జగతస్థితిః**
**ద్రష్టు ప్రపంచ మిత్యుక్తమ్ । మూఢ ఏవనసంశయ**

గాడిద కొమ్ముచే ఎనుబోతు చచ్చినచో ఈ జగము సత్యమగును. ప్రపంచము కనుపించుచున్నది కావున నిది కలదనుట మూఢత్వము.

**వివరములు :- ఖర శృంగేణ మహిషో । మృతేశ్చే జగతస్థితిః :** అనగా గాడిద కొమ్ముచే ఎనుబోతు చచ్చినచో ఈ జగముండునని అర్థము. గాడిదకు కొమ్ము లసలే యుండువు. ఇదొక అసత్యము. లేని కొమ్ముచే ఎనుబోతు చచ్చినదనుట మరొక అసత్యము. గణిత శాస్త్రరీత్యారెండు మైనస్‌లుకూడితే ఒక ప్లెస్ అగును. (–) + (–) = (+) అదే విధముగా ఒకటి కంటే ఎక్కువగా గల అసత్యములను తొలగిస్తే పారమార్థికముగు సత్యమే మిగులును. అదే విధముగా సత్యమొక్కటే. అదే పరిపూర్ణము. పరిపూర్ణము తప్ప తక్కినవన్నియు లేనివే లేనివి లేనివే నని తీసివేస్తే ఉండేది ఉండే యుండును. జగత్తులేనిది. ఉన్నది పరిపూర్ణము ఈ లేని జీవేశ్వర జగత్తు అనేకముగా తోచుచున్నది. తోచుచున్న దంతమైనస్. మైనస్ తోమైన కూడితే(లేనివాటిని లేదని తొలగిస్తే) అంతా పరిపూర్ణమే.

మరొక విధముగా ఆలోచిస్తే గాడిద అరుస్తు పరుగెత్తునపుడు అది కూడ కుందేలు వలె చెవులు నిక్కించును. నిక్కించిన చెవులు కొమ్ములుగా భాసించుటకు అవకాశమున్నది. ఇట్లు భాసించుట వివర్తనము అందురు. ఆవిభ్రాంతి వల్లనే కొమ్ములవలె తోచుచున్నవి గాని, నిజముగా లేవు. ఆ లేని కొమ్ముచే ఎనుబోతుచావదు. అంతా భ్రమ. భ్రాంతి వల్ల ప్రపంచము తోచినదనుటకు కారణము అదిలేనిదే.

**ద్రష్టు ప్రపంచ మిత్యుక్తమ్ । మూఢఏవనసంశయ :**

అనగా ప్రపంచము కనుపించుచున్నది కావున ప్రపంచమున్నదనుట మూర్ఖత్వము. అనుమానము వలదు. జ్ఞానేంద్రియములగు శ్రోత్ర, త్వక్కు, చక్షు, జిహ్వా ఘ్రాణములును, ప్రాణేంద్రియములలో వ్యానము, అంతరేంద్రియములలో జ్ఞాన మనో బుద్ధులు వస్తువును తెలుసుకొనుటకు సాధనములు. గోచరమగు శబ్దమెట్టిదో దృశ్యమనెడి శబ్దము అట్టిదే. కంటికి కానవచ్చేది మాత్రమే దృశ్యము గాదు. ఏ యింద్రియములకు గాని లేక మనస్సు తెలియబడినను అది దృశ్యమే అనవలెను. "మనషష్ఠేంద్రియాణి" అంటూ మనసు కూడ ఒక యింద్రియమే నని జెప్పిరి.

" యద్దృశ్యం తనశ్యం" అనేక విధములుగా కాన వచ్చే సమస్తము కూడ దృశ్య కోటిలోనికే చేరినవి. గోచిరించే సమస్తము కూడ ఆవిధంగా దృశ్య కోటిలోనికి చేరును. ఏది దృశ్యమగు చున్నదో అది నశించునదే లేక అశాశ్వతమైనదే. కనుక పంచతన్మాత్ర విషయములగు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధము లన్నియు అశాశ్వతములే. అట్లే జ్ఞానమునకు తెలియబడేదంతా దృశ్యకోటిలోనికే చేరును. కనుక జ్ఞానమునకు విషయమగు విషయము కూడ అశాశ్వతములే.

ఈ విధముగా విచారించినచో సృష్టి అంతయు మరియు సృష్టి కర్త కూడ అ శాశ్వతమే

అని అనవలసివచ్చును. ఎవరికి ఎప్పుడు ఏది తెలియబడునో అదంతయు భాగవత కృష్ణదేశికేంద్రులవారి పరిభాషతో **"ఎరుకకు ఎంత ఎరుకో అది అంతయు ఎరుకే అయివున్నది."** అసత్యము అశాశ్వతము అయియున్నది. కనుక ప్రపంచము కనుపించుచున్నది కావున ప్రపంచమున్నదనుట మూర్ఖత్వము. ఇందులో అనుమానము లేదు. గురుదు ప్రపంచము లేదని దృష్ట ద్రాష్టాంతముల ద్వార వస్తు నిశ్చయము చేసిన తర్వాత నమ్మవలెను. నమ్మితే సొమ్ము, లేకుంటే దుమ్ము.

**18. శుక్తౌ రజితవద్భాతి । యథా రజ్జౌహిసర్పవత్**
**తథాభాసతిసర్వత్ర । సర్వం శశవిషాణవత్**

ముత్యపు చిప్పయందలి తెల్లదనము చూచి వెండియని భ్రాంతి చెందిన విధమున త్రాటి యందు పాముపలెను. కుందేలు రెండు చెవులను దగ్గరికి చేర్చి పరిగిడుటవల్ల కొమ్ముగా కనబడునట్లే సర్వ ప్రపంచము అంతట ప్రకాశించుచున్నది.

**వివరములు :- శుక్తౌ రజిత వద్భాతి :** ముత్యపు చిప్పయందు తెల్లని పదార్థము యొక్క ప్రకాశము వెండిని పోలి యుంటుంది. ఇచట సారూప్య సాదృశ్యదోషమువల్ల భ్రాంతి కలుగుచున్నది. ముత్యపు చిప్పలోని తెల్లదనము వెండిగా తోచుచున్నది గాని, అది సర్వజగత్తు అటు వంటిది, లేనిది, అసత్యమైనది. వెండి పరిపూర్ణము వంటిది. సత్యమైనది నిత్యమైనది. సత్యమైన పరిపూర్ణమందు ఎరుక రూపముగానున్న ఈ జగత్తు ముత్యపు చిప్పలోని తెల్లదనము వంటి వెండిగా తోచినది. కావున అది అసత్యము.

**యధారజ్జౌ సర్పవత్ :** అదే విధముగా తాడును చూచి పాముగా భ్రాంతి జెందుట, జరుగుచున్నది. ఈ దృష్టాంతములో కూడా సారూప్య సాదృశ్యాది దోషములు, అధ్యాస సామగ్రి యుండుటచే ఒక వస్తువు మరొకటిగా భాసించుట జరుగుచున్నది. తాడు యందు ఒక భవనము ప్రతీత కలుగనట్లు త్రాడు నందు మేడ యొక్క సారూప్య సాదృశ్య లక్షణములు లేవు. ఏ యింద్రియమునకు గోచరముగాని, సర్వలక్షణ విలక్షణమైన, సర్వదోష విదూరమైన పరిపూర్ణ పరబ్రహ్మమందు అన్య వస్తు ప్రతీతి కీషణ్మాత్రము ఆధారము లేదు. పరిపూర్ణ మేవిధముగా వివర్త రూపము చెందజాలదు. కనుక ఎరుకకు అధిష్ఠానము కాదు. రెండు అత్యంత విభిన్నములు.

ఐతే రజ్జు సర్పమైన విధము, లేనెరుక బయలులో తానెట్లు జనించినదని విచారిస్తే అసలు రజ్జు సర్పమైనదా లేక తాడు సర్పము రీతిగా కనబడినదా. అంటే తాడు సర్పము కాలేదు. అట్లే పరిపూర్ణమందు విశ్వము జనించనేలేదు అని చెప్పక తప్పదు. మరితాడు సర్పముగా ఎట్లు భ్రాంతికి కారణమైనదంటే పూర్వము చూచియున్న సర్పము యొక్క జ్ఞానము కలిగి యున్నవానికే సర్పభ్రాంతి కలుగును కాని సర్పమునే చూచి యుండనివానికి సర్పభ్రాంతి కలుగనే కలుగదు. ఈ స్మృతి జ్ఞానమే సర్ప భ్రాంతి జ్ఞానమునకు కారణము. అట్లే లేనెరుక బయలు లోపల లేనెరుకచేతనే జనించినదని తెలియుచున్నది. ఈ విధముగా తాడు దృష్టాంతమును సమన్వయించుకోవలసి యున్నది. ఎట్లయితే తాడు సర్పముగా ఎట్లు గోచరించుచున్నదో అట్లే జగత్తు కూడ పరిపూర్ణమందు సర్వత్రా అదే సర్పముగా భాసించుచున్నది. మరెట్లు భ్రాంతి చెందించుచున్నదనగా:

**సర్వం శశవిషాణవత్ :** శశవిషాణము అనగా కుందేటికొమ్ము అని అర్థము.

కుందేలుకు కొమ్ము వుండదు. కుందేలు ప్రాణ భీతిచే పరిగిడు నప్పుడు కుందేలు తన రెండు చెవులను పైకి నిక్కించి దగ్గరగా చేర్చును. అట్లు నిక్కించి దగ్గరగా చేర్చుట వల్ల అది కొమ్ముగా భాసించి భ్రాంతికి మూలమగుచున్నది. అటులనే యెరుక లేనేలేనప్పటికి తన యందలి నేను మేనులు ఒకటిగా చేరుటయే గుర్తెరిగే ఎరుకోత్పత్తికి కారణము.

ఈ శ్లోకము నందు ముత్యపు చిప్పలోని తెల్లదనమును చూచి వెండి యని భ్రమ కలిగి నట్లు, అదే విధముగా తాడును చూచి పాముగా భ్రాంతి చెందుట వంటిదని, మరియు ప్రాణ భీతచే పరిగిడునపుడు కుందేలు చెవులను దగ్గర చేర్చుట వల్ల కొమ్ముగా భాసించుట ఎరుక రూపమే. పరిపూర్ణ పరబ్రహ్మము నందు ఈ ఎరుక ప్రపంచమంతయు లేకనే భాసించుచున్నదని తెలియవలయును.

**19. దృశ్యందృక్చతథాద్రష్టా । త్యక్త్వాదద్భాసనాసహ**
**తేదేవనాస్తి చాప్యాత్మా । దేహప్రాణాది సంజ్ఞకమ్**

దృశ్యమనగా జీవున కెరుకై నట్టి సకల ప్రపంచము, దృక్కనగా జీవ సంబంధమైన జ్ఞానము, ద్రష్టయనగా సమస్తమును గాంచుచుండు జీవుడు యనెడి త్రిపుటి వాటిచే ప్రకాశించబడేవి కూడ లేనివే. అదే ప్రకారముగా దేహము ప్రాణములకు గుర్తుగా నున్న ఆత్మయును లేదు.

**వివరములు :-** శ్రుతి: **"ద్రష్టా దృశ్యవశాద్బద్ధో దృశ్యాభావె విముచ్యతే"** - మహా నారాయణోపనిషత్తు. ప్రత్యక్షముగా నశించుస్వభావము గల ఈ స్థూలదేహము జడము. దేహము చూచునవి కన్నులు. గోళములుగా నున్న కన్నులు మరణ దేహమునకు గలవు. కాని దృశ్యములను చూడజాలవు. కాని గోళముల ద్వార చూచునది మరి యొకటి కలదు. అదే చక్షురింద్రియము. యిది లేనిచో కన్నులుండిన ఉపయోగములేదు. అట్లే మిగతా యింద్రియములు. ఇవన్ని ఆత్మకాదు. సర్వేంద్రియముల ద్వార బహిర్గతమై శబ్దాది విషయములను గుర్తుంచునది అంతఃకరణప్రకాశము. సుషుప్తి యందు ఈ అంతఃకరణ ప్రకాశము అవిద్య యందు మరుపు రూపము చెందుచున్నది. కాని నిద్రించిన తాను ఉచ్ఛ్వాస నిశ్వాస రూపముగా ప్రాణము మాత్రము ఒక యంత్రముగా పనిచేయుచున్నది. ఈ యంత్రమునకు సత్తా యిచ్చుచు పని చేయునదియే ఆత్మ లేక ద్రష్టా. అనగా చూచువాడు. ఇతరేంద్రియముల ద్వార పని చేయు నప్పుడు అతడే శ్రోత, మంత, యిత్యాది ఇతర నామములను చెందుచున్నాడు. ఏ యింద్రియముల ద్వార ఏ విషయములను తెలుసుకొన్నప్పటికి మొత్తము మీద అన్నిటిని తెలుసుకొనువాడు అతడే. కనుక ఇతని ఒక మాటలో జ్ఞాత అని పిలువదగును. లేక వ్యక్తి భావన విడిచినచో యతనిని దృక్ అని పిలువ నగును. అపుడు దృక్చే తెలియబడు దానికి దృశ్యమని పేరు.

'నేను' 'నాది' అని అభిమానించు అహంకారము యివన్నియు దృశ్యములే. ఇదియును గాక నా కన్యమై బ్రహ్మాండము నందుండి దానిని ధరించు భరించు సమిష్టి ప్రాణము, సూర్య చంద్ర నవగ్రహ నక్షత్రాదులు పంచభూతములు ఇవన్నియు నాచే గుర్తించబడి దర్శింపబడుచు వున్నందున "దృష్టుర్ యోగ్యం దృశ్యం" అనే న్యాయమున దృశ్య కోటిలో చేరి పోవుచున్నవి. ఇవన్ని మాయయేనా? అంటే సృష్టికానే కాలేదు. సృష్టిలేనే లేదు. ఉన్నట్లు తోచుట మాత్రమే అని అందురు. దీనికే వివర్తమని పేరు. వివర్తమనగా యదార్థమై నిలిచియున్న

ఒక వస్తువు నందు యెట్టి మార్పు కలుగకున్నప్పటికి తానుగా అట్టి మరొక వస్తువుగా భాసించుట వివర్తమన బడును. ఉ॥ త్రాటియందు పాము, ముత్యపుచిప్పయందు వెండి యెన్నడులేక పోయినను తోచబడినట్లే బ్రహ్మము నందు ఏకాల మందు లేని ఈ ప్రపంచ మంతయు తోచబడినదని జెప్పుదురు. జగత్తు నందు తోచబడిన సకల పదార్థములు ఏక దేశీయములు, మిత పరిమాణములు క్షణికములు, నామ రూపాత్మకమై యున్నందున ఇవి పారమార్థికముగా లేనివే. కనుక మిథ్య.

"మీయతే అనేన యితి మాయ" అని నిర్వచించి నపుడు మితిలోనికి తేబడిన బ్రహ్మము వస్తువుగా భాసించుచున్నది. వస్తువు మిథ్యగాదు. అది బ్రహ్మమే. కాని దాని రూప నామములు మాత్రము సత్యమని అనరాదు అని సిద్ధించుచున్నది. కనుక దృశ్యం మాయ యనవలసి వచ్చినది.

**తదేవ నాస్తి చాప్యాత్మా। దేహ ప్రాణాది సంజ్ఞకమ్ :** అనగా దేహ ప్రాణాదులకు గుర్తుగా నున్న ఆత్మ కూడ పరిపూర్ణ పరబ్రహ్మము నందు లేదు. బ్రహ్మమునకు "ఏకం అనేకం భవతి" అనే సృష్టికామన కలిగి జగద్సృష్టి గావించి అందు తాను "అనుప్రావిశత్" అనురీత్యా ఆత్మ రూపమున అనుప్రవేశము గావించెను. ఈ ఆత్మయే ఉపాధి యందు లేకపోతే అంతా జడమే, చలనమే లేకుండేది. చలనము లేకుంటే దేహము పని చేయక శవమయి యుండును. అంటే ఆత్మ ప్రాణ రూపములో దేహమందుండి సర్వకార్యములోనర్చుటకు శక్తి జ్ఞానమును ప్రసాదించుచున్నది. ఈ శక్తి, జ్ఞానముండుట వల్లనే ప్రతిజీవి పని చేయు చున్నది. అనగా దేహ ప్రాణమునకు జ్ఞానము గుర్తు. ఈ గుర్తే ఆత్మ. ఈ ఆత్మ కూడ పరిపూర్ణమందు లేదు.

**20. నాస్తి సర్వమత సత్యం । బాహ్యం బ్రహ్మేతి నిశ్చను**
**జ్ఞాన మానం దగ్ంం నాస్తి । ఇత్యుక్తం మూఢమానవైః**

సర్వమతములలో సత్యము లేదు. బట్టబయలైన బాహ్యంను బ్రహ్మముగా నిశ్చయించుకొనుము. జ్ఞానము ఆనందముగాదని మూఢ మానవులచే పలుకబడుచున్నదనగా, జ్ఞానులకు జ్ఞానము ఆనందమే.

**వివరములు:-**

**నాస్తిసర్వమతసత్యం :** సర్వమతములలో గల సత్యము సత్యముగా నమ్మరాదు. మానవులకు 84 లక్షల జీవరాసులలో కెల్ల మానవుని విశేష జ్ఞానము ఇవ్వబడినది. అదే సత్యాసత్యములను కనుగొను సామర్థ్యము. అట్టి సామర్థ్యములేక ప్రజ్ఞానముచే సర్వమతములలో గల సత్యమును గుర్తించవలయును. నిజముగా మతములందు సత్యమే లేదు. మతమనేది మతి లేక బుద్ధిచే నిర్ణయించబడి కొన్ని సరిహద్దులేర్పరుచుకొన్న వ్యవస్థ అని మత శబ్దమే సూచిస్తుంది. మతములు సిద్ధాంతము చేసిన బ్రహ్మమును "మన సైవాను ద్రష్టవ్యం" అని "బుద్ధిగ్రాహ్యమతీంద్రియం" అని శ్రుతి స్మృతులు జెప్పచున్నాయి.

**ఈ పరిపూర్ణబోధ యొక మతము కాదు. అదొక సిద్ధాంతము. పరిపూర్ణ పరబ్రహ్మమును. "నతత్రచక్షుర్గచ్ఛతి, నవాఙ్గచ్ఛతి నోమనః, నవిద్మోనవిజానీయో, యద్దైవ తదను శిష్యాదన్య దేవతద్విదితాదథో అవిధతాదధి యితి శుశ్రుమ పూర్వేషా యేనస్త ద్వ్యాచచక్షిరే॥ కేనోపనిషత్॥ అనగా వాక్కుకు అందదు, కన్నుకందదు,జ్ఞానమునకు కూడ**

**తెలియరానిది ఏదో, అది తెలసిన దాని కంటెను, తెలియరానిదాని కంటెను వేరుగా నున్నదని పూర్వము పెద్దలు తెలుసుకొని శిష్యులకు బోధించిరి.**

అంతేగాకమతాభిమానమనునది ఏ మాత్రము పూనక ద్వైతాద్వైత విశిష్టాద్వైతాది అన్ని మతములను మహాసముద్రము వలె తనలో నిముడ్చుకొని సమిష్టి దృక్పథం, లేక పూర్ణ దృక్పథం విధింపబడి యుండుట చేతనే దీనికి పరిపూర్ణ భావమని పేరు వచ్చినది. మతములన్నియు లేని యెరుక యందే తమ తమ గమ్యస్థానములను నిర్ణయించుకొనినవి. పరిపూర్ణభావమందు ఎరుక లేదు, ఎరుక మీరినది. కనుక యెరుకను ఒక మతమనరాదు. దేశకాల సమాజములననుసరించి మత ప్రవక్త లాయా మతములను సమాజ శ్రేయస్సు కొరకు నిర్మాణము గావించిరి. పరిపూర్ణ బోధ అట్లుగాదు. సకల దేశాల సమాజములకు సరిపడియున్నదని నిష్పక్షపాతముగా ఈ సిద్ధాంత ధర్మములను శోధించినారు. అందుకే శ్రీ కృష్ణదేశికేంద్రులవారు క.ద.118 **"మతముల వారలు। తమ సమ్మతమైనటువంటి । శాస్త్ర మర్యాదలచే మితమేర్పరుచుకొని । బహు గతులను కలహింతు । రట్టి గతినీకేమిటికి । చపలత జెందె స్థితి నీకేమిటికీ ।"** అని హెచ్చరించినారు. ద్వైతాద్వైత విశిష్టాద్వైత, శౌర, శాక్తేయ, గాణపత్యాది మతముల వారలు తమ మతములకు సరిపడుశాస్త్రములను నిర్ణయించుకొని వానివాని మర్యాదల నతిక్రమించి నడువరాదని, హద్దులను ఏర్పరుచుకొని బహువిధముల కలహించు చుందురు. నీవు వారలవలె కలహించబోకుమని హెచ్చరించుచున్నారు. గత ప్రపంచ చరిత్రను ఒకసారి పరిశీలించినట్లయితే ప్రపంచంలో జరిగిన యుద్ధములలో ఎక్కువ శాతము మత యుద్ధాలనే చెప్పవచ్చును. మతములలో సత్యముంటే పెద్ద కాలము వరకు పెక్కు యుద్ధాలు జరిగి యుండేవికావు. **"అందుకే మతములందు ముక్తి వెదికిన లేదయా"** అని వేమనార్యులు అన్నారు.

**బాహ్యం బ్రహ్మేతి నిశ్చను :** ఈ శ్లోకమునందు మతములందు ఏమి లేదన్నారు. అదే చరణమందు ఏమి లేనిదానిని పరిపూర్ణపరబాహ్యమని, బ్రహ్మమని నిర్ణయము. బ్రహ్మమునకు సందర్భానుసారముగా పరబాహ్యమని నిర్ణయించబడినది. పరిపూర్ణ పరబ్రహ్మమును బట్టబయలని, ఉత్తబట్టబయలని, పరమపదమని, గురుగుహ్యమని అచలమని మొదలగుపేర్లు నిరపేక్షక కేవల బ్రహ్మమునకు (Absolute Brahamin) నకు వ్యవహారార్థము కల్పించబడ్డాయి. బ్రహ్మమనగా యిచట పరిపూర్ణపరబాహ్యముగా తలంచుమని ఈ శ్లోకము నిర్దేశించుచున్నది. ఎందుకనగా బయలనగా ఆకాశము. బ్రహ్మమనగా చేతన బ్రహ్మము లేక కారణబ్రహ్మముగా వ్యవహారములో నున్నది. అట్లర్థము గైకొన్నప్పుడు బ్రహ్మమను శబ్దము కేవల బ్రహ్మముకాదు. సందర్భానుసారము అర్థము గ్రహించవలసియుండును. ఎట్లనగా **క.ప.86, "బ్రహ్మందులేక కలిగిన। బ్రహ్మను నేననెడి మాయ। ప్రబలె జగంబై బ్రహ్మనుగనితానేగుటే। "బ్రహ్మననెమాయకు పని । బ్రహ్మందు జుమీ ।"** అనగా అచల పరిపూర్ణ పరబ్రహ్మమందు లేనటువంటి అహం బ్రహ్మ, ఎరుక జగత్తు రూపముగా ప్రబలి యున్నది. కనుక అచలపరిపూర్ణపరబ్రహ్మమును తెలుసుకొని దాని యందు లేనేలేదనెడి నిశ్చయమున తాను లేక పోవడమే అచల పరిపూర్ణపరబ్రహ్మము. అహంబ్రహ్మాస్మి, తత్త్వమసిబ్రహ్మ, అయమాత్మబ్రహ్మయని శ్రవణాదులు యొనర్చి, శ్రవణాదులు నిరసించి బ్రహ్మ నిర్ణయానుసారము యున్న జనన మరణములు తొలుగవని భావము. ఈ కంద పద్యము

నందు మొదటి బ్రహ్మము, అచల పరిపూర్ణపరబ్రహ్మము. రెండవ బ్రహ్మము అహంబ్రహ్మము. మూడవ బ్రహ్మము యొక్క అర్థము పరిపూర్ణపరబ్రహ్మము. నాల్గవ బ్రహ్మము ఎరుక, ఐదవ బ్రహ్మము పరిపూర్ణపరబ్రహ్మముగా అర్థము గ్రహించవలసియుండును. అయినను పరిపూర్ణ పరబాహ్యమును బ్రహ్మముగా నిశ్చయించుకోమని ఈ శ్లోకార్థము. ఏ పేరుతో పిలిచిన నామ రూపాలు మిథ్య యని, కల్పితములని, కేవల బ్రహ్మమొక్కటే సత్యమని వేదములు, వేదాంతము లనబడు ఉపనిషత్తులు తెలియ చెప్పినవి. పరిపూర్ణ దర్శనము నందు పేర్కొనట్లు వేదముల ముఖ్యధ్యేయము పరిపూర్ణపరబ్రహ్మమును ప్రచుర పరుచుటయే. కావున పరిపూర్ణ పరబాహ్యమును బ్రహ్మముగా నిశ్చయించుకొనుటలో సందేహము పనికిరాదు.

**జ్ఞానమానందగ్ం నాస్తి ఇత్యుక్తం మూఢమానవైః :** జ్ఞానము ఆనందముగాదని మూఢ మానవులందురు. అంటే జ్ఞానులు జ్ఞానమును ఆనందమే అంటారు అని అర్థము చెప్పినట్లైనది. సత్, చిత్, ఆనందములు బ్రహ్మమునకు స్వరూపలక్షణములు. అందు చిత్‌ను జ్ఞానమందురు. జ్ఞానమనగా సామాన్యార్థములో తెలివి. ఈ తెలివితోనే మానవుడు శాస్త్ర జ్ఞానమును, వస్తు జ్ఞానమును సంపాదించును. బ్రహ్మచైతన్యము, బ్రహ్మాకార వృత్తి, స్వస్వరూప స్ఫూర్తి, సృష్ట్యాదులే స్ఫురించని తాను తానై యున్న స్థితియే విశేషార్థములు. సామాన్యార్థములో ఈ జ్ఞానము సకల పదార్థములందు ఏదో రూపములో నున్నది. ఈ జ్ఞానం శబ్ద తన్మాత్ర యొక్క పరిణామమే. శబ్దము వాక్కని వ్యవహరించబడుచు పర, పశ్యంతి, మధ్యమ, వైఖరీ అని చతుర్విధముగా చెప్పబడి సకలమునందు ఏదో రూపములో వుండనే ఉన్నది. జడములని చెప్పబడే రాళ్ళ యందు పరావాగ్రూపముగా నున్నది. పరమాత్మ యందు లేశరూపముగా ఘనీభవించియున్నది. కనుక అది కేవల నిశ్శబ్దబ్రహ్మమైన పరిపూర్ణపరబ్రహ్మముగాదు. ఏలననగా ఒకప్పుడు నిశ్శబ్దము గాను మరొక్కప్పుడు శబ్దరూపము పొందుచున్నది. కనుక శబ్ద పరిణామ రూపమగు ఈ సామాన్యజ్ఞానము ఏదో రూపములో సర్వమునందు యిమిడి యున్నది. జ్ఞాన రూపమగు బ్రహ్మము అణువణువున యిట్లు యిమిడి యున్నందున **"ఆబ్రహ్మస్తంబపర్యంతం పరమాత్మస్వరూపకం"** అని చెప్పబడినది. చేతనములంగు అనగా ప్రాణుల యందు సామాన్య జ్ఞానము అంతఃకరణతో కూడి భూతద్దము నందు ప్రవేశించిన సూర్యరశ్మి దాహక శక్తిని పొందిన రీతిగా జ్ఞానజ్ఞానరూపములు చెంది సర్వమును గుర్తించుచు క్రియాకారకమై కర్మ సంస్కారములను ప్రోగుచేసుకొని బంధకారణమగుచున్నది. అట్లుగాక తన సంగతి తన మూలము సంగతి విచారించి వివేక జ్ఞానముతో కృషి చేసినచో తన స్వరూప సాక్షాత్కారము పొందగలడు. అప్పుడు తానే బ్రహ్మ స్వరూపుడగును. అదే అఖండ జ్ఞానము. అట్టి అఖండ జ్ఞానముతో నుండుటచే కలుగు నిరతిశయ సుఖమే చిదానందము. అఖండ జ్ఞానమనగా నిరంతరావిచ్ఛిన్న తైలధార వలె తెంపులేని స్వస్వరూప జ్ఞానము. అప్పుడు అన్యదా జ్ఞానమునకు తావులేదు. అప్పుడు అనందమే బ్రహ్మానందము. పై విచారణ వల్ల జ్ఞానమే ఆనందమని తేటతెల్లమైనది. ఇట్టి జ్ఞానమును ఆనందముకాదను వారు మూఢులే. వారు అవిద్యవలన అట్లుపలుకుచున్నారు.

ఇంకా కొంత వివరముగా జెప్పవలసి వచ్చిన అన్నమయ కోశముకన్న సూక్ష్మము ప్రాణమయకోశము, ప్రాణమయకోశముకన్న మనోమయకోశము, మనోమయకోశము కన్న సూక్ష్మము జ్ఞానమయకోశము, జ్ఞానమయకోశము నందుందునదే ఆనందమయ కోశము

యింకా సూక్ష్మముగా నున్నది. ఈ కోశములన్ని ఒకదానిలో మరొకటి యుంటు ఒక దాని కంటే మరొకటి సూక్ష్మంగా యున్నవి. విజ్ఞాన మయకోశము నందే ఆనందము తెలియును. కనుక జ్ఞానమే ఆనందమని తెలియుచున్నది.

**21. భ్రాంతిమూలమిదంజ్ఞానం । జ్ఞానం భ్రాంతిస్తునిశ్చితమ్**
**జ్ఞానాత్సంజాయతెనంత । మానందం భ్రాంతి లక్షణమ్ ॥**

ఈ జ్ఞానము భ్రాంతికి మూలమైనది. కనుక జ్ఞానమే భ్రాంతి యని నిశ్చయమగుచున్నది. భ్రాంతి లక్షణమగు ఆనందము అనంతమై జ్ఞానము నుండి పుట్టుచున్నది.

**వివరములు :-భ్రాంతి మూల మిదం జ్ఞానం:**అనగా ఈ జ్ఞానము భ్రాంతికి మూలమైనది. భ్రాంతి యనగా యథార్థముగా వున్నవస్తువును గ్రహించకుండ అన్య వస్తువుగా దానిని తెలుసుకొనుట భ్రాంతి. భ్రాంతి యన్న భ్రమ అన్న పర్యాయపదములు. ఇవి "భ్రం" అను ధాతువు నుండి వ్యుత్పత్తి చెందిన శబ్దములు. భ్రం అనగా తిరుగుట. గిరగిర తిరుగువాడు వున్నవస్తువును వున్నట్లు గ్రహించడు. అట్లే మనోవేగములో అనంత సంకల్పములు తిరుగుటలో పూర్వదృష్టవస్తు సంస్కార బలముచే అన్యథా గ్రహణము కలుగుచుండును. శాస్త్ర పఠనాదులవలన, దర్శన శాస్త్రముల వలన, మతవాదముల వలన భ్రాంతులు విస్తారమగును.

మతవాదనలకును, తత్త్వవిచారణకును జ్ఞానము కారణమైయున్నది. కనుక భ్రాంతులు రెండు విధములుగా విభజించియున్నారు. 1. కర్మభ్రాంతి 2. జ్ఞానభ్రాంతి. పంచసాధనలలో మంత్రోపాసన, భక్తి, యోగాభ్యాసము అను మూడు కర్మ భ్రాంతి లోనివి. మతవాదము తత్వ విచారణ జ్ఞాన భ్రాంతి లోనివి. కనుకనే జ్ఞానమే భ్రాంతికి మూలమని జెప్పబడినది. ఈ రెండింటిని గూర్చి కొంత తెలుసుకొందము.

**మత భ్రాంతి :** దేశకాల సమాజములననుసరించి తాత్కాలిక ప్రయోజనములకై నానావిధ మతములు వెలసినవి. మతానుయాయులు తమతమ మత సిద్ధాంతముల కనువగు ప్రమాణములను సంతరించుకొని వారిని మీరిన వారు రౌరవాది నరకముల పాలగుదురని భయపెట్టి మానవ స్వాతంత్ర్య బుద్ధి నరికట్టి బానిసలను చేయుచున్నారు. వారికి మోక్షము కలిగించుటకు బదులు, బంధమును సృష్టించుచున్నారు. కనుకనే "మతములందు ముక్తి వెదికిన లేదయా" అని వేమన హెచ్చరించియున్నారు.

మతములన్నిటి యందు అద్వైత వాదము గొప్పది. **1."బ్రహ్మ సత్యం జగన్మిథ్యా" 2. "జీవోబ్రహ్మైవ నాపరః"** యనునవి అందలి ముఖ్య సిద్ధాంతములు. అద్వైత బోధనల వల్ల జన్మ రాహిత్యమనుకొనుట భ్రాంతి. ఏకమేవాఽద్వితీయం "బ్రహ్మ" అనగా వున్నదొక్క బ్రహ్మమే రెండవది లేదు. నానాత్వమనేది అసలు కొంచమైన లేదు. రెండవది జీవేశ్వర జగత్తు వున్నదనుకొనుట భ్రాంతి.

పరిపూర్ణ భావజ్ఞుల సిద్ధాంతమేమనగా జగత్కారణము బ్రహ్మమే. ఆ బ్రహ్మమే అన్నియు తానై, తన్ను తానే చూచుకొని తానే భ్రమ ప్రమాదులకు లోనగుచున్నది. కనుక భ్రాంతి కారణము బ్రహ్మమే. ఆ బ్రహ్మమే మాయ. మాయ బ్రహ్మములకు వస్తుతః భేదము లేదు.

అద్వైతులు ద్వైత బుద్ధియే భ్రాంతి యని నిర్ణయించిరి. "ద్వితీయాద్వై భయం భవతి" రెండవ దంటూ వుంటే భయ భ్రాంతులు తప్పవు అన్నారు. రెండు అని అంటే భేదము వుందన్నమాట. అద్వైత సిద్ధి ద్వారానే అభేద బుద్ధి కలుగ గలదు అని అన్నారు.

పరిపూర్ణ భావజ్ఞులు ఎరుకే అనగా అధిష్ఠానచేతన బ్రహ్మము జీవేశ్వర జగత్తుగా మారినదని చెప్పినారు. ఈ ఎరుకే సర్వ భేదములకు సర్వభ్రాంతులకు మూలకారణముగా నున్నదని తేటతెల్లమగుచున్నది. కనుక సర్వభ్రాంతులకు మూలము మూలంలేని ఈ గుర్తెరిగే శరీరమేనని శ్రీ శివరామదీక్షతులవారు నొక్కి జెప్పినారు.

ఎరుక (జ్ఞానము) నే భ్రాంతి, భ్రాంతియే ఎరుక. కం.ప.॥ **135. భ్రమ యనినవుట్టుకనినను । భ్రమకే నామంబులిట్టి । భ్రమకేనీవుం । భ్రమ యీ మేను జగత్తులు । భ్రమ యెరుకయు మరుపు రెండు భ్రమే భ్రమవినరా ॥"** అని శ్రీ కృష్ణదేశికేంద్రులవారు సెలవిచ్చియున్నారు. అనగా ఉన్నది లేని దానిగా తలంచు మిథ్య మతిని భ్రమయని చెప్పబడును.

**జ్ఞానాత్సం జాయతేనంత మానందం భ్రాంతి లక్షణం :** అనగా భ్రాంతి లక్షణమగు ఆనందము అనంతమై జ్ఞానము నుండి పుట్టుచున్నది. జ్ఞానమెట్లు భ్రాంతికి మూలమైనదో పై పుటలలో చర్చించి తెలుసుకొంటిమి. ఇప్పుడు ఆనందమనంతమై జ్ఞానము నుండి ఎట్లు పుట్టుచున్నదో తెలుసుకొందము.

ఆనందమనగా దుఃఖసమిశ్రమము కానిది,దుఃఖ పర్యవసాయి కానిది యగు నిరతిశయ సుఖములేక అత్యంత సుఖము ఏది కలదో దానికానందమని పేరు. నేనే బ్రహ్మననే అఖండ జ్ఞానరూపముచే కలిగిన ఆనందమే బ్రహ్మానందము. ఈ ఆనందము అనంతమైనది. చిత్ (జ్ఞానము) అనగా అఖండ జ్ఞానము. అట్టి అఖండ జ్ఞానముతో నుండుటచే కలుగు నిరతిశయ సుఖమే చిదానందము లేక జ్ఞానానందము. అఖండ జ్ఞానమనగా నిరంతరావిచ్ఛిన్న తైలధారవలె తెంపులేని స్వస్వరూప జ్ఞానము. అపు డన్య జ్ఞానమునకు తావులేదు. అన్యవస్తు జ్ఞానము శబ్ద స్పర్శాదులను గుర్తింపజేసి సుఖదుఃఖములను కలిగించును. సృష్టికి పూర్వము శబ్దాదుల యుత్పత్తి లేనందున సుఖదుఃఖములను ద్వంద్వములకు తావులేదు. అట్టి నిరతిశయ సుఖమే అనంతమైన ఆనందము. అప్పుడు ఆ ఆనందమునకు అవధులు లేవు. కావున అట్టి ఆనందము అనంతమైనది.

ఇట్టి అనంతానందము జ్ఞానము నుండి పుట్టుచున్నదని పైన తెలుసుకొంటిమి. జ్ఞానమునకు ఆధిభౌతికము ఎరుగుట. ఎరుగుట యనగా శబ్దాది విషయపంచకమును గుర్తించుట. అట్టి జ్ఞానము విషయక పంచకము నుండి మరలించినచో ఆ జ్ఞానమే శుద్ధ జ్ఞానమనబడును. అట్టి శుద్ధ జ్ఞానము సృష్టికి పూర్వమున్న వస్తువు లేక తత్వమును గురించి ధ్యానించినచో అజ్ఞానము (నిరీంద్రియమగు మనస్సు) జ్ఞేయరూపము దాల్చును." మనో హిజతువత్" మనస్సు లక్క వంటిది. దానిని వేడి చేసినచో ఏ ఆకారముగానైన మలుచుకొనవచ్చును. అట్టి స్వవశీయ మనస్సు వల్ల సత్పదార్ధమును కనుట వల్ల కలుగు అనంతానందము మనస్సు తదాకారము దాల్చుటవల్ల కలుగు జ్ఞానము వల్లనే ఎరుగుటకును సాధ్యము. కనుక భ్రాంతి లక్షణమైన అనంతానందము జ్ఞానము నుండి పుట్టినది.

**22. సత్యం జ్ఞానమనంతంచ । మాయా గుణమితిశృణు**
**జ్ఞాన మానందగ్ంనాస్తి । ఇతి వేదాంత నిశ్చయమ్**

వినుము! సత్యము (సత్) జ్ఞానము (చిత్) అనంతము (ఆనందము) మాయా గుణములుగా తెలుసుకొనుము. జ్ఞానస్వరూపమగు ఆనందము లేనిదే. ఇట్లనుట వేదాంత నిశ్చయము.

**సత్యం జ్ఞాన మనంతంచ మాయా గుణ మితిశృణు :** శ్రుణు అనగా వినుము. సత్యం, నిత్యమనునదే **సత్తు** – త్రికాలా బాధ్యము అనగా మూడు కాలము లందు మార్పు చెందని రూపము గలది సత్తు.

జ్ఞాన విజ్ఞానము గలదే **చిత్తు**. చిత్తు యనగా అఖండము అనంతమగు జ్ఞానము.

అనంతమగునది **ఆనందము**. అనగా దుఃఖము లేశము కూడ లేని సుఖ స్వరూపము. సచ్చిదానందములు ఆ పరమాత్మ వస్తువును యెన్నడు విడువకుండ యున్నందున ఇవియే పరమాత్మకు స్వరూప లక్షణములుగా చెప్పబడినవి.

సృష్టికారణమగు ఈ బ్రహ్మమునకు సచ్చిదానందములు స్వరూప లక్షణములని చెప్పినపుడు కార్యరూపమగు సృష్టి యందంతట కూడ సచ్చిదానందములు ఏ అల్ప పరిమాణములోనో, ఏదో రూపములోనో వుండియే యున్నవి. కనుక చరాచరరూపమగు సమస్త విశ్వము నందు సచ్చిదానంద లక్షణములు ప్రకటమగుచునేయున్నవి. ఉ॥ ఒక చిళ్ళ పెంకు యందు కూడ వునికి యుండుటచే సలక్షణము, అందలి అణు సముదాయము పరస్పరము కరచి పెట్టుకొని యుండుటకు కారణమైనశక్తి రూపముగా చిల్లక్షణముగా, ఏ స్వల్పప్రయోజనమునకో అవసరమై యుండుటచే ఆనంద లక్షణము, ఆ చిళ్ళ పెంకు యందు ద్యోతకమగుచున్నవి. ఈ విధముగా సత్యజ్ఞాన అనంతములు (సచ్చిదానందములు) సర్వేసర్వత్ర గోచరించుట చేత కూడ " ఆస్తంభ బ్రహ్మ పర్యంతం పరమాత్మ స్వరూపకం" అని అభివర్ణించబడినది.

ఉపనిషత్తులలో సృష్టి కారణమైన బ్రహ్మము జ్ఞామయమగుటచే ఎరుక యని పరిపూర్ణ భావజ్ఞులు దానికి పేరిడిరి. శబ్ద ప్రమాణమునకు లోబడి బ్రహ్మము యెరుకనే.

అద్వైత నిర్ణయరీత్యా పరబ్రహ్మమొక్కటే ఎల్లప్పుడుండేది. కనుక ఎరుక దాని యందుతోచి, దాని యందే వుండి దాని యందే మరల లేకుండ పోవుచున్నదని, సృష్టికి పూర్వము అసలు లేనేలేనట్లు తోచుచున్నది. సృష్టి ప్రారంభకాలమున బ్రహ్మము నందు తోచి ఆ బ్రహ్మము యొక్క సాన్నిధ్యమందు చేతనవంతమై బ్రహ్మతో కూడి జీవేశ్వర జగత్తునకు కారణమైనట్లు చెప్పబడినది. మాయ గాని, తత్కార్యములు గాని బ్రహ్మమందుండియే కలిగినవి. వృక్షకారణము బీజము నందణిగి మణగి యున్నట్లే జీవేశ్వర జగదాది మాయా కార్యములు సహితం బ్రహ్మము నందు బీజరూపముగా అణగిమణిగి యున్నవని చెప్పక తప్పదు. మరుగై యున్నది ప్రకటమై యున్నదని చెప్పాలి. ఎటొచ్చి ఈ మాయాది గుణములు ఆ బ్రహ్మమునందు ఆవిర్భావ తిరోభావములు చెందుచున్నవే గాని బ్రహ్మమున కన్యదేశమునలేదు. మరియు "బ్రహ్మణోన్యం నకించిన" అనగా బ్రహ్మము కంటే అన్యముగా కొంచమైన లేదు. అంతా బ్రహ్మ స్వరూపమే, "సర్వం ఖల్విదంబ్రహ్మ" యని శ్రుతులు చెప్పుచున్నవి. కనుక మాయా, బ్రహ్మములు, రెండు బ్రహ్మము యొక్క రూపాంతరములే." మాయ అనిర్వచనీయమని శంకరులు కూడ జెప్పియున్నారు. మాయా సద్రూపముగాను అసద్రూపముగాను, భిన్నభిన్నములుగాను, సావయ, నిరవయ రూపములుగాను వుంటు యితమిత్థమని నిర్ణయింపరాక అనిర్వచనీయమై మహాద్భుతమై యున్నదనిరి. కాని మాయ బ్రహ్మములు రెండు ఒకే వస్తువు. ఒకే నాణెము యొక్క బొమ్మ బొరుసు లాంటివి. బ్రహ్మము నందలి దైవాత్మక శక్తి లేక బ్రహ్మశక్తియే మాయ. ఈ రెండు ద్వంద్వ స్వరూపములుగా నున్నవి. ఇవి పరిపూర్ణ పరబ్రహ్మమునందు లేవు.

**జ్ఞానమానందగ్ం నాస్తి। ఇతివేదాంత నిశ్చయమ్ :** జ్ఞాన స్వరూపమగు ఆనందము లేనిదేయని వేదములు నిశ్చయించినవని అర్థము. అంటే జ్ఞాన రూపమగు ఆనందము పరిపూర్ణ పరబ్రహ్మమందులేదని వేదములు ఘోషించుచున్నవి. బ్రహ్మమునకు సత్, చిత్, ఆనందలక్షణములు కలవు. అందుచిత్ అను దానిని జ్ఞాన మందురు. జ్ఞానమనగా సామాన్యార్థములో తెలివి. ఈ తెలివితోనే మానవుడు శాస్త్ర జ్ఞానమును, వస్తు జ్ఞానమును, బ్రహ్మ చైతన్యమును బ్రహ్మాకార వృత్తి, స్వస్వరూప స్ఫూర్తి, సృష్ట్యాదులే స్ఫురించని తాను తానై యున్న స్థితి తెలుసుకొనగలడు. ఇది విశేషార్థము సామాన్యార్థములో ఈ జ్ఞానం సకల ప్రాణులందే గాక జడములని నిర్ణయించిన పదార్థములందు గూడ ఏదో ఒక రూపము అనగా శక్తి రూపములోనో, గుణ, క్రియా, వాక్కు రూపములో యుంటునే యున్నది. అంటే ఈ బ్రహ్మము అణువణువునందు యిమిడి యున్నందున " ఆస్తంబ పర్యంతం పరమాత్మ స్వరూపకం" అని చెప్పబడినది. చేతనములందు ప్రాణులందు జ్ఞానాజ్ఞానా రూపములు చెంది సర్వము గుర్తించుచు క్రియా కారకమై కర్మ సంస్కారములను ప్రోగు చేసుకొని బంధ కారణమగుచున్నది. అట్లు గాక తన సంగతి విచారించి వివేక జ్ఞానముతో కృషి చేసినచో తన స్వరూప సాక్షాత్కారము పొందగలడు. అప్పుడు తానే బ్రహ్మస్వరూపుడగును. అదే అఖండ జ్ఞానము. అట్టి అఖండజ్ఞానముతో నుండుటచే కలుగు నిరతిశయ సుఖమే చిదానందము. అఖండ జ్ఞానమనగా నిరంతరావిచ్ఛిన్న తైలధారవలె తెంపులేని స్వస్వరూప జ్ఞానము. అప్పుడు అన్యదా జ్ఞానమునకు తావు లేదు. అన్య వస్తు జ్ఞానము శబ్ద స్పర్శ రూప, రస, గంధముల గుర్తింప జేసి సుఖ దుఃఖములను కలిగించును. సృష్టికి పూర్వము శబ్దాదులు యుత్పత్తియే లేనందున సుఖదుఃఖములకు తావు లేదు. అట్టి నిరతిశయ సుఖమే ఆనందము. అట్టి జ్ఞాన స్వరూపమగు ఆనందము పరిపూర్ణ పరబ్రహ్మమందు లేదని, ఇదివేదాంత నిశ్చయమని ఈ శ్లోకముద్భోధించుచున్నది.

**23. సముద్రేభంగఫేనాది । బుద్బుదానిచ సర్వతః**
**యథా నశ్యం యథాజాతమ్ । తథా సర్వంచరాచరం**

సముద్రము నందు పుట్టిన అలలు నురుగు మరియు నీటి బుడుగలు సర్వము సముద్రము నందే పుట్టి సముద్రము నందే నశించునట్లు, సకల చరాచరములు పరిపూర్ణ పరబాహ్యమందు లేకనే పుట్టి పరబాహ్యమందే నశించును.

**వివరములు :- సముద్రేభంగఫేనాది :**

సముద్రము నందు అలలు, నురుగు మరియు నీటి బుడుగలు సర్వము ఎల్లప్పుడు పుట్టుచునే యుండును. మరియు అవి సముద్రము నందే నశించుచుండును. మొదట అలలు ఎట్లు వచ్చునో పరిశీలించిన యెడల, గాలిచే సముద్రము నందు అలలు పుట్టును. ఆటుపోటుల వల్ల కూడ తరంగము లేర్పడును. ఇవి సువిశాలమైన సముద్రము నందు ఉవ్వెత్తెగిరి దరిని చేరి దరి నందు నశించును. అట్లే ఫేనాది అనగా నముద్రమున తెల్లని నురుగుమొదలగునవి అని అర్థము. ఉవ్వెత్తెగసిన అలలు తీరమును తాకుటవల్ల తెల్లని నురుగు యేర్పడును. ఆ నురుగు కూడ ఆసముద్రమునందే నశించును.

**బుద్బుదానిచ సర్వతః :** అనగా నీటి బుడుగలు సముద్రములో పుట్టి సముద్రములోనే నశించును. ఈ బుద్బుదములు పుట్టిన విధమెట్లనిన జలమునందున నున్న వాయువు బయటికి పోవు ప్రయత్నములో నీటిబుడుగలు యేర్పడుచున్నవి. ఉదాహరణకు సోడా బుడ్డిని తెరచినచో

సోడా నీటిలో వాయువు రూపములో నున్న గ్యాస్ పైకి పోవునప్పుడు బుడుగలు పైకి లేచును. గాలితోనిండిన సన్నని నీటి పొరను బుడుగయని అందుము. వాయుసంయోగము వలన నీటి బుడుగ కలిగి నట్లు, నేను మేనుల సంయోగము వల్ల అనగా ప్రాణమనంబుల సంయోగములో యెరుక-గుర్తెరిగే తెలివి కలుగుచున్నది. కం॥**103॥ మే నెరుకల రెండింటిలో । దానిని యిది దీని నదియు । తగ సృజియించున్"** మరొక కందార్థదర్పులో **88. తొలుకారు మెరుపుకైవడి । పొలుపుగ నీళ్ళందుదోచు । బుగ్గలరీతిన్ । అల సూర్య కిరణమందున । గల నీళ్ళంబలెను । యెరుక గనిపించునయ్యా॥ అంతలో మొదట గనుపించదయ్యా॥ కలకాలమొకరీతి గలిగుండ దీయెరక । తిలకింప పగలు రాతిరి దిరుగు విధమూన ।"** మరియు క.ద.**98. "వనగల్లుదకము లోపల । తనకై తా వచ్చి । తనకు తానేగు విధంబున పరిపూర్ణము లోపల । తనకై తావచ్చి యెరుక । తనకై తాజనునూ॥ అచలంబున్నదని తానెరిగననూ॥ తనలేమి నిజమాని తనకే తోచును అచలంబున్నదని తానెరిగినను".** అనగా తొలకరి మెరుపు వలెనూ, నీటి బుడుగవలెను సూర్యకిరణములచే కనపడు ఎండమావులవలెను యెరుక కనబడి మరల కనబడదు. ఇదియును గాక యెల్లప్పుడు ఒక్క తీరుగా నుండదు. పగలు రాత్రి తిరుగునట్లు కనబడి కనబడక యుండునని భావము. రెండవ పద్యములో వనగండ్లుదకము లోపల తనకై తావచ్చి తనకు తాను పోవునట్లు అచల పరిపూర్ణ పరబయలులో ఎరుక తనకు తానే వచ్చి తనకు తానేపోవును. ఈ శ్లోకమున ఎరుక చేష్టలను వర్ణించబడినవి.

**24. బాహ్యమధ్యేచజాతంతు బాహ్యమధ్యేచనశ్యతి**
**సముద్రే మత్స్య కూర్మాద్యాః । యథాచరంతి జంతవః**

సముద్రము మధ్య జలచరములైన తాబేళ్ళు చేపలు పుట్టి గిట్టినట్లు పరబాహ్యము మధ్య ఈ సకల చరాచరములన్నియు చరించుచున్నవి మరియు నశించుచున్నవి.

**వివరములు :-**శ్రీ కృష్ణదేశికేంద్రుల వారు తమ కందార్థదర్పులు ॥**63॥** నందు ఈ భావము బహు చక్కగా వివరించియున్నారు. **"తండోపతండములుగా, దండి ఝషాదికములన్ని తన లోపల నుద్దండత నుండిన పోయిన । నుండు సముద్రంబు యెరుగా కుండూ నెప్పటికీ । పరిపూర్ణ మిట్లుండు నెప్పటికీ । యెండమావులరీతి నుండేటి బ్రహ్మాండ । ముండీన పోయినరెండు గుర్తెరుగాని దుండూనెప్పటికీ । పరిపూర్ణ మిట్లుందూ నెప్పటికీ॥** అనగా సముద్రము నందు జలచరాదులు గుంపులుగా నుండి వ్యవహరించుచున్నను తన లోపల నుండి గగ్గోలు చేస్తున్నను లేక అవి చనిపోయినను సముద్రమెట్లు గుర్తించక పోవుచున్నదో అదే విధముగా ఎండమావులరీతి బ్రహ్మాండముండిన పోయిన పరిపూర్ణము గుర్తెరుగక యుండును అని భావము. మరి ఈ శ్లోకమున సముద్రములో చేపలు తాబేళ్ళు, మొసళ్ళు మొదలగు జలచరములు పుట్టి చచ్చినను ఎట్లు యెరుగదో పరిపూర్ణ పరబాహ్యమందు బ్రహ్మాండముగా పేర్కొనబడిన 84 లక్షల చరాచరములు పుట్టినట్లు తోచి పరిపూర్ణమందే నశించుచున్నవి: మరియు క.ద**64. "ఎరుకతో వచ్చిన విశ్వము॥ యెరుకతో జనునుగాని నిల్వదీబయలైతే॥ ఎరుకతోరాదెరుకతో బో । దెరక తనందేమిలేదు । ఇదినిశ్చయమురా॥ వుండుంటే యీ యేరుకే తానౌరా"** అని సెలవిచ్చియున్నారు. అనగా ఎరుకతో వచ్చిన విశ్వము ఎరుకతో పోవును గాని నిలకడగా నుండదు. బీజ వృక్ష న్యాయమున బీజములో ఉపాధి చెందిన వృక్షము బీజముతో ఎట్ల పోవుచున్నదో అట్లే ఎరుకతో ఉపాధి చెందిన విశ్వము ఎరుకతో పోవును. జగము పోయి ఎరుక నిలువదు. ఎరుకపోయి జగము నిలువదు.

**25.　　తథా చరతి బాహ్యస్యమధ్యే సర్వచరాచరమ్
బాహ్యం సర్వం గతం నిత్యంఅచలంచాస్యతే సదా**

అదే విధముగా సర్వ చరాచరములు పరిపూర్ణపరబాహ్యమున చరించుచున్నవి. పరిపూర్ణ పరబాహ్యమే అన్నిటి యందు నిండి నిబిడీకృతమై శాశ్వతమై ఎల్లప్పుడు అచలమే యున్నది.

**వివరములు :- తథాచరతి బాహ్యస్యమధ్యే సర్వచరాచరం :** అనగా అంతట నిండి నిబిడీకృతమైన పరిపూర్ణపరబాహ్యమందు సకల చరాచరములు సంచరించుచున్నవి. అనగా పరిపూర్ణ పరబ్రహ్మము లోన బయట మధ్య అంతట నిండి నిబిడీకృతమై యున్నది. కం.ప.91. **"జలమందు మొదలులేకనే । జలచరములు బుట్టి పెరిగి సమసినరీతిన్ । అచల పరిపూర్ణములో నీవిలసజ్జననంబు స్థితియు। విలయములౌరా"** యని శ్రీ కృష్ణదేశికేంద్రులవారు శెలవిచ్చియున్నారు. అంటే నీటి యందు మొదలు లేనిదే జలచరములు పుట్టి పెరిగి నశించిన విధమున అచల పరిపూర్ణపర బయలు నందు లేనిదే ఆత్మ, ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథ్వి పుట్టి పెరిగి లయము పొందుచున్నవి. అట్లే స్థావర జంగమ జీవోపాధులు, జడా జడంబులు చరాచర సమూహములు పుట్టి నశించును. ఈ క్రింది పద్యమున ఈ విషయమునుబహుచక్కగా వర్ణించియున్నారు. క.ప॥92. **అచలమున మొదలు లేకనె। సచరాచర జంతు నిచయ జననమగు యప్పుచయమున లేని జలచర నిచయము జన్మించినట్లు। నిశ్చయముసుమీ॥**

**బాహ్యం సర్వగతం నిత్యం :** పరిపూర్ణ పరబాహ్యమంత నిండి యున్నది మరియు నిత్యమైనది అనగా శాశ్వతమైనది. శ్రీ పరుశురామ నరసింహదాసుగారు భద్రాద్రిరామశతకము నందు పూర్ణబోధను వివరిస్తు అచలపరిపూర్ణము. **85** సీ॥ సకల దేశములందు సకలకాలములందు సకల వస్తువుల చంచలము లేక । చావు పుట్టుకలేని యీవృత్త బట్ట బయలేకాని రెండోది లేదు లేదు" అని ఘంటాపథముగా జెప్పి యున్నారు. అంటే అచల పరిపూర్ణము సర్వగతంగా అన్నిటి యందు చంచలము లేక యున్నదన్నారు. శ్రీ కృష్ణదేశిక ప్రభువులు మరొక కందము నందు **"సంతాత మొకరీతి సకల దేశమూ లాయం దంతటా నిండున్న దదుగో పరిపూర్ణము"** అన్నారంటే అచల పరిపూర్ణము ఎల్లప్పుడొక్కరీతిగా సకల దేశములందంతటా, సర్వవస్తువులందు నిండియున్నదని సెలవిచ్చియున్నారు. క.ద. **147. "యే పరిపూర్ణము మేనికి । లోపల వెలినిండియుండు। లోపము లేకన్। ఆ పరిపూర్ణమే జగతికి । లోపల వెలినుండు దాని। లోనె వున్నవిరా"** అనగా ఏ పరిపూర్ణము శరీరమునకు లోపల వెలుపల నిండినిబిడీకృతమై యున్నదో ఆ పరిపూర్ణమే లోపల బయట నిండియుండును. దాని యందే ఈ శరీరము జగము తెలియుచున్నవి. యని శ్రీ కృష్ణదేశికులవారు పరిపూర్ణము యొక్క సర్వగతస్థితిని వర్ణించినారు.

**అచలం చాస్యతే సదా :** ఎల్లప్పుడు అచలపరిపూర్ణపరబాహ్యమే వున్నదని అర్థము. శ్రీ భూమానంద హనుమంతదేశికుల వారు పరతత్వప్రకాశిక కందార్థదర్పులందు 5। జీవేశ రహిత మచలం । భావాభావములులేని । బయలే అచలం । కేవలాత్మయె అచలం। స్థావర జంగములు లేని.। సాక్షి రహితమచలం । సాధన రహిత । మోక్షాతీతమచలం । ఆవరణ విక్షేప ఆరోప రహిత మచలం । నీవు నేనసె భ్రాంతి నిరసనమే అచలం ।" అని అచలంను

నిర్వచించియున్నారు. శ్రీ సదానందవీరవెంకటరామచంద్రరావుగారు అచలమును గూర్చి యిట్లు నిర్వచించినారు." అచలం అనగా ఏ కాలంలోనూ కదలనిది, నిరపేక్షక మయినది. చలనమున్నదని అంగీకరిస్తే చలనం లేని మరొకటి వుండి వుండాలని చెప్పవలసి వస్తుంది. ఆత్మతో సహా జీవజగత్తంతా కదిలేదే. కదలనిది అచలము వీటి కన్నిటికి అతీతంగా వుండి వుండాలి. అలా వున్నదానికి వ్యవహారార్థము పరిపూర్ణం అని పేరు పెట్టుకున్నారు." అట్టి అచలం ఎల్లప్పుడున్నది.

బ్రహ్మమేడ ననుచు పలుమారు నాడేరు। వెఱ్ఱిమూఢ జనుల విధము చూడ
బ్రహ్మమన్నిటందు పరిపూర్ణమై యుండు। విశ్వధాభిరామ వినురమేమ.

తా॥ సకల వస్తువుయందు పరిపూర్ణముగా నిండి యున్నదే పరిపూర్ణము. నామ రూపాలు గల వస్తువులు లేక వస్తువు యొక్క ఆవరణము కూడ లేక పరిపూర్ణమే తప్ప మరొకటి లేనే లేక నిండి యున్నది. అన్నిటి యందు అనగా అన్నిటి లోన మాత్రమే గాదు. అన్ని వస్తువుల బాహ్యాభ్యంతరముల యందును, వస్తువులోపల యందు అను మాటల వ్యత్యాసమును గుర్తించనగును. ఒకటి షష్ఠీ విభక్తి, రెండవది సప్తమీ విభక్తి. బెల్లములోప అంటే బెల్లములో ఎక్కడో అనవలెను. బెల్లముయందు అంటే దాని యొక్క ప్రతి అణువులోను, అణువు అణువు మధ్య సర్వత్రా అని అర్థము.

**26. అంతః పూర్ణో బహిపూర్ణః । పూర్ణకుంభ ఇవార్ణవె**
**అంతర్బహిశ్చ తద్వ్యాప్తం । శివం సర్వగతం శృణు**

వినుము ! సముద్రము నందు గల నిండు కుండలోపల, వెలుపల అంతట నీరు ఎట్లు వ్యాపించియున్నదో అదే ప్రకారము పరిపూర్ణ పరబాహ్యము (శివం) బ్రహ్మాండమునకు లోపల వెలుపల అంతట నిండి వ్యాపించియున్నదని ద్వాదశీభామును వస్తు నిశ్చయముగా జెప్పబడినది.

**వివరములు :-** సముద్రము నందు కుండను ముంచిన సముద్రము నీరు ఆ కుండలో చేరుటయేగాక ఆ కుండకు వెలుపల కూడ ఆవరించి కుండకు అన్ని దిక్కుల మరియు క్రింద మీద లోన బయట వ్యాపించియుండును. ఇచట నీరు వ్యాపించిన విధమును పరిపూర్ణము యొక్క ఉనికిని పోల్చబడినది. పరిపూర్ణము కూడ సముద్రమందు కుండకు అన్ని దిశల యందు, పైన క్రింద ఎట్లు వ్యాపించియున్నదో అదే రీతిలో బ్రహ్మాండమునకు లోపల వెలుపల క్రింద మీద అన్ని దిక్కుల, సర్వదేశాల యందు సర్వకాలముల యందు ఆది మధ్యాంతములు లేక సర్వత్ర నిండి నిబిడీకృతమై సూది మోపుటకు తావులేక నిండియున్నది. దాని కెట్టి పరిమితి లేదు. కేవలము అఖండమైయున్నది. దాని యందు జ్ఞానముగాని, కర్మ చేయుటకు వలయు ప్రాణ శక్తి గాని యింద్రియములు గాని వానిని నడిపించు అధిష్ఠాన దేవతలు గాని అన్యమేమి లేదు. అది "నిశ్శక్తిః నిర్మలం పూర్ణం" భద్రాది రామశతకకర్త పరిపూర్ణకేవలాత్మ స్థితిని బహుచక్కగా వర్ణించియున్నారు.

**88 సీ॥ సృష్టికి పూర్వంబు సృష్టికి పరమందు సృష్టియున్నప్పుడు సృజనలేక। సకలదేశంబుల సకలకాలంబుల సకల వస్తువుల చంచలములేక। ప్రాగ్దక్షిణంబుల పశ్చిమోత్తరముల నాలుగు మూలల మీద నడుమక్రింద। అచలమై సత్యమై యాద్యంతశూన్యమై పరిపూర్ణమై బట్టబయలుగాను। ఏకమైయుండు ఏ బాధ లేక యుండు అట్టి వుస్తువుకేవలాత్మనగబడును ॥రమ్య॥** తా॥ సృష్టికి ముందు వెనుక, యిప్పుడు ఎప్పుడు

పుట్టక గిట్టక సకలదేశములందు సర్వకాలము లందు,సకల వస్తువులందు చలనము లేక తూర్పు దక్షిణ పశ్చిమోత్తరము నాలుగు దిక్కులు మూలలు మీద నడుమ క్రింద అంతట ఆది మధ్యాంత శూన్యమై పరిపూర్ణమై బట్ట బయలుగా నున్న వస్తువే కేవలాత్మయని చెప్పబడెను. అంటే పరిపూర్ణము అంతట వ్యాపించియున్నది.

సముద్రమందు గల కుండకు వెలుపల లోన క్రింద మధ్య, పైన వ్యాపించి యున్నట్లు పరిపూర్ణ పరబాహ్యము వ్యాపించి యున్నదని పోల్చినారు. అంటే పరిపూర్ణ పరబాహ్యము బ్రహ్మాండమునకు లోపల వెలుపల వ్యాపించియున్నదని అర్థము. శివము అనగా యిచట అచలపరిపూర్ణము. అచలపరిపూర్ణము శివము ఎందుకన్నారంటే సర్వశుభ ప్రదమైనది మంగళకరమైనదని యర్థము. పరిపూర్ణ పరబాహ్యము అపరోక్షమై దృఢమైన యెడల శాశ్వత జనన మరణ రహితము సిద్ధించుట కన్న మంగళకరమైనది మరొకటుండదు గదా! కనుక ఉపనిషత్తునందచ్చటచ్చట శివము పరమ శివమని పరిపూర్ణపరబాహ్యమునకు పర్యాయ పదములుగా వాడినారు. దానికి ఏ పేరు పనికి రాదు. మనము పేరు పెట్టుటచేతనే పేర్లు. అట్టి పేర్లలలో మంగళకరమై శుభప్రదమైన శివము, పరమ శివము అని పేర్లడిడుట తగియున్నది.

## 27. సర్వంబాహ్యగతంనిత్యమ్ । జ్ఞానం నాస్తీతినిశ్చితం తదేవజాతమిత్యుక్తం । తదేవం నశ్యతి శృణు

వినుము! సర్వము పరిపూర్ణపరబాహ్య మందు నిండి యున్నది. అది నిత్యమైనది. ఇట్టి పరిపూర్ణమందు ఎరుక రూపమైన జ్ఞానము లేదనుట నిశ్చయము. అదే ప్రకారము ఆ యెరుకయే పుట్టుచున్నది, అదియే నశించుచున్నది.

**సర్వం బాహ్యగతం నిత్యమ్ :** పరిపూర్ణ పరబాహ్యము పై శ్లోకమున వివరించినట్లు అంతట గలదు. క.ద. 36 **"సంతాత మొకరీతి సకల దేశమూలా యందంతాట నిండున్నదదిగో పరిపూర్ణమూ"** అన్నారంటే ఎల్లప్పుడొక్క రీతిగా సకల దేశములందంతటా నిండి యున్నదని నిర్ణయము.

**వివరములు :- జ్ఞానం నాస్తీతి నిశ్చితం :**

పరిపూర్ణపరబ్రహ్మమందు జ్ఞానములేదనుట నిశ్చయము. జ్ఞానమనగా సామాన్యార్థములో తెలివి. ఈ తెలివితోనే మానవుడు శాస్త్ర జ్ఞానము, వస్తు జ్ఞానం సంపాదించును. బ్రహ్మచైతన్యం, బ్రహ్మకారవృత్తి,స్వరూప స్ఫూర్తి, సృష్ట్యాదులే స్ఫురించని తానుతానై యున్న స్థితి యను విశేషార్థము లున్నవి. సామాన్యార్థములో ఈ జ్ఞానము సకల ప్రాణులందే గాక జడములని నిర్ణయించిన పదార్థములందు కూడ నేదో రూపమున నున్నది. ఈ జ్ఞానం శబ్దతన్మాత్ర యొక్క పరిణామమే. శబ్దము వాక్కు అనివ్యవహరించబడుచు పర, పశ్యంతి, మధ్యమ, వైఖరి అని చతుర్విధములుగా చెప్పబడిన సకలము నందు ఏదో రూపములో వుండియే యున్నది. జడములని చెప్పబడే రాళ్ళ యందు పరావాగ్రూపమున నుండి యున్నది. పరమాత్మ యందులేశ రూపముగా ఘనీభవించియున్నది. కనుక అది కేవల నిశ్శబ్దబ్రహ్మమైన పరిపూర్ణపరబ్రహ్మము కాదు. ఏలననగా ఒకప్పుడు నిశ్శబ్దముగాను, మరొకప్పుడు శబ్దరూప పరిణామము పొందినదిగా యుంటున్నది. కనుక శబ్దరూప పరిణామమగు ఈ సామాన్య జ్ఞానము ఏదోరూపములో సర్వమునందు యిమిడి యున్నది. జ్ఞాన రూపమగు బ్రహ్మము అణువణువున యిట్లు యిమిడి యున్నందున " ఆ బ్రహ్మస్తంభ పర్యంతం పరమాత్మ రూపకం " అని చెప్పబడినది.

చేతనములందు అనగా ప్రాణుల యందు ఈ సామాన్యజ్ఞానము అంతఃకరణతో కూడి భూతత్ధమము నందు ప్రవేశించిన సూర్యరశ్మి దాహక శక్తిని పొందిన రీతిగా జ్ఞానాజ్ఞానరూపములుగా మార్పు చెంది సర్వమును గుర్తించుచూ క్రియాకారకమైన కర్మ సంస్కారములను ప్రోగుచేసుకొని బంధకారణమగుచున్నది. అట్లుగాక తన సంగతి తనమూలము సంగతి విచారించి వివేక జ్ఞానముతో కృషి చేసినచో తన స్వరూప సాక్షాత్కారము పొందగలడు. పై వివరములను బట్టి తేలినదేమనగా జ్ఞానాజ్ఞానములు. ఎరుక మరుపులు రూపములలో మార్పుచెందుచున్నది. పరిపూర్ణము మార్పు చెందునదిగాదు. కావున మార్పులు చెందు జ్ఞానముపరిపూర్ణములో లేదని నిశ్చయముగా జెప్పవచ్చును.

**తదేవ జాతమిత్యుక్తం । తదేవంనశ్యతిశృణు** : వినుము । యెరుకయే పుట్టుచున్నది. పుట్టిన ఎరుకయే నశించుచున్నది. పరిపూర్ణ పరబాహ్యమందు ఎరుక తనంతకు తానే పుట్టుచున్నది, తానే నశించుచున్నది. పరిపూర్ణము ఎవరిని పుట్టించదు, ఎవరిని గిట్టించదు. అది దేనికి ఆధారము అధిష్ఠానముగా లేదు. శ్రీ కృష్ణదేశికేంద్రులవారు **క॥ప॥96. "పుట్టదు** గిట్టదు నొకరిని । పుట్టించదు చంపబోదు భూమ యెరుకదా । పుట్టును గిట్టును నొకరిని । పుట్టించును **సమయజేయు భూమకితరమై"** అని సెలవిచ్చియున్నారు. తనంతట తాను అక్షరరూపమున పుట్టును. ప్రళయ పద్ధతిగా చచ్చును. క్షరరూపమున కర్మాను గుణ్యంగా పుట్టును. కాలానుసారము చచ్చును. కనుక అచల పరిపూర్ణపరబయలుకు ఏలాంటి సంబంధములేదని భావము. మరియు క.ద **78, "మేలుక సుషుప్తిలోపల । యేలీలం తనకు దాను యేతెంచునో గుర్తాలీల బయలు లోపల । వాలాయము తనకు దానే వచ్చునో యన్నా । వచ్చి హెచ్చి చచ్చునోయన్నా!"** అని మరొక కందార్థ దర్పులో గానము జేసి యున్నారు. సుషుప్తి నుండి మెలుకువ తనంతట తానే ఎట్లు వచ్చునో అటు వలనే బయలు నందు గుర్తెరిగే ఎరుక తనంతట తానే ఎడతెగకుండవచ్చి, హెచ్చి చచ్చును అని భావము.

ఎరుక తనంతట తాను వచ్చి హెచ్చి ఎట్లు చచ్చుననగా ఆకాశస్వరూపము గల ఆకాశాధికమగు కూటస్థమగు ఎరుక ఆకాశము,వాయువు, అగ్ని,జలము, పృథ్వి, ఓషదులు, అన్నము,నరులుగా ఎడతెగకుండ అభివృద్ధి చెందును. మరియు ఊర్ధ్వమునందలి ఆదిత్య లోకమని, స్థావరజంగమ జీవనివాసము మర్త్యమని అధః భాగము పాతాళమని నిర్ణయించియున్నందున హిరణ్మయ కోశమగు ప్రత్యగాత్మను ఆయాలోక నివాసమునకు తగు కర్మ యొనర్చును. మరియు ప్రజ్ఞానంబ్రహ్మ అహంబ్రహ్మాస్మి, తత్వమసి బ్రహ్మ, అయమాత్మబ్రహ్మయను నిర్ణయ పద్ధతుల ద్వార కూటస్థ బ్రహ్మములో ఏకత్వ సిద్ధికి ప్రయత్నించును. లోకంబులు లోకేశులు ప్రళయము పొందినట్లు అయమాత్మ బ్రహ్మమని నిర్ణయించుకొన్న తాను విషయవాసనలో మరణించి ఆయాకర్మలు క్షీణించగానే జన్మాదులు పొందెదరు. ఈ విధముగా ఎరుక తనంతకుతానే పుట్టి తనంతకు తానే మరణించును.

**28. తస్యాపికారణంనాస్తి । సత్యం సత్యంపునః పునః**
**బాహ్యమభ్యంతరంనాస్తి । సర్వం బాహ్యేవినిశ్చను.**

ఈ జగత్తు పుట్టిన దనుటకు మరొక కారణము లేదు. అనగా మూలము లేదు. బాహ్యాభ్యంతరములు లేవు. సర్వము బాహ్యము నందే యున్నది.

**వివరములు :- తస్యాపి కారణం నాస్తి సత్యం సత్యం పునః పునః** : సర్వమునకు యెరుకే మూలకారణముగా నున్నది. కాని దానికి మాత్రము మూలము లేదు. సృష్టికి కారణ

వస్తువుగా ఏ బ్రహ్మమును ఇతరులు ప్రతిపాదించారో అదే ఎరుక. ఏ వస్తువును ప్రారంభముగా తీసుకొని కారణ పరంపరను విచారిస్తుపోయిన చివరకు అత్యంత మూలకారణ వస్తువు ఎరుకేనని తేటతెల్ల మౌతుంది. ఉదాహరణకు ఒక కుర్చీతీసుకొంటే దానికి మూలము కఱ్ఱ, కఱ్ఱకు మూలము చెట్టు. చెట్టుకు మూలము పృథ్వీ, దానికి జలం, అగ్ని, వాయువు ఆకాశము ఆత్మ (ఎరుక). ఇట్లు కారణపరంపర గోచరిస్తుంది. ఆత్మనుంచి యివి వరుసగా పుట్టిన వంటే ఆత్మకు కూడ పుట్టుక వుండి తీరాలి. ఎందుచేతనంటే పుట్టని దాని నుండి యితరము పుట్ట జాలదు. కనుక ఆత్మయనె ఎరుక దేని నుండి పుట్టు చున్నది? అంటే, వున్నవిరెండే. 1. అచలపరిపూర్ణము 2 లేనెరుక. పుట్టని పరిపూర్ణము నుండి ఏది పుట్టదు. దాని యందెట్టికారణబీజములు లేవు. పుట్టించే సత్తా కలిగినది, పుట్టేది కూడ యెరుకే. కనుక యెరుకకు ఎరుకే కారణమనాలి. అందుకే స్వతఃకారణమని, లేక స్వకారణమని స్వయం ప్రకాశమని స్వయం భూ అని ఈ లేనెరుక వర్ణింపబడుతున్నది. కనుక స్వకారణంగా తనకు తానే తోచింది లేక ప్రకటనమైనది అని అనాలి. ఉదాహరణకు విత్తనము నందు చెట్టు, చెట్టు యందు విత్తనము కలుగుట స్వకారణము. అట్లే యెరుక, మరుపు అను రెండు రూపాలుగా తోచబడే యెరుకయు పుట్టుచున్నది. ఎట్లనగా ఎరుక యందు మరుపు మరుపునందు ఎరుకే కలుగుచున్నవి. ఎట్లనగా ఎరుక సూక్ష్మమగు విత్తనము వంటిది. మరుపు స్థూలమగు చెట్టు వంటిది. బీజ వృక్షముల వుత్పత్తికి వేరే విత్తనము లేనట్టుగా ఎరుక మరుపుల వుత్పత్తికి వేరే మూలము లేదు.

**క.ద. 129 "చెట్టే మూలం విత్తుకు। చెట్టుకు మూలం విత్తు" అని, "మేనెరుకల రెండింటిలో దానిని యిది, దీని నదియు తగసృజియించు"** అని శ్రీ భాగవతుల కృష్ణదేశికేంద్రులవారు శెలవిచ్చియున్నారు. నేను (ఆత్మ) సూక్ష్మమగు ఎరుక రూపము, మేను (అనాత్మ) స్థూల స్వరూపము. ఈ నేను మేనులు పిండాండమందు గాక అధిష్ఠానము నందే అన్వయము చేసుకోవాలి. నేను మేనుల ఏకైక రూపమగు ఎరుకకు వేరే మూలం లేదు. పరిపూర్ణ మందు స్థానము కూడ లేదు. కనుక దీనిని లేనెరుక యన్నారు. పరిపూర్ణ పరబ్రహ్మము సకల దేశములందు. సర్వకాలముల యందు, సమస్తమైన వస్తువులందు వున్నది. కనుక కారణబ్రహ్మము (ఎరుక) తత్కార్యరూపమగు జీవేశ్వర జగత్తు ఈ పరిపూర్ణములోనే తోచవలెను. కాని అన్యస్థానము లేదు గదా! కనుక పరిపూర్ణము యెరుకకు అధిష్ఠానమైయున్నదనెడి అనుమానము కలుగును. అదిసరిగాదు. ఉ॥ కుందేలుకు కొమ్ముండదు. ప్రాణభీతిచే పరుగిడు నపుడు తన చెవుల రెంటిని నిక్కించి ఒక్క చోటికి చేర్చును. అది కొమ్మువలె భాసించును. కుందేటి కొమ్ము అనె పేరుకు కూడ ఆధారమున్నది. కనుక అది అలీకము కాదు.

**శ్లో ॥ ద్వితీయ కారిణాభావాదనుత్పన్నమిదం జగత్ ।**
**యద్వైవహినభశ్శూన్యం। జగశ్చూన్యం తథావహి ॥**

తా॥ రెండవ కారణము లేనివలన ఈ జగత్తు పుట్టనిదే. ఆకాశము యేరీతిన శూన్యమో ఆరీతిగానే జగత్తు శూన్యముగదా! శ్రుతి॥ "సర్వం వికారజాతం మాయా మాత్రం" నామరూప వికారములు కలిగి యుద్భవించినది సమస్తమును మాయా స్వరూపమైనది లేనిదే.

పై వివరముల బట్టి ఎరుక మూలమునకు కారణము లేదని, తెలియుచున్నది. కావున ఈ శ్లోకమున ఎరుకకు మూలము లేదని అది సత్యము, సత్యమని రెట్టించి నొక్కి చెప్ప బడినది.

**బాహ్యమభ్యంతరం నాస్తి । సర్వం బాహ్యేను వినిశ్చను :** అనగా పిండబ్రహ్మాండములకు బయట లోపల తోచబడున దంతయులేనిది. సర్వం బాహ్యేవినిశ్చను అనగా సర్వము పరిపూర్ణమందే తోచిన దనుట నిశ్చయము.

**శ్లో ॥ యస్యకించిద్బహిర్నాస్తి । కించి దంతఃక్రియచ్చన**

**యస్యలింగం ప్రపంచంవా । బ్రహ్మైవాత్మాన సంశయః ।**(కృ.య.37. తేజోబిందు)

తా॥ బాహ్యాభ్యంతరములనే వ్యవహారములు లేక, ప్రపంచమనే చిహ్నము లేక పరిపూర్ణమైనబ్రహ్మమే అచల పరిపూర్ణ పరబయలని చెప్పబడినది. ఇందులకు సందేహము లేదని పై ఉపనిషద్వాక్యము యొక్క అర్థము. అందుకే శ్రీ కృష్ణదేశికేంద్రులవారు. **క.ద 147.** "ఏపరిపూర్ణము మేనికి౹ లోపల వెలినిండి యుండు౹ లోపము లేకన్ । ఆ పరిపూర్ణమే జగతికి లోపల వెలినుండు దాని౹ లోనేవున్నవిరా॥ పై రెండెవ్వి లేని వెన్నకురా । ఈ పరిపూర్ణ బోధచే పై ప్రపంచ శరీర రూపము లెడబాపు । మీ పట్లనే దానిలోనే వున్నవిరా" అని శెలవిచ్చియున్నారు. అనగా అచల పరిపూర్ణకేవలాత్మ శరీరముల బాహ్యాభ్యంతరముల గలదో ఆ అచలపరిపూర్ణ కేవలాత్మనే జగత్తు యొక్క లోపల వెలుపల ములుగ్రుచ్చ సందులేక నిండియున్నది. ఈ శరీర జగత్తులులేనివి. కనుక వీరి రూపము, నామము, క్రియలను గలవని యెన్నకుమని కందార్థ వాక్యసారము, కనుక పరిపూర్ణ బోధ క్షరాక్షరోపాధి ద్వయ దోష రహితమని చెప్పబడినది. క్షరాక్షరోపాధి రహితమే జనన మరణ రహితము. కావున అంత పరిపూర్ణమునందే యున్నదనెటిది నిశ్చయము.

**29. నస్నానంనచధర్మశ్చ । నచకర్మన వర్తనం**
**బ్రహ్మవిష్ణ్వాదిదేవైశ్చ । వందితః పరమశివః**

జగత్తునకు వర్తించు ద్వంద్వ రూపమైన స్నానము, (మునక) ధర్మము మరియు కర్మ జీవనము లేక నడవడి పరబాహ్యమునకు లేవు. బ్రహ్మ విష్ణువు మొదలగు దేవతలచే పరమ శివుడు (పరిపూర్ణపరబ్రహ్మము) వంద్యుడు.

**వివరములు :- నస్నానం :** శరీర ఆరోగ్యము కొరకు స్నానం చెప్పబడినది. నదీస్నానము శ్రేష్ఠమందురు. జలము యొక్క సూక్ష్మాంశము ప్రాణము.ప్రాణ శుద్ధి పవిత్రత కొరకు స్నానం. అందు గురుపాదోదక స్నానము వలన స్థూల శరీరమగు అన్నమయకోశమునకే గాక సూక్ష్మశరీర సంబంధమగు ప్రాణమయ కోశమందలి ప్రాణ సత్తా పెంపగును.**"గురు పాదతీర్థం గ్రోలక కలుగునే విజ్ఞాన యోగానుభవము"** అని సీతారామాంజనేయ సంవాదము నందు జెప్పబడినది. కనుక శిష్యుడట్టి పవిత్ర పాదోదకమును "అజ్ఞాన మూలహరణం జన్మకర్మ నివారణం, జ్ఞాన వైరాగ్యసిద్ధ్యర్థం గురు పాదోదకం పిబేత్" అను శ్లోక భావము స్మరిస్తు భక్తితో పాదోదకం సేవించవలయును. "బ్రహ్మవిద్ బ్రహ్మైవ భవతి" అనే న్యాయముగా బ్రహ్మవేత్త బ్రహ్మమే కాని అన్యం కాదు. "బ్రహ్మవిద్యాగురువు" "గురుస్సాక్షాత్ పరబ్రహ్మ" అను పేర్కొనబడిన వాడు పాదములు శరీరము యొక్క కొసభాగమగుటచే పాదాంగుష్ఠముల నుండి జాలు వారిన వుదకము ద్వార గురుదేవుని యందలి ఆధ్యాత్మిక శక్తి ఆ పుణ్యోదకముల స్నానముచే శిష్య శరీరములోనికి ప్రవహించును. ఇంతటి మహాత్త్యము గల స్నానము పరిపూర్ణ పరబ్రహ్మమందు లేదని, ఈ శ్లోకమున వర్ణించబడినది. పరిపూర్ణము అపరోక్షమైన వానికి స్నానమెందులకు. "తానేలేనప్పుడు అది" అని యన్నప్పుడు నేను లేను, నేను లేనప్పుడు నేనుకు స్నామవసరము లేదని గ్రహించవలయును.

**నధర్మశ్చ :** పరిపూర్ణ పరబయలు నందు ధర్మాధర్మములు కూడ లేవు. ధర్మశబ్దమునకు "ధార్యతే ఇతి ధర్మః" అనే నిర్వచనానుసారము ఏది ధరించి భరించునో అది ధర్మము. సృష్టి స్థితి లయములన్నిటికి అత్యంత మూలకారణమైన పరమాత్మ స్థితి (కారణ బ్రహ్మ) అనగా సృష్టించబడిన సమస్తమును పోషించి కాపాడుటయే వానివాని నిర్ణయానుసారముగా అవి నశించు పర్యంతరము వానివాని స్థితి యందుంచుటయే. ఈ శక్తి సర్వశక్తి వంతుడగు పరమాత్మకే కలదు. కనుక పరమాత్మయే ధర్మ శబ్దవాచ్యుడు. మరియు ఏయే నిర్ణయములకు లోబడి ఈ విశ్వము నడుచుచున్నదో అవి అన్నియు ధర్మములే. ఆ ధర్మములకు లోబడియే పరమాత్మ విశ్వమును పాలించుచున్నాడు. అధర్మమునకు గ్లాని సంభవించినపుడెల్ల అతడవతరించి ధర్మ సంస్థాపనము చేయుచుండును. కనుక మానవులు యేది ధర్మమో ఏది అధర్మమో గుర్తెరిగి నడుచుకొనవలసియున్నది. అట్లు యెందుకు ధర్మపద్ధతిన నడువవలయునంటే "ఆత్మనో మోక్షార్థం జగద్ధితాయచ" అనగా తనయొక్క మోక్షము కొరకు, లోకహితార్థము కొరకు అని చెప్పబడినది. **"ధర్మోరక్షతి రక్షితః"** ధర్మాచరణములో ధర్మమును రక్షించినచో ధర్మమాతని రక్షించును. ధృతి, క్షమ, దమము, అస్తేయము, శౌచము, ఇంద్రియ నిగ్రహము, ధీ, విద్య, సత్యము, అక్రోధము ఈ పది ధర్మ లక్షణములుగా జెప్పబడినవి. మానవులందరు ఈ ధర్మలక్షణములతో జీవించుట విహిత ధర్మమై యున్నది. అధర్మమును వదిలివేయుటయే ధర్మము గాని ధర్మాధర్మములను వదిలివేయుమని క్రింది భ్రాంతి రహితశ్లోకము జెప్పుచున్నది.

**శ్లో॥ త్యజధర్మమధర్మంచ ఉభే సత్యానృతే త్యజ**
**వుభే సత్యానృతే త్యక్త్వా ్యేన త్యజసి తత్యజ॥**

అనగా ధర్మాధర్మములను, సత్యాసత్యములను వదలివేయుము. దేనిచేత వానిని వదిలి వేసితివో, దానినికూడ వదలివేయుము. ఇది ధర్మమని నిర్ణయించుటకు, ఆ ధర్మాధర్మములందు ప్రవర్తింపజేయుటకు గుర్తెరిగే శరీరమే కారణమై యున్నది. ఏలననగా గుర్తెరుగకుండా యెవరును యేకర్మచేయరు. ధర్మాధర్మాములను నిర్ణయము చేయునది ఈ గుర్తెరిగే శరీరమే. అనగా ఎరుకయే. ధర్మాధర్మములను విడువుమన్నారంటే ధర్మాధర్మములను నిర్ణయించి ధర్మములను గుర్తెరిగి ఆదరించుటయు మరొకటి అధర్మమని మానుటయు ఎరుక క్రియలే. కావున గుర్తెరిగె శరీరమును (ఎరుకను) విడువుమని ఆదేశించినట్లే. ధర్మమనగా ఆత్మయే. అధర్మమనగా అనాత్మయని అర్థము. అపుడు ఆత్మానాత్మలు (ఎరుక మరుపులను) వదిలివేయమని చెప్పినట్లగును.

పై వివరముల వల్ల విడువ వలసినదేదో తేటతెల్లమయినది. దేనిచేత విడువ వలయును. ఎరుక కానిదొక్క పరిపూర్ణమే. అది కేవలం నిష్క్రియము. దానిని ఒక పని ముట్టుగా జేసి దానితో ఎరుకను విడుచుట అసాధ్యము గదా! పరిపూర్ణ బోధచే పరిపూర్ణ మెరుకలను తెలిసి ఎరుకలేనిదే యని దృఢము చేసుకొన్న మీదట ఆ యెరుకయే బ్రహ్మమని తన పూర్వభావమును భ్రాంతిని పూర్తిగా వదిలి వేయుటయే ఎరుకను విడుచుట. ఇదంతయు భావనరూపమే. కనుక ఎరుక చేతనే పట్టి తీసివేయరాయని శ్రీ కృష్ణదేశికేంద్రువారు హితవు పలికినారు. విడిచేవాడు విడువబడేది, విడిచే పనిముట్టు (సాధన) మూడు యెరుకనే ఇది జ్ఞాతృ, జ్ఞాన, జ్ఞేయమనే త్రిపుటి. ఈ త్రిపుటిని విడుచుటయే పరిపూర్ణ బోధకుల లక్ష్యము. ఈ త్రిపుటి రహితమునందే శాశ్వత జనన మరణ రహితము **"నాన్యః పంథాऽయ నాయ"** మరొక మార్గము లేదు.

**నచకర్మవర్తనం :** కర్మయనగా పని "కృ" అను ధాతువు నుండి వ్యుత్పత్తి. పని చేయుకర్త, పూర్తి చేయబడిన పని, ఆపనికి చేయునట్టి క్రియ ఈ మూడు కర్త, కర్మ,క్రియ అనబడును. ఈ మూడు త్రిపుటి రూపముగా నుండి ఒక దాని కొకటి పూర్తిగా సంబంధ పడియున్నది.

కర్మయను శబ్ధమునకు పని యని, ఆ పని చేయుట వలన కలిగిన ఫలము అని రెండర్ధములు కలవు. చేసిన పని యొకటి, దాని ఫలము మరొకటి యుండదు. విత్తనము పడుట తోనే పండదు. ఒక పాపకార్యముగాని పుణ్యకార్యముగాని చేసినపుడు దాని పూర్ణఫలము కొంత కాలమునకు గాని గోచరము కాదు. కనుకనే దానిని అదృష్టఫలమని యందురు. సాధారణముగా పనిని బట్టి ఫలముండును. తపోదానాది సత్కర్మలెన్నో చేసి యీ జన్మమున ఎట్టి సుఖము ప్రాప్తించకనే గతించిన ఆ సుకృత ఫలమును జన్మాంతరమందైనా ఆయా కర్మ ఫలముల ననుభవించక తప్పదు.

**"కర్మమున బుట్టు జంతువు కర్మమునను వృద్ధిబొందు కర్మమున చెడున్**
**కర్మమె జనులకు దైవము కర్మము సుఖ దుఃఖములకు కారణమధిపా॥**

అని భాగవతములో కలదు. కర్మకు త్రికరణములనే మూడు పనిముట్లు గలవు. 1. మనస్సు. 2. వాక్కు. 3. శరీరము. ఈ మూడింటిలో ముఖ్యమైనది మనస్సు. ఏలననగా మనస్సు సంకల్పించనిదే, ఆలోచించనిదే వాక్కుచే మాట్లాడుటగాని, కర్మేంద్రియములచే పని చేయుట గాని జరుగదు. మనస్సంయోగములేక చేసెడి కర్మ, సౌష్టవముగాను, నిర్దిష్టముగాను నుండజాలదు. ఆ పనులకు పాప పుణ్యరూపకర్మ ఫలములుండవు. ఉచ్ఛ్వాసనిశ్వాస చేయుట, రెప్ప పాటు జరుగుట మొదలగు పనులు కర్మలేకాని అవన్నియు మనో ప్రేరణలేకనె జరుగుచున్నవి. పసి పిల్లలు చేయు పనులలో మనస్సు యొక్క సంకల్ప క్రియ యున్న ఆ పనుల యొక్క మంచి చెడ్డల గూర్చి తలపోయుదారుఢ్య రూప చిత్తవృత్తి లేనందున ఆపనులకు పాప పుణ్య ఫలప్రాప్తి యుండదు. కనుక పాపపుణ్య ఫలోత్పత్తి గలిగించు కర్మలే బాధాకరములు. అవియే సంస్కారముల యుత్పత్తి జేసి జన్మ పరంపరలు గలిగించును. ఇట్టి విశేషార్థములోనే "కర్మవలన జన్మ, జన్మ వలన కర్మ" యని కర్మ సిద్ధాంతం ప్రతిపాదించబడినది.క.ద. 292 **"ఎరుక నెరుంగని బయలులో। గురుడును శిష్యుండు వారి గొడవయునే మీ। కెరిగించిన వన్నియు, మీరెరిగినవన్నియును మీర లేనునుళ్ళక్కి। వుళ్ళక్కితా॥ నెప్పుడుళ్ళక్కి। మరియింక మాటాడ మాటలేదా యాను సరిపాయ॥ సరిపోతె సరిపాయ సరిమీర లేను నుళ్ళక్కి॥ ఉళ్ళకీతా నెప్పుడుళ్ళకీ"॥** అనగా మూలములేని ఎరుకను దెలియని అచల పరిపూర్ణ పరబయలందు గురువును, శిష్యుదును వారిరిరువురి యొక్క సంవాదమును నేను మీకు తెలిపిన వన్నియు మీరు తెలుసుకొన్నవన్నియు మీరు నేను మూలంలేని, ఎరుక లేనివారమగుటచే ఎప్పుడును లేనివారమే గనుక మాట్లాడుటకు పర, పశ్యంతి, మధ్యమ, వైఖరియను ఏ మాటలు లేవు. జనన మరణ రహిత విధానము సరిపాయను. సరిపోతే సర్వము ఉళ్ళక్కి యని భావము.

జ్ఞానికి ప్రారబ్ధములేదు. ఎట్లనగా ప్రారబ్ధ శరీరము ప్రత్యక్షముగా తోస్తువుంటే ప్రారబ్ధము లేదంటే ఎట్లు? ప్రారబ్ధ శరీరమున్నప్పటికి జ్ఞానికి ప్రారబ్ధనుభవము లేదు. సుఖదుఃఖ లక్షణములు జ్ఞాని శరీరమందు చూపరులకు ప్రత్యక్షముగా కానవస్తున్నను జ్ఞాని మాత్రం ఆ శరీర తాదాత్మ్యము లేని వాడై నేను దేహేంద్రియాదులకు విలక్షణమైన ఆత్మను.

నాకు జన్మ వ్యాధి జరా మరణాదులు లేవు అని ఆత్మ దృష్టి యందుండుటచే అతనికి సుఖదుః ఖానుభవము లేదు. అన్యుల దృష్టిలో అతనికి ఆ ప్రారబ్ధానుభమున్నట్లే దోచునుగాని సద్దృష్టిచే మాత్రం లేదు. సుఖ దుఃఖానుభవము మనస్సునకే. **ఆ మనస్సు ఆత్మతో తాదాత్మ్యము చెందినపుడు అదియే అమనస్క మనబడును.** మనస్సుగాని దాని అధిష్ఠానమగు ఆత్మగాని పరిపూర్ణమందులేనేలేదని ఆరూఢత జెందిన వానికి అనుభవించునది లేదు. కనుక అనుభవమే యుళక్కి యగును. తానే లేదు కనుక తనకు తోచిన సమస్తము తనతో కూడ యేమి లేదు. అట్టి ఆరూఢతతో యేకార్యము జేసిన చేసి చేయని వాడే యగును. కర్మత్రయ మీరీతిగా నశించిపోవుచున్నది. కనుక వేయించిన విత్తనము మొలకెత్త జాలనట్లు జన్మరాహిత్యము సిద్ధించును. పై వివరములలో పెర్కొన్న విధమును పరిశీలించిన స్నానము, ధర్మము, కర్మవర్తనము పరిపూర్ణమందు లేదు, పరిపూర్ణుడైన వానికి యెవి లేవు. 55 క.ద.॥ **"పాపములు పుణ్యములు। భువి ప్రాపించును। ఎరుక చేత భ్రమసినవారిన్ । ప్రాపింపవెరుక విడిచిన తాపసులను"** అని శ్రీ కృష్ణదేశికేంద్రులవారు శెలవిచ్చియున్నారు. అనగా ఎరుక చేత భ్రమసిన వారికి పాపములు పుణ్యములు కలుగును. ఎరుకను విడిచినటువంటి సాధువులను పాపములు పుణ్యములు అంటవు.

**బ్రహ్మావిష్ణ్వాదిదేవశ్చ । వందితః పరమశివః** ఇచట పరమశివయను పదము పరిపూర్ణపరబ్రహ్మమునకు పర్యాయ పదముగా వాడినారు. పరమశివము అనగా శివము కంటె (బ్రహ్మము) కంటే శ్రేష్టమైనదని అర్థముగా గైకొనవలయును. మరియు పరమ శివము అనగా సర్వశుభప్రదమైనది, మంగళకరమైనదని అర్థము. పరిపూర్ణము అపరోక్షమైన యెడల శాశ్వత జనన మరణ రహితము సిద్ధించుట కంటే మంగళకరమైనది మరొకటి వుందునా? కనుక దానిని శివమని భగవాన్ అని అచలమని మరెన్నో పేర్లతో వ్యవహరించుట గలదు. అట్టి పరమశివమునకు (పరిపూర్ణపరబ్రహ్మమునకు) స్థితి కర్తయైన విష్ణువు, సృష్టికర్తయైన బ్రహ్మ, మరియు ముక్కోటిదేవతలు స్తుతించి నమస్కరించుచున్నారని. ఈ శ్లోకం ఉద్ఘోషించుచున్నది. అనగా ఎరుకలేక సేవించుచున్నారు.

**30. దేహబాహ్యస్యమధ్యస్య అన్తరం వ్యాపిత శివః**
**నిర్గుణం నిశ్చలం బాహ్యం సర్వకాలేషు సంస్థితమ్.**

దేహమునకు (పిండ బ్రహ్మాండములకు) బయట మధ్య, లోపల అంతట సందు సమయములేక పరమ శివుడు వ్యాపించియున్నాడు. పరబాహ్యము నిర్గుణమై (సత్వరజోతమో గుణములు లేనిదై) నిశ్చలమై సర్వకాలము లందు (త్రికాలములందు భూత, వర్తమాన, భవిష్యత్కాలములందు) స్థిరముగా నున్నది.

**వివరములు :- దేహ బాహ్యస్య మధ్యస్య । అంతరం వ్యాపితం శివః :** ఇచట దేహమునకు బయట మధ్యలోపల అంతట సమయము సందులేక ఆ పరమశివుడు వ్యాపించియున్నాడు. ఇది వ్యష్టిభావము. సమిష్టిగా ఆలోచిస్తే దేహమందే చతుర్దశ లోకములు గలవు. ఈ విషయము భద్రాద్రిరామశకతము నందు ఈ క్రింది విధముగా పేర్కోబడినది.

**31. సీ॥ అతలంబు పాదముల్ వితలంబు గుల్భముల్ జంఘలు సుతలంబు జానులందు। నుండు తలాతలం బూరు యుగ్మము మహాతలము గుహ్యాము రసాతలమునుండు। కటిని పాతాళ లోకము నాభి భూలోకముందు భువర్లోక ముదరమందు స్వర్గంబు హృదియు వక్షము మహర్లోకంబు ఘనజన లోకంబు గళము బొమల మధ్యమందు**

**తపోలో కమమరు మూర్ధ్ని సత్యలోకంబు నీనివాస స్థలంబు ॥రమ్య॥**

అనగా అతలము - పాదములు, వితలము - మెడిమలు, సుతలము - పిక్కలు, తలాతలములు - మోకాళ్లు, మహాతలము -తొడలు, రసాతలము -గుహ్యము, పాతాళము - కటి, భూలోకము - బొడ్డు, భువర్లోకము -బొజ్జ, స్వర్గలోకము - హృదయము (రొమ్ము), మహర్లోకము - ఎద, జనలోకము - కంఠము, తపోలోకము - భ్రూమధ్యమము , సత్యలోకము -మూర్ధ్ని,ఈ విధముగా మన శరీరమందే పదు నాలుగు లోకములు గలవు. అట్లే అష్టదిక్పాలక స్థల నిర్ణయములు దిగువ పేర్కొనబడినవి.

1.భ్రూమధ్యము - ఇంద్రపురము - తూర్పు దిక్కు 2. కుడి కంటియందు - అగ్ని పురము - ఆగ్నేయ దిక్కు 3. కుడి చెవి యందు - యమపురము - దక్షిణ దిక్కు 4. కుడి పార్శ్వమందు - నైఋతి పురము - నైఋతి దిక్కు 5. పృష్ఠ మందు - వరుణ పురము - పశ్చిమ దిక్కు 6. ఎడమ పార్శ్వము - వాయువ పురము - వ్యాయువ్య దిక్కు 7. ఎడమ చెవి యందు - కుబేర పురము - ఉత్తరదిక్కు 8. ఎడుమ కటి యందు - శివపురము - ఈశాన్యమూల.అని భద్రాద్రి రామశతక కర్త వివరించి యున్నారు. సాంఖ్య శాస్త్రమును బట్టి అన్ని లోకములు మన శరీరము నందే గలవు. కావున దేహము బయట లోపల మధ్య ఈ పరిపూర్ణపరబాహ్యమే నిండి యున్నది. అట్లే బ్రహ్మాండమునకు బయట లోపల మధ్య అంతట పరిపూర్ణపరబాహ్యమే సందు లేక నిండియున్నది.

**నిర్గుణం:-** పరిపూర్ణపరబాహ్యము నిర్గుణమైనది. అనగా త్రిగుణములైన సత్వ, రజో, తమో గుణములు లేనిది. త్రిగుణములు అధిష్ఠానచేతనబ్రహ్మ మందే యున్నవి. ఈ త్రిగుణములు సూక్ష్మరూపములో యున్నవి. నిర్గుణ రూపముగా నున్న వస్తువు వలె తోచబడినను అందు గుణములు బీజరూపములో నున్నవని గ్రహించవలయును. ఈ గుణములన్ని తనయందుండి త్రిగుణాత్మకమగు జీవేశ్వర జగత్తుకు కారణము కాగలిగినది. కనుక ఈ బ్రహ్మమునే సర్వశాస్త్రములు జగత్కారణముగా పేర్కొనియున్నవి. జగత్తు అనగా దృశ్యాదృశ్యమగు సృష్టి. సృష్టి అంతయు మూడు భాగములుగా విభజించవచ్చును.

1. ఈశ్వర 2.జీవ, 3. జగత్తు లనేవి మూడు విభాగములు. ఇందు జీవేశ్వరులు అదృశ్యమగు సృష్టి, అనగా కానరాని జగత్తునకు సంబంధించినవారు.

2. ఈశ్వరుడన్నప్పుడు దేవతా సృష్టి అంతయు ఆ శబ్దము నందు యిమిడి యున్నది. ఈశ్వరుడు సర్వ శక్తి వంతుడు (Omnipotent) గదా? ముప్పైమూడు కోట్ల దేవతలు ఈశ్వర శబ్దము నందిమిడి యున్నారు.

3. జగత్తు అన్నప్పుడు ఖగోళ భూగోళములలో చేరిన పంచభూతాత్మకమగు సర్వప్రపంచము చేరి యుండును. ఈ బ్రహ్మమే సర్వసృష్టికి అధిష్ఠానము, మూలకారణమై యున్నది. అట్లు జగత్తునకు ఆధారముగా నుండుట దీని ఉప లక్షణములో నొకటి. మరియు సూక్ష్మాతి సూక్ష్మముగా నున్న ఈ బ్రహ్మమునకు సృష్టి కామన కలిగి స్థూలాతి స్థూలముగా పిండబ్రహ్మాండరూపములుగా జగదాకారమగు చున్నది. అదియే విరాట్ స్వరూపము.

ఈ బ్రహ్మము అచింత్యము, అవ్యక్తము, నిర్గుణము, జగత్తునకు మూలకారణమై వున్నదని కాని అదే శుద్ధ చిత్తమునకు గోచరిస్తూ జ్ఞాతవ్యమై, త్రిగుణవిధానమై జగత్స్వరూపముతో కూడి తానే అయి సర్వద్వంద్వ స్వరూపముగా ఏకానేకముగాను, అణు స్వరూపము, విభు స్వరూపముగాను కూడ తానే యైయున్నది. ఒక వంక మనో గోచరమగు

కేవల బ్రహ్మ లక్షణములు మరొక వంక మాయా లక్షణములు ఉభయాత్మికముగా నున్నది. కనుక ఇది మాయబ్రహ్మమే గాని కేవల పరిపూర్ణ పరబ్రహ్మముగాదు. కేవల గుణములు లేని నిర్గుణమైన దొక్క పరిపూర్ణపరబ్రహ్మమే.

**నిశ్చలం బాహ్యం:-** అనగా పరిపూర్ణపరబ్రహ్మము చలనము లేనిది, కదలనిది, అచలం అని అర్థము, పరిపూర్ణ పరబాహ్యము అంతట నిండి నిబిడీకృతమై యున్నది. కావున కదులుటకు వీలులేదు. కదలిక లేనిచోట శక్తి ఉత్పత్తి కాజాలదు. పరిపూర్ణ పరబ్రహ్మమందు చలనాంశరూపమైన ప్రాణము లేదు. శక్తి కూడ లేదు. కనుక అది చలించజాలదు. అది "నిశ్చక్తిః నిర్మలం" అని వర్ణించబడినది. అందుకే దానిని అచలం అని వ్యవహార్థమునకై వాడుట గలదు. **35 క.ప.॥ "కదలనిది కలదెన్నడు। కదలికగల దనిన దాని కగుపడదు మొదల్। కదలికలేదని గావున। ఇది పరమరహస్య। మెవ్వరెరుగరు దీనిన్॥"** అనగా పరబయలు అచలము పరిపూర్ణము గనుక అది ఏకాలమందు కూడ కదలదని నిర్ణయము మరియు శ్రీ కృష్ణదేశికేంద్రులవారు **36 క.ప. "కదలనిది కదిలెనన్నను। ముదమున వినదగదు వారి। ముచ్చటనెప్పుడున్ । కదలిన కదలని దెట్లగు నదిగావున కదలదనుచునమ్మదగు జుమీ॥"** అని అన్నారు. అనగా కదలని అచల పరిపూర్ణపరబయలు త్రిగుణ సామ్యప్రకృతి యందు కదులుచున్నదని ఎవరి నిర్ణయ పద్ధతులందు నిర్ణయించియున్నదో అట్టి నిర్ణయ పద్ధతులను సంతోషముతో విన దగ్గ మాటలు గావు. ఎందుకనగా కదలిక కలిగి యున్నట్లు తెలియుచున్నట్టి ఎరుక ఏకాలమందైన అచల పరిపూర్ణము కాజాలదు. కదలిక గల ఎరుక, కదలని పరిపూర్ణ పరబ్రహ్మము అన్యము అనగా వేరువేరు గనుక అచల పరిపూర్ణ పరబ్రహ్మము కదలదని నిశ్చలమైనదని తెలియవలయును.

**సర్వకాలేషు సంస్థితం :** పరిపూర్ణపరబాహ్యము సర్వకాలములందు చక్కగా స్థిరమైయున్నదని అర్థము. రెండు సంఘటనల మధ్య నున్న వ్యవధి యొక్క ప్రమాణము లేక పరిమితియే కాలమనవచ్చు. ఉ॥ సూర్యోదయము నుండి సూర్యాస్తమయము వరకు గల మధ్యకాలము పగటి కాలము. పరిమితితో నిమిత్తము లేకుండ కాలాన్ని నిర్దేశించాలంటే ఒక్క సంఘటనైన యుండక తప్పదు. ఒక సంఘటన యుంటే దానికి పూర్వము భూతకాలమని దాని అనంతరము దానిని దృష్టిలో నుంచు కొని భవిష్యత్ కాలమని, ఆ సంఘటన జరుగు కాలము వర్తమానకాలమని అనవచ్చును. ఏ సంఘటన లేకుంటే కాలమునకు ఉనికి లేదు.

ఇక పరిపూర్ణ దృష్ట్యా కాలము లేదు. పరిపూర్ణము ఎప్పటికి యేమార్పులు లేకుండ ఏకరీతిగా యున్నది దాని యందెట్టి సంఘటన లుండడానికి అవకాశము లేదు. కనుక పరిపూర్ణ దృష్ట్యా కాలమనేది లేదు. కాలము పుట్టుక పూర్వము, కాలమున్నప్పుడు కాలము పుట్టిన తర్వాత కూడ పరిపూర్ణ పరబ్రహ్మమున్నదని చెప్పుట కొరకే సర్వ కాలాలయందు యని చెప్పబడినది. యా మా సా మాయా అనే నిర్వచనము ప్రకారము కాలమును కూడ మాయా కార్యముగా లేక అందలి భాగముగా గుర్తించాలి. కనుక కాలముత్పత్తి స్థితి వృద్ధులు లేని పరిపూర్ణమెన్నడు కాదు. పరిపూర్ణమునకు కాలముతో ఎట్టి సంబంధము లేదు.
సృష్టియనె సంఘటన పురస్కరించుకొని, సృష్టికి పూర్వమని, సృష్టియున్నప్పుడని, ప్రళయానంతరమని కాలమును నిర్దేశించుచున్నాము. అద్వైతపద్ధతి యందు బ్రహ్మమునకు సృష్టి, స్థితి, లయములు తటస్థ లక్షణముతో జతపడియున్నది. అంతేకాని కాలమనేది అస్తి సిద్ధ పదార్థముగాదు. కేవలం భాతి సిద్ధపదార్థమే.

మరియు కాలము భూత భవిష్యత్ వర్తమాన కాలములుగా విభజించబడినది నిజముగా వర్తమాన కాలమనే దానికి పరిమితి ఒక లిప్తకాలము కూడ యుండదు. ఎందుకనగా మరు క్షణములోనే అది భూత కాలములోనే చేరిపోవును. ఏమైనను కాలత్రయములనేవి నిర్ణయములైనవి.

కాలత్రయము లందేగాక కాలమునకు పూర్వోత్తర మధ్యకాలములందు యెట్టి మార్పు లెరుగని పరిపూర్ణపరబాహ్మ్యమొక్కటే కాలము మీరినదగుటచేతను కాల నిర్ణయమే లేని దగుట చేతను అది కాలాతీతమని అనతగియున్నది. శ్రీ కృష్ణదేశికేంద్రుల వారు తమ కంద పద్యము **77న "నీ తండ్రి జనిన మీదట। నీ తనయుడు రాకమునుపు । నీ వున్నపుడున్ । యేతత్వమంతట గల । దాతత్వము నరసి మృషయని తలపుము మిమ్మున్"॥** అని సెలవిచ్చియున్నారు. అనగా నీ తండ్రి చనిపోయినప్పుడు నీకు కుమారులు కలుగక ముందు, నీ వున్నప్పుడు ఏ అచల పరిపూర్ణపరబయలు అంతట నిండి యున్నదో దానిని సద్గురు మూర్తి అనుగ్రహమున తెలిసి, నిన్ను, సకల ఆనందములను, అశాశ్వతములని విడువుమని భావము. అనగా పరిపూర్ణ పరబాహ్మ్యము సర్వకాలాల యందు యున్నదనుట నిశ్చయము.

**31. జాగ్రత్స్వప్నసుషుప్త్యాది । అవస్థా పంచకం నహి<br>షడూర్మి రహితో దేవః । షడంగైర్వర్జిత శివః**

పరిపూర్ణపరబాహ్మ్యమందు అవస్థా పంచకము అనగా 1. జాగ్రదావస్థ, 2. స్వప్నావస్థ 3. సుషుప్త్యావస్థ 4. తురీయావస్థ మరియు 5. తురియాతీతావస్థ యనెడు పంచావస్థలు లేవు. షడూర్ములు క్షుద, తృష్ణలు (ప్రాణధర్మములు) శోకమోహములు (మనోధర్మములు) జనన, మరణములు (దేహ ధర్మములు) లేవు. మానసిక ధర్మములు, ప్రాణ ధర్మములు, దేహధర్మములు లేవు. మరియు షడంగములు అనగా 1. ఆసనము 2. ప్రాణనిరోధము 3. ప్రత్యాహారము 4. ధారణము 5. ధ్యానము 6. సమాధి కూడ మంగళకరమైన శివము పరిపూర్ణపరబ్రహ్మము నందు) లేవు. **వివరములు :-**

**జాగ్రత్స్వప్న సుషుప్త్యాది అవస్థా పంచకము నహి:** పరిపూర్ణపరబ్రహ్మము నందు అవస్థా పంచకములు లేవు. అవస్థా పంచకములు - 1. జాగ్రదావస్థ 2. స్వప్నావస్థ 3. సుషుప్త్యావస్థ 4. తురీయావస్థ 5. తురియాతీతావస్థలు వీటిని గురించి తెలుసుకొందము.

**1. జాగ్రదావస్థ :** జీవుడు 25 తత్వములతో యేర్పడిన తనువును కూడి 14 యింద్రియ విషయముల ననుభవించుచు, నేత్ర స్థానమందు విశ్వుడనే పేర నిలిచి, సకల వ్యవహారములు చేయు చుండును. ఇదియే జాగ్రదావస్థ. స్థూల శరీరము, యింద్రియములు, జీవుడు, ప్రాణము, ఆత్మ, ఈ ఐదు చేరి జరుపునట్టి వ్యవహారము జాగ్రదావస్థ.

**2. స్వప్నావస్థ :** జీవుడు దశేంద్రియ సమన్వితమైన 17 తత్వములగు సూక్ష్మతనువును గూడి కంఠమునందు తైజసుడను పేరుతో జాగ్రత్త వ్యవహారక్రియల వలె చేయు చుండును. ఇదియే స్వప్నావస్థ. మేలుకొని చూడగ యేమియు లేదు. ఇతి సత్యము గాదు.

**3. సుషుప్త్యావస్థ :** జీవుడు అహంకార చిత్తములను కంఠమందుంచి మనో బుద్ధుల దీసికొని కారణదేహముల యొక్క హృదయములందు జేరి అజ్ఞాన సన్నిధి యందు నిలిచి ప్రాజ్ఞుడను పేర నుండును. ఇదియే సుషుప్త్యావస్థ.

**4. తురీయావస్థ :** జీవుడు మనస్సును బుద్ధి యందు లీనము జేసి మూర్ధ్నినందు ప్రత్యగాత్మయనే పేరున నిలిచి యుండును. ఇదే తురీయము. శరీరము మీద సర్పము బారినను స్మృతి లేక యుండును.

ఏదేని యొక సాధనచే పొందబడు స్వస్వరూప సాక్షాత్కార స్థితియే తురీయావస్థ.

**5. తురీయాతీతము :** జీవుడు బ్రహ్మతాదాత్మ్య స్థితిని దాటి నామ రూప నటన క్రియలు లేనిపరిపూర్ణపరబ్రహ్మను అపరోక్షము గావించుకొన్న స్థితియే తురీయాతీతావస్థ. దీనినే కైవల్య శరీర నిర్ణయ పద్ధతి, క్షరాక్షర ద్వయ దోషరహిత పురుషోత్తమ పద్ధతి అందురు. అవస్థాత్రయములు అనగా జాగ్రత్, స్వప్న, సుషుప్త్యవస్థలకు జ్ఞానము (బ్రహ్మము లేక ఆత్మ) సాక్షిగా యున్నది. ఈ జ్ఞానము ఊర్ధ్వపరిణామములో బ్రహ్మము అధో పరిణామములో జీవుడనబడును. ఈ రెండు చిత్తమనే క్షేత్రమున జరుగును. క్షేత్రజ్ఞుడు (రూపము) వాయువును చేరే వరకు లేకుండ పోవును. ఈ విధముగా బ్రహ్మము మారుచుండును. ఈ వ్యవహార మంతయు బ్రహ్మ ప్రకాశము వలననే సృష్టి స్థితి లయములు జరుగుచున్నవి.

జాగ్రదావస్థలో నుండే ప్రజ్ఞానము స్వప్నావస్థలో కొంత తగ్గును. తిరిగి సుషుప్త్యావస్థకు వచ్చినపుడు ఆ ప్రజ్ఞానము యేమి లేకుండ పోవును. ఈ పంచావస్థలు పరిపూర్ణమునకు లేవు.

**షడూర్మి రహితోదేవః :** ఇచట దేవః అనగా దైవమను పదమును పరిపూర్ణ పరబాహ్యమునకు పర్యాయ పదముగా వాడినారు. "అదెట్లనగా. దైవమనగా అఖండ స్వరూపమగు పరమాత్మ Supreme Consciousness అని అర్థము. ఈ అర్థములను మాత్రమే స్వీకరించినచో ప్రత్యగాత్మ పరమాత్మలు ఏక వస్తువే. ఉపాధి గతమైనప్పుడు దేహమున నుండి ప్రాణచలనము గలిగించి గుర్తుగా జ్ఞానములో నుండిన ప్రత్యగాత్మయని అందురు. నిరుపాధికమైనపుడు పరమాత్మ దైవమని చెప్పబడును.

విశేషార్థములో ప్రత్యగాత్మ పరమాత్మయను రెండు పేర్లు గల వస్తువు ఒక్కటే. గనుక ఆత్మ శబ్దముచే పరమాత్మనే గ్రహించి, దైవ శబ్దముచే దాని కన్యమగు పరిపూర్ణ పరబ్రహ్మముగా (కేవలాత్మగా) గ్రహించవలయును. "దివ్" అనగా ప్రకాశమని, జ్ఞానమని వ్యుత్పత్త్యర్థము. దేవుడనే మాట జ్ఞానరూపుడగు (చిత్స్వరూపుడగు) పరమాత్మకే అర్థము. కాని దైవ శబ్దముచే అత్యంతాతీమగు వస్తువు నుద్దేశింతురు. కనుక ఆ అర్థములో అత్యంతాతీమగు వస్తువు పరిపూర్ణ పరబ్రహ్మమే దైవమని పరిపూర్ణ భావజ్ఞులు వాడినారు. అందుకే శ్రీ కృష్ణదేశికేంద్రులవారు తమ కందార్థ దర్పులలో **38. " దేవుణ్ణి నిన్ను ఎరుగవు నీ విప్పటికెట్టి వారా। నేదెలెపద నీ। కీవెర్రి బోధ లెందుకు । కావున నద్దేవుణ్ణి యిదిగో । కనుగొనవోయీ । నామరూప కర్మాలేవోయీ । నీవా దేవుని లోన నిను లెస్స వెదకిన। న్నావవిలి ముచ్చాట నదుగోయి తెల్పెద।"** అని శెలవిచ్చియున్నారు. ఇచట దేవుడనగా నామ రూపనటలు లేని ఆ పరిపూర్ణ పరబ్రహ్మమే. నిన్ను అనుటలో అఖండ ఎరుక రూపగు పరమాత్మయే. కావున అట్టి దేవుని యందు (పరిపూర్ణపరబ్రహ్మమునందు) షడూర్ములు లేవు.

**షడూర్ములు:** క్షుద, తృష్ణ, శోకము, మోహము, జననము, మరణములను ఈ ఆరింటిని షడూర్ములనబడును. ఈ ఆరు, ప్రాణధర్మములు, మనో ధర్మములు, దేహ ధర్మములుగా జెప్పబడినవి: 1. ప్రాణ ధర్మము లేవనగా ఆకలి, దప్పులు 2. మనోధర్మము : శోకమోహములు. 3. దేహధర్మములు : జనన మరణములు.

ఆత్మకు ఈ షడూర్ములు లేవని గ్రహించుట ఫలమని ఇతరులు జెప్పుచున్నారు గాని ఇవన్ని ఆత్మకే కలవని పరిపూర్ణ భావజ్ఞుల దృఢ విశ్వాసము. అందుకే శ్రీ కృష్ణదేశికేంద్రులవారు **క.ద. 54,** పరిపూర్ణ మొకటి దక్క నితరమైన ప్రపంచమెల్ల దగ తెలియుము నీవెరుకే నని మది లోపల" అని అన్నారు. ఎందుకనగా పరిపూర్ణ మందుగాని దాని కన్యముగా

గాని యెరుక లేనేలేదు. కనుక ఆ లేనెరుక యందే ఈ జగజ్జీవేశ్వర నిర్మాణమంతయు జరిగినది. **"ఆత్మవస్తు కామాయ సర్వం ప్రియం భవతి"** అనుటలో తనకు తన యందు ప్రేమ యున్నంత కాలము అన్నిటియందు ప్రేమ పోజాలదు. అనగా స్వార్థరహితము కావాలి. అనగా నేను (ఆత్మ) యనునది పోవాలి. **క.ద 52 "ఆటాడించెటివాడు అతడే రాకర్త, అన్నిటికి అచలమకర్త"** అని శ్రీ కృష్ణదేశికేంద్రులవారు గట్టిగా నొక్కి చెప్పియున్నారు. అంటే ఆటాడించే ఆత్మ బ్రహ్మమునకే ఈ దేహ, మనో, ప్రాణధర్మములైన షడూర్ములున్నవి కాని పరిపూర్ణపరబ్రహ్మమందు లేవు. పరిపూర్ణపరబ్రహ్మము ఏది లేనిది, ఏదికానిది నేనులేనిది.

**షడంగైర్వర్జితశ్శివః :** మంగళకరమైన ఆ (పరిపూర్ణపరబ్రహ్మమందు) శివము నందు షడంగములని జెప్పబడిన : 1. ఆసనము 2. ప్రాణనిరోధము 3. ప్రత్యాహారము 4. ధారణము 5. ధ్యానము 6. సమాధియనునవి లేవని చెప్పబడినవి. వాటిని ఒక్కటొక్కటిగా తెలుసుకొందము.

**1. ఆసనము :** ఆసనమనగా స్థిరముగాను, సుఖముగాను శరీరము నుంచుట. ఆసనము స్థైర్యమును, ఆరోగ్యమును కలిగించి అంగ లాగవమును పోగొట్టి సాత్విక బుద్ధిని స్థిరత్వమును కలుగజేయును. రోగ నిరోధమందు సహాయపడును. ఆసనములు 84 గలవు. వానిలో సిద్ధాసనము, భద్రాసనము, సింహాసనము, పద్మాసనము నాలుగు శ్రేష్ఠములు.

**2. ప్రాణ నిరోధము :** దీనినే ప్రాణాయామమందురు. ప్రాణ నిరోధమనగా ఉచ్ఛ్వాస నిశ్వాసల గతి, విచ్ఛేదము అనగా రేచక (లోని వాతమును బయటకు నెట్టి) పూరక (బాహ్యావాయువు పీల్చి) కుంభక (గాలిలోన స్థంబింపజేయుట) ములను జేయుట. క్రమముగా యధాశక్తిని ఉచ్ఛ్వాస నిశ్వాసముల సంఖ్య తగ్గించి కాలము వృద్ధిచేయవలయును. ఈ విధముగా అభ్యాసము చేయుట వల్ల పూరక రేచకములకై ఎంత తక్కువ గాలితో ప్రాణములు శరీరము నందు పీల్చునట్లు తీసుకొని వచ్చి చివరకు యోగి పూర్తిగా గాలిని నిలిపివేయగలడు. ఇట్లు కొన్ని నిమిషములు కొందరు, గంటలు కొందరు, దినములు కొందరు వుండగలరు.
ఇట్టి ప్రాణాయామముచే లోహాదులగ్ని యందు దహింపజేయగ ఎట్లు మాలిన్యము కోల్పోయి శుద్ధమగునో అట్లే యింద్రియములు దహించి శుద్ధమగును.

**3. ప్రత్యాహారము :** బాహ్యేంద్రియ వృత్తులను విషయముల నుండి సంక్షేపించి ఆ యింద్రియములందే స్థాపించియుంచుట. దీని వలన ఇంద్రియములు వశ్యమగును మరియు విషయాభిముఖముగా పంపినను అవి పోకుండ నిలిచి యుండును.

**4. ధారణ :** హిరణ్మయ కోశము నంచును, దాని ఆవరణములగు ఆనంద, విజ్ఞాన, మనోమయ, ప్రాణమయ,అన్నమయ కోశము నందును, వ్యష్ట్యన్నమయావరణ మగు సమిష్ట్యన్నమయ కోశము నందు సమిష్ట్యన్నమయ కోశాంతరములగు సమిష్టి ప్రాణమయకోశము, దాని అంతరమందు సమిష్టి హిరణ్మయ కోశమందును నీ సర్వమునకు మూలకారణమగు అధిష్టాన చేతన బ్రహ్మము యొక్క యంతర్బాహ్యము లందును పరిపూర్ణమున్నదియను నిశ్చయము ధారణ యని చెప్పబడును. సద్గురు కృపాకటాక్షముచే వస్తు నిశ్చయజ్ఞానము కలిగి ధారణ యొనర్చు మానవుని సర్వకోశములు మహావాయువుచే జలము శోషించబడిన మేఘ సందోహముల మాడ్కి నిర్జీవంబులై యుండును. కాని కేవల భావనా మాత్రముచే నా కోశావరణ రహితత్వమెంత మాత్రము గాజాలదు.

**5. ధ్యానము :** జీవేశ్వర జగదోపాధులకు కారణమైన స్వప్రకాశ చేతన బ్రహ్మ పరిపూర్ణ పరబ్రహ్మమునందు ద్రవరూపమగు ఎండమావులు జలము వంటిదని గురుబోధచే నెరిగి సర్వకాల సర్వావస్థల యందు వస్తు నిశ్చయము కలిగి తన్నిశ్చయమందు స్థిరత్వమెల్లప్పుడు

నుంచుట ధ్యానమని చెప్పబడును.

**6.సమాధి :** సమాధి యనగా బుద్ధిని నిశ్చలత్వము గావించుట మాత్రమే. మనస్సు నిశ్చయ స్థితికి వచ్చినచో దానికి బుద్ధియని పేరు. మనో నాశనమై అఖండబ్రహ్మాకారవృత్తి యందు బుద్ధియు నుండజాలదు. ఉత్తర గీత యందు సమాధిని గురించిన ఈ శ్లోకమును పరిశీలించగలరని మనవి:

**శ్లో॥ ఆకాశం మానసం కృత్వా, మనః కృత్వానిరా స్పదం**
**నిశ్చలస్తం విజానీయాత్సమాధిస్థస్య లక్షణం॥ ఉ.గీ॥ 1-33**

తా॥ ఆకాశమును మనస్సుగా నొనరించి, మనస్సును నిరాస్పదమైన దానిగా చేసి (శూన్యం రూపంగావించి) నిశ్చలత్వమును గుర్తెరుగుటే సమాధి యని భావము.
పై వివరము లందు జెప్పబడిన పంచావస్థలు, షడూర్ములు, షడంగములు శుభప్రదమైన, మంగళకరమైన పరమశివము పరిపూర్ణపరబ్రహ్మము నందు లేవని తెలియవలయును.

**32. సర్వకాలే సదావ్యాప్తం । సర్వదేశేషు వ్యాపితమ్**
**నిష్కామం నిర్మలం శుద్ధం । అచలం శబ్ద వర్జితమ్**

పై పేర్కొనబడ్డ సర్వమంగళకరమైన శివము పరిపూర్ణపరబాహ్యము సర్వకాలే యనగా భూత, భవిష్యత్ వర్తమాన కాలములనెడి నిర్ణయములు, లేక వ్యాపించి యున్నది. సర్వప్రదేశములందు వ్యాపించి యున్నది. అట్లేపరిపూర్ణపరబ్రహ్మము ఎట్టి కోరికలు లేనిది, శుద్ధమై నిర్మలమైనది. ఈ అచలము శబ్దమును వదిలినది అనగా శబ్దములేనిది.
**సర్వకాలే సదావ్యాప్తం :** పరిపూర్ణపరబాహ్యము సర్వకాలములందు ఎల్లప్పుడు వ్యాపించియున్నదని అర్థము. ఈ కేవలాత్మ అనగా పరిపూర్ణపరబ్రహ్మము కాలాతీతమైనదని శ్రీ పరుశురామ నరసింహదాసుగారిచే ఈ విధముగా వర్ణించబడినది.

**వివరములు :- 100 సీ॥ బ్రహ్మాకల్పంబులు ప్రతియుగంబులుగాదు సంవత్సరములు మాసములు గాదు. పక్షముల్ తిథివార నక్షత్రములు గాదు గ్రహ యోగ కరణ లగ్నములు గాదు। పర్వతములు ఋతువులు పగలు రాత్రులు గాదు వెలుగు చీకటి మేఘములును గాదు। ఉదయాస్తమయములు నుపరాగములు గాదు త్రివిధకాలముగాదు దిశలు గాదు। నాద బిందు కళలు గాదు నభము గాదు జీవ నిర్జీవులునుగాదు కేవలాత్మ ॥రమ్యగుణ॥**
తా॥ కేవలాత్మ, బ్రహ్మ కల్పములు, యుగములు సంవత్సరములు, మాసములు, పక్షములు, తిథివారనక్షత్రములు గ్రహ, యోగ, కరణ, లగ్నములు, పర్వతములు ఋతువులు, పగలు రాత్రులు, చీకటి వెలుగులు మేఘములు, ఉదయాస్తమయములు, చంద్ర సూర్యగ్రహణములు, త్రివిధకాలములు, దిశలు, నాదబిందు కళలు, ఆకాశము, జీవ నిర్జీవములు మొదలైనవిగాదు. రెండు సంఘటనల మధ్యనున్న వ్యవధి యొక్క ప్రమాణము లేక పరిమితియే కాలము. కాలమును నిర్దేశించుటకు ఏదో ఒక సంఘటననైన యుండవలయును. ఒక సంఘటన యుంటే దానికి పూర్వము భూతకాలమని, దాని అనంతరము దానిననుసరించి భవిష్యత్ కాలమని, ఆ సంఘటన జరుగు కాలము వర్తమానకాలమని అనవచ్చును. ఏ సంఘటన లేకుంటే కాలమునకు ఉనికి లేదు.

పరిపూర్ణ దృష్ట్యా కాలములేదు. పరిపూర్ణము ఎప్పటికి యేమార్పులు లేకుండ ఏకరీతిగా యున్నది. దాని యందెట్టి సంఘటనలు వుండుటకు వీలు లేదు. కనుక పరిపూర్ణ దృష్ట్యా కాలమనేది లేదు. కాలము పుట్టుక పూర్వము కాలమున్నప్పుడు కాలము పుట్టిన

తర్వాత పరిపూర్ణపరబాహ్యామున్నదని చెప్పుటకే సర్వకాలాల యందు చెప్పబడినది. కాలత్రయము లందేగాక " కాలమునకు " పూర్వోత్తర మధ్య కాలములందు యెట్టి మార్పు లెరుంగని పరిపూర్ణ పరబాహ్యా మొక్కటియే కాలమును మీరియున్నదగుట చేతను కాలనిర్ణయమే లేనిదగుట చేతను అది కాలాతీతము అన తగియున్నది. (విశేషవివరములకై 30 వ శ్లోకమును చూడుడు)

**సర్వదేశేషు వ్యాపితం :** పరిపూర్ణ పరబాహ్యాము సర్వదేశాల యందు వ్యాపించియున్నదని అర్థము. దేశము అనగా ప్రదేశము లేక చోటు Space. సర్వదేశాలయం దంటే అది లేని చోటు లేనే లేదన్నమాట. వస్తువును ద్రవ్య మంటారు. వైశేషిక దర్శనము నవ విధ ద్రవ్యముల నిర్ణయించినది. అవి. 1. పృథ్వి 2.జలము, 3.అగ్ని 4. వాయువు 5.ఆకాశము 6. కాలము 7.దిక్కులు 8. మనస్సు 9. ఆత్మ అనునవి నవ విధ ద్రవ్యములు. ప్రతి ద్రవ్యమునకు ద్రవ్య, గుణ, కర్మ, సామాన్య, విశేష, సమవాయ అభావములనే యేడు లక్షణాలుంటాయి. పరిపూర్ణ పరబ్రహ్మామందు ఈ నవ విధ ద్రవ్యములుగాని, వాని లక్షణములు గాని లేవు. అది ద్రవ్యము కానే కాదు. ద్రవ్యములన్నియు ఆ పరిపూర్ణ పరబ్రహ్మామునందు అభావస్థితిని పొందుచున్నవి. అయినను వస్తువు లేక ద్రవ్యమును ఒక ప్రదేశమును ఆక్రమించునట్లు గోచరిస్తుయున్నది. అవకాశరూపమైన ఆకాశము వస్తువు యొక్క బాహ్యాభ్యంతరములందున్న, స్థూల దృష్టికి వస్తువు వల్ల అఖండరూపమైన ఆ ఆకాశము ఖండ ఖండములైనట్లు వస్తువు నందు లేనట్లు గాను గోచరిస్తున్నది. కనుక సకల దేశము లందని ఆగక సమస్తమైన వస్తువులందు అని కూడ చేర్చినారు. వస్తు జాతముచే ఖండమైనట్లు ఆకాశము కానవస్తున్నందుననే సకల దేశాల యందు అను బహు వచన ప్రయోగము చేయబడినది. కనుక వస్తు రూపముగా తోచబడి వాని అన్నిటి బాహ్యాభ్యంతరముల యందు పరిపూర్ణ పరబ్రహ్మామే నిండి యున్నదని సిద్ధిస్తుంది.

**నిష్కామం :** పరిపూర్ణ పరబాహ్యాము నిష్కామము అనగా ఎట్టి కోరికలు లేనిది. "కోరుట కామంబు" అంటున్నారు. అపేక్ష యనగా కోరికనే. అప+ఈక్ష = అపేక్ష. అప యనగా చెడ్డదైన, ఈక్ష=చూపు. అపేక్ష యనగా చెడ్డచూపు లేక కోరికతో కూడిన చూపు. కోరికలన్ని చెడ్డవే అని చెప్పబడినవి. ఎందుచేతననగా కోరికలు సిద్ధించినచో సంతోషము కలిగి అంత కంటె పెద్ద కోరికలు కలిగించుచున్నవి. సిద్ధించనిచో దుఃఖము కలుగును. కోరికలు సిద్ధించుటకు అడ్డుతగిలిన వారి యందు క్రోధము కలుగును. చివరకు ఆ క్రోధమే మృత్యువునకు దారి తీయును. కనుక కోరికలేమియు యుండరాదని సిద్ధాంతము. అయితే కొందరు మోక్షాపేక్ష కోరిక కాదని, అట్టి కోరిక యుండతగినదని చెప్పుదురు. ఇందుకు విరుద్ధముగా నిరాలంబోపనిషత్ **"కేవలం మోక్షాపేక్ష సంకల్పోబంధః"** అనగా మోక్షాపేక్ష సంకల్పము కూడ బంధమే అని చెప్పుచున్నది. ఆత్మస్థానమే మోక్షము కనుక ఆత్మైక్యము పొందుట మోక్షస్థానమని ఇతరులంటారు. ఇట్టి మోక్షము జన్మ రాహిత్యము కలిగించజాలదు. ఏలననగా ఆత్మ, తన స్థితి నుండి చ్యుతమై జీవేశ్వర జగద్రూపముగా పరిణమించుచున్నది. అట్లే మరల మరల పరిణామము చెందునపుడు యిక జన్మరాహిత్యము కలుగజాలదు గదా! కనుక మోక్షాసక్తి కూడ నొక కోరికయే. కనుక మోక్షాపేక్ష సహితముగా అన్ని కోరికలు దూష్యములే. గుర్తెరిగే తెలివి యున్నంత వరకు ఈ కోరికలు కలుగుచునే యుండును. ఈ గుర్తెరిగే జ్ఞానము (యెరుక) పరిపూర్ణ మందు లేనేలేదు. పుట్టనేలేదు. అని ఆరూఢత చెందనంత

వరకు ఇట్టి కోరికలు కలుగుచునే యుండును. చిదిమిన కొద్ది చిగుర్చుచునే యుండును. ఎందుకనగా సకల సంకల్పములకు, కోరికలకు అత్యంత మూలకారణము గుర్తెరిగే జ్ఞానమే. కనుకనే శ్రీ కృష్ణ దేశికేంద్రులవారు క.ప.74. **"ఏ యాపేక్ష జనించిన। నా యాపేక్ష లెల్లమాయ। యని తెలియదగున్। ఆయాసమౌనుదానను । ధీయని యవి విడవదగు క్షేమము కొరకై"** అని చెప్పినారు. ధారేషణ, ధనేషణ పుత్రేషణ యను ఈషణ త్రయములే గాక కీర్తి యందపేక్షచేకూడ నరులు బద్ధులగుచున్నారు.

పరిపూర్ణభావజ్ఞులు గుణాతీతులు. వీరు కర్తృత్వ అభిమానము లేకనే సకల కార్యములు చేయుదురు. పుణ్యఫలమును కూడ ఆశించరు. ప్రజాహిత కార్యములు చేయుటలో తోడ్పదురు. కీర్తి కొరకు పరితపింపరు. పరిపూర్ణ పరబ్రహ్మ మందు గుర్తు (జ్ఞానము) లేదు. తాను సంపూర్ణముగా లేకుండ పోవలయుననియే వారి ఆశయము. పరిపూర్ణము నిర్మలమైనది అందు ఎట్టి కోరికలు లేవు.

**నిర్మలం :** నిర్మలమనగా మలినము లేనిది. మలము అనగా మలినము. వేదాంత శాస్త్రము నందు మలములు మూడుగా నిర్ణయింపబడినవి. ఆ మూడుమలములు 1. అణవమలము 2. మాయా మలము 3. కార్మక మలము అని విభజించబడినది.

**1. అణవ మలము :** పరమాత్మ నెరుగక సంసారవారధిలో మునుగుట అణవ మలము.

**2. మాయా మలము :** పరద్రవ్యాపేక్షచేత పరుల కప్రకృతి చేయుట మాయా మలము.

**3. కార్మిక మలము :** జనన మరణ హేతువైన పుణ్యపాపములు చేయుట కార్మిక మలము. మలములన్నియు వ్యష్టి రూపమైన అంతఃకరణమునకు జెప్పబడినవి. వ్యష్టి సమిష్టి రూపమైన అంతఃకరణముగా పరమాత్మ పరిణమింపక పూర్వము ఈ మలము లందుండుటకు తావు లేదు. అనేక పూర్వ జన్మల కర్మవాసనలు అంతఃకరణములో క్రమశః ఘనీభవించి ప్రాణుల యొక్క శీలసంపదయు వారి ప్రవృత్తియు నేర్పడి జీవులను నూతన కర్మలకుప్రేరేపించుచున్నవి. ఈ ప్రేరణకు పై విధముగా పరమాత్మ యొక్క బాధ్యత యేమి లేదు. **"బుద్ధి కర్మాను సారణీ "** అను న్యాయముగ ఈ ప్రేరణలకు జీవుల వ్యష్టి అంతఃకరణములే కారణము కనుక ప్రళయ కాలమందు సకల జీవోపాధుల యొక్క కర్మవాసనలు పరమాత్మస్థానమందే బీజరూపముగా నుండుట వలన వానికి పరమాత్మయే కడపటి శరణాలయమై యున్నది. అయినను తనయందే వున్నప్పటికి పరమాత్మ వానిని అంటక వాని వల్ల బాధింప బడక నిర్వికారముగా యుండును. కనుక పరమాత్మ "నిత్యశుద్ధ పవిత్రోసౌ" అని కీర్తింపబడుచున్నాడు.

సృష్టికి పూర్వము పూర్వాపూర్వ స్మృతుల యందలి జీవసంస్కారము లన్నియు పరమాత్మ యందే నిక్షిప్తమై యుండి ఉత్తరోత్తర సృష్టుల యందు ఎవరి సంస్కారములు వారు గైకొని జీవులు మరల జన్మించుచున్నారు. సృష్టి యందు తోచు వైవిధ్య మంతయు పరమాత్మ యందే అణగి మణిగి సృష్టిలో నామరూపములు దాల్చుచుండును. ఈ విధముగా జూచినచో పరమాత్మ కేవలం నిర్మలుడు కాడు. సృష్టిలో నున్న సమస్తమునకు ఆ పరమాత్మయే, బీజరూపముగా నున్నాడు. బీజము నందు వృక్షమంతయు యిమిడి యున్నందున పరమాత్మ శుద్ధ నిర్మలుడనుటకు వీలు లేదు. శుద్ధ నిర్మలమైనదొక్క పరిపూర్ణ పరబ్రహ్మము మాత్రమే. పరమాత్మయందు కేవల నిర్మలత్వము లేదు. సాపేక్షికముగా మాత్రమే సృష్టి యందలి మలినాంతఃకరణముతో పోల్చినప్పుడు మాత్రమే నిర్మలమని చెప్పబడును.

**శుద్ధం :** పరిపూర్ణ పరబాహ్యము శుద్ధమైనది. అనగా తెల్లనిది, స్వచ్ఛమైనది, దోష

రహితమైనదని అర్థములు గలవు. తెల్లనిది అనగా తెలుపువర్ణముగలది. సూర్య కిరణములను విశ్లేషిస్తే వచ్చు ఏడు రంగులలో తెలుపు, ఒక వర్ణము గాదు. గాని అన్ని వర్ణముల యొక్క సంశ్లేషము నందు గలుగు వర్ణము తెలుపుగా వర్ణింపబడినది. అయినను సూర్యకిరణముల యొక్క ప్రకాశము మల్లెపూవు వలె తెల్లగా నుండదు. అది స్వచ్ఛమైనది గా (అనగా దాని యందితర వర్ణములు లేనట్లుగా) తోచిన దాని యందు అన్ని రంగులు వుండనే వున్నవి. అట్లే బ్రహ్మము యొక్క స్వరూపము శుద్ధమైనది స్వచ్ఛమైనదని వర్ణించబడిన సమస్తము వర్ణాత్మకమైనదిగా తోచబడిన, ఉపాధులను పొందే దోషములు మాత్రము దానికి స్వాభావికమై యున్నవి. క్షరోపాధి, అక్షరోపాధి ద్వయముగా పరిణమించు దోషము దాని యందే గర్భీకృతమైనది. **"నిర్దోషం హి సమంబ్రహ్మ"** అని చెప్పబడినప్పుడు కేవల దోషరహితమైనది పరిపూర్ణ పరబాహ్యమొక్కటే యని తెలియవలెను. దానిని క్షరాక్షరోపాధి ద్వయ దోషరహితమని శ్రీ కృష్ణదేశికేంద్రుల వారు సెలవిచ్చియున్నారు.

**అచలం శబ్ద వర్జితం :** పరిపూర్ణ పరబ్రహ్మము శబ్దము లేనిదని శ్రీ కృష్ణదేశికేంద్రుల వారు తమ కందార్థదర్పు**122లో "పంచాదశక్షరముల । ప్రపంచము తానుద్భవించె । ప్రణవాంక్షరమం। । దంచు శ్రుతులెన్నె। దా నెరుకంచని నీవెరిగి । యెరుగు మచలాము దీనన్। నిల్పకు మెరుక నచలాములోనన్"।** అని గానము చేసినారు. దీని భావమేమనగా మనము మాట్లాడే వాగ్రూపము యేబది అక్షరములచేత శబ్ద విస్తీర్ణమైన ప్రపంచము పుట్టినది. ఇందుకు కారణము ప్రణవాక్షరమని శ్రుతులు నిర్ణయించినవి. ఆ ప్రణవము కూడ ఎరుక నిర్ణయమని తెలిసి కొనుము. మరుయు మరొక క.ద.**47 లో కూడ "ఎరుకే విద్యావిద్యలు । యెరుకే ప్రణవంబు నాద। మెరుకే కళయున్"** అని చెప్పుటచే ప్రణవము ఎరుకనే. ఏబది అక్షరముల చేత శబ్ద విస్తీర్ణమైన ప్రపంచము ఎట్లు పుట్టినదనగా కర్మ నిర్మితమగు వేదంబులు, జ్ఞాన నిర్మితములచే ఊర్ధ్వ అధోముఖంబులు నిర్ణయించి యున్నారు. కనుక యిది శబ్ద నిర్మిత ప్రపంచముగా నున్నందున పంచ దశక్షరముల ప్రపంచమన్నారు. శ్రుతి **"ప్రణవోయీపరం బ్రహ్మ, ప్రణవశ్చపరస్మృతః"** అనగా ఓంకారము నిశ్చయముగా పరబ్రహ్మము. ప్రణవమే పరమాత్మయని చెప్పబడుచున్నది. గనుక వాచ్యము (వాక్కు) బ్రహ్మమునకు (అక్షరము) వాచకమగు ఓంకారము వేరుకానందున ఓంకారము ఏ బది యక్షరములకు మూలమని నిర్ణయము. శ్రుతి **"యతో వాచనివర్తంతే అప్రాప్య మనసాసః"** యను నిర్ణయానుసారము మనో వాక్కులు పరబయలును తెలుసుకొనలేకపోవుచున్నవి. కనుక వాచకమగు ఓంకారము, వాచ్యమగు బ్రహ్మము లేక పోవునని నిర్ణయము. అంటే పరిపూర్ణ పరబ్రహ్మము నందు ఓంకారము, వాచ్యమగు బ్రహ్మము లేదు కనుక అచల పరిపూర్ణ పరబ్రహ్మము శబ్దవర్జితమని తెలియవలయును.

**33. తేజోంధకారరహితం । బాహ్యం బ్రహ్మనసంశయః**
**సచ్చిదానంద రూపత్వం । మాయా ఇత్యభిధీయతే ॥**

చీకటి వెలుగులు లేని పరిపూర్ణ పరబాహ్యమే బ్రహ్మము. కావున అనుమానము వలదు. సత్, చిత్ ఆనంద రూపమే మాయయని చెప్పబడుచున్నది.

**వివరములు :- తేజోంధకార రహితం । బాహ్యం బ్రహ్మనసంశయః :** చీకటి వెలుగులు లేని పరిపూర్ణ పరబాహ్యమే బ్రహ్మము. తేజోంధకారములను విచారిస్తే వెలుగుంటేనే నీడ

రూపమగు చీకటి వస్తుంది. వెలుగు లేనిచో నీడగాని చీకటిగాని యుండదు. ఏదైన ఆవరణ వస్తే ప్రకాశము నందు చీకటి వస్తూవున్నది. ఆ ఆవరణము తొలగిస్తే ఎప్పటికి ప్రకాశమే. నిజముగా ఎప్పటికి యుండేది ప్రకాశమే. కనుక ఆవరణము తొలగిస్తే చాలదా అని కొందరన వచ్చును. ఇందుకు పూర్వ పక్షముగా ఈ క్రింది విధముగా ఎందుకువాదించరాదు. ఎప్పటికి యున్నది చీకటే. దాని యందు ప్రకాశము వచ్చి పోతున్నది. బ్యాటిరీలైటు వేస్తే చీకటిలో కొంత భాగము వెలుగు వ్యాపించినది. లైటు ఆర్పివేస్తే మళ్ళీ చీకటి ఆవరించినది. లైటు వేసినప్పుడు గాని తీసినపుడు గాని చీకటి యెక్కడికి పోలేదు. ఎక్కడ నుంచి రాలేదు. మరియు ప్రకాశమునకు ఒక ఆవరణ అడ్డువస్తే అంధకారము వచ్చింది. ఆవరణ తీసివేస్తే అంధకారము పోతుంది అనే వాదన సరియైనది గాదు. ఎట్లనగా ఆ బ్రహ్మ ప్రకాశమునకు అడ్డువచ్చిన ఆవరణ యేది? ఆ ఆవరణ బ్రహ్మమునకు భిన్నమా? అభిన్నమా? భిన్నమైతే అద్వైత హాని, అభిన్నమంటే బ్రహ్మమును బ్రహ్మమే ఆవరించుకొన్నది. ఆవరించినపుడు అజ్ఞానమని, లేనప్పుడు జ్ఞానమని ఆ ఒకే వస్తువే పిలువ బడుచున్నది అనవలెను. ఋగ్వేదము నందలి నాసదీయ సూక్తమున 129 లో ఈ విధముగా నున్నది. పరిశీలింపుము. **1. నాసదాసీన్నోసదా సీత్తదానీం। నా సీద్రజోనోవ్యో మోపరోయత్। కిమావరీవః కుహకస్య శర్మన్। అంభః కిమాసీద్గహనం గభీరం॥** తా॥ సృష్టికి పూర్వము సదసత్తులు లేవు. అంతరిక్షాకాశములు లేవు. అపుడు దేనిని ఎవరు ఎక్కడ ఎవరి సుఖము కొరకు ఆవరించిరి? గహనం, గంభీరం, అయిన అంభస్సు మాత్రం అపుడెక్కడుండెను? **3. "తమ అసీత్ తమసాగూఢ మగ్రే। ప్రకేతం సలిలం సర్వమాయిదం। తుచ్ఛేనాభ్యపి హితం యదాసీత్। తపసస్తన్మ హినాఽజాయతైకం॥"** అనగా ప్రథమంలో అంతా అంధకారమయమై యుండెను. సర్వము జలమయమైయుండెను. ఉన్నఏకవస్తువు మాయచే కప్పబడినదై తన తపోమహిమచే సృష్టి ప్రకట మయ్యెను. ఈ చీకటి వెలుగులు పరిపూర్ణపరబ్రహ్మము నందు లేవు.

**బాహ్యం బ్రహ్మనసంశయ :** కేవల బ్రహ్మమునకు (Absolute Brahamin) వ్యవహారార్థము ఉత్తబట్టబయలని, అనంతమని, అచలమని, శివమని, బ్రహ్మమని పేర్లు వాడినారు. బ్రహ్మమనిన యిచట పరిపూర్ణపరబ్రహ్మమనియే గ్రహించవలయును. అనుమానము వలదు. బయలనగా ఆకాశము. బ్రహ్మమనగా ఇతరులు చెప్పేచేతన బ్రహ్మము లేక కారణ బ్రహ్మముగా వ్యవహారములో నున్నది. అట్లన్నప్పుడు ఆ బ్రహ్మము కేవల బ్రహ్మము కాదు. సందర్భానుసారముగా అర్థమును గ్రహించవలయును. ఉదాహరణకు క.ప.86 **"బ్రహ్మందు లేక కలిగన । బ్రహ్మను నేననెడి మాయ ప్రబలె జగంబై । బ్రహ్మను గని తానేగుటే బ్రహ్మననే మాయకు పని । బ్రహ్మందుజమీ"** ॥ అని శ్రీ కృష్ణదేశికేంద్రులవారు శెలవిచ్చియున్నారు. ఈ కంద పద్యమును పరిశీలించిన యెడల మొదటి చరణ మందు బ్రహ్మము, బ్రహ్మము యని రెండు పరియాయములు వాడినారు. మొదటి బ్రహ్మము పరిపూర్ణ పరబ్రహ్మముగా రెండవబ్రహ్మము చేతన బ్రహ్మముగా లేక కారణ బ్రహ్మముగా వాడినారు. మూడు నాలుగు చరణములందు బ్రహ్మమును గని అనగా పరిపూర్ణ బ్రహ్మముగనియని, రెండవ చోటవాడిన బ్రహ్మమునకు నేననే బ్రహ్మము. మాయా బ్రహ్మముగా వాడబడినది. మరియు బ్రహ్మమందు జమీ అనుటలో పరిపూర్ణపరబ్రహ్మముగా అర్థము స్ఫురిస్తుంది.

తా॥ అచలపరిపూర్ణపరబ్రహ్మమందు లేనటువంటి అహం బ్రహ్మయను ఎరుక,

జగత్తురూపముగా ప్రబలియున్నది. కనుక అచల పరిపూర్ణపరబయలును తెలుసుకొని దాని యందు లేనేలేనని నిశ్చయమున తాను లేక పోవడమే అచలపరిపూర్ణము నందు లేని ఎరుక పని. అనగా ఎరుక ఆచరించువిధానము. ఈ పద్ధతి ఎరుగక ప్రజ్ఞానంబ్రహ్మ, అహం బ్రహ్మోస్మి, తత్త్వమసిబ్రహ్మ, అయమాత్మ బ్రహ్మ యని శ్రవణాదులు యొనర్చి నిరసించి బ్రహ్మ నిర్ణయానుసారమున్నను జనన మరణములు తొలగబడవని భావము.

ఏ పేరుతో పిలిచిన నామరూపాలు మిథ్యయని కల్పితములని, కేవల బ్రహ్మమొక్కటే సత్యమని వేదములు శాస్త్రములు జెప్పుచున్నవి. కనుక ఏ నామము పరిపూర్ణపరబ్రహ్మమునకు పనికిరావు. అయిన సందర్భానుసారముగా వ్యవహారార్థము బట్టబయలు, పరబాహ్యము, పరిపూర్ణపరబ్రహ్మము సాంప్రదాయముగా అందరు కేవలబ్రహ్మముగా, బాహ్యమును బ్రహ్మముగా వాడినారు. ఇచట బాహ్యము బ్రహ్మమనగా పరిపూర్ణ పరబ్రహ్మమే యని నిర్ణయము కావున సందేహము వలదని ఈ శ్లోకార్థము.

**సచ్చిదానంద రూపత్వం మాయా ఇత్యభిదేయతే :** సత్‌చిత్ ఆనందము = సచ్చిదానందము 1.సత్తు అనగా త్రికాల అబాధ్యము అనగా మూడు కాలము లందు మార్పు చెందని రూపము గలది. 2. చిత్తు అనగా అఖండమగు అనంతమగు జ్ఞానము. 3. ఆనందమనగా దుఃఖము లేశము కూడలేని సుఖ స్వరూపము. సచ్చిదానందములు ఆ పరమాత్మ వస్తువును ఎన్నడు విడువకుండ వున్నందున ఇవియే పరమాత్మకు స్వరూపలక్షణములుగా జెప్పబడినవి. సృష్టి, స్థితి, లయములు చేయువాడే పరమాత్మ యన్నప్పుడు సృష్ట్యాదులకు పూర్వోత్తర స్థితులు కూడ యుండుటచే అది తటస్థ లక్షణమని చెప్పబడినది.

బ్రహ్మకీ సల్లక్షణ, చిల్లక్షణ, ఆనంద లక్షణములుగా నిర్ణయించబడినవి. కనుక ఈ బ్రహ్మమునకు సచ్చిదానంద బ్రహ్మమని పేరు వచ్చినది. (ఇంకా వివరముగా తెలియగోరువారు ఈ ఉపనిషత్తు లోని 3వ శ్లోకములోని వివరములు చూడగలరు).

**మాయ:** బ్రహ్మము జీవేశ్వర జగత్తుల కాధారముగా అధిష్ఠానముగా మూలకారణముగా నున్నది. అయితే ఈ జగత్తంతయు బ్రహ్మమయం అని అన్నను జగత్తు మాయ వలన కలిగినదని యందురు. అట్లనుట సరిగాదు. మాయా బ్రహ్మలు రెండు ఒకే వస్తువు.

యా మా సా మాయా అని మాయకు సామాన్య నిర్వచనము. ఏది ఒకప్పుదుండి ఒకప్పుడు లేకుండునో అదియే మాయ అని అర్థము. అంటే ఎల్లప్పుదుండేది ఒకటి, ఒకప్పుడు మాత్రమే వుండి, ఒకప్పుడు లేకుండ వుండేది ఒకటి యని రెండు వస్తువులు చెప్పినట్లయినది. అద్వైత నిర్ణయ రీత్యా పరబ్రహ్మమొక్కటే ఎల్లప్పుడుండేది. కనుక దాని యందే తోచిన ఎరుక దాని యందే మరల లేకుండ పోవునని చెప్పబడుచున్నది. సృష్టికి పూర్వము అసలు లేనేలేనట్లు తోచుచున్నది. సృష్టి ప్రారంభ కాలమున బ్రహ్మము నందు తోచి ఆ బ్రహ్మ మొక్క సాన్నిధ్య మందు చేతన వంతమై బ్రహ్మతో కూడి జీవేశ్వర జగత్తుకు కారణ మైనట్లు చెప్పబడినది. మాయా గాని తత్కార్యము గాని బ్రహ్మ నుండే కలిగినవి. వృక్ష కారణము బీజమునందు అణగి మణగి యున్నట్లే జీవేశ్వర జగదాది మాయా కార్యములు సహితము బ్రహ్మనందు బీజరూపముగా యణగి మణగి యున్నవని చెప్పాలి. ఈ మాయా బ్రహ్మలలో మాయ అనిత్యమని, బ్రహ్మము నిత్యమని అనరాదు. ఈ మాయాది గుణములు ఆ బ్రహ్మము నందు ఆవిర్భావ

తిరో భావములు చెందుచున్నవే గాని బ్రహ్మమున కన్యప్రదేశమున లేవు. మరియు" బ్రహ్మణోన్యం నకించిన " అనగా బ్రహ్మమున కన్యముగా కొంచముకూడ లేదని. "సర్వం ఖల్విదం బ్రహ్మ" అంతా బ్రహ్మస్వరూపమే అంటూ శ్రుతులు చెప్పుచున్నవి. కనుక మాయ బ్రహ్మలు బ్రహ్మము యొక్క రూపాంతరములే. ఇవి ఒకే నాణెము యొక్క బొమ్మ బొరుసు లాంటివి. అధిష్ఠాన బ్రహ్మము సృష్టికి పూర్వము ఒక విధంగా వుండి, తానే జీవేశ్వర జగత్తుగా ఆవిర్భవింపజేసి తన కన్యంగా నున్నట్లు తోపింపజేసి తుదకా జగన్నాటకమున కుపసంహారము చేసేది అధిష్ఠాన బ్రహ్మమే. కనుకనే శ్రీ కృష్ణదేశికేంద్రుల వారు తమ కందార్థము **50 లో "అన్నియు తానై తనకవి పన్నుగ వేరనుచ ....... మోహింపుచుండు** " అని కం.ద.**52 ఆటాడి ఆడకుందును ఆటాడినమేని బొమ్మ యాటా డకనె యాటాడు..... ఆటాడించెడివాడు యతడే రాకర్తా అన్నిటికచలమకర్తా"** అని శెలవిచ్చియున్నారు. కనుక సచ్చిదానంద స్వరూపమైన బ్రహ్మము మాయ అని చెప్పబడినది.

**34. జాతంనాస్తి మృతంనాస్తి నాస్తి జ్ఞానం కదాచన**
**ప్రపంచంనాస్తి సర్వత్ర నాస్తితత్కారణం సదా**

పరిపూర్ణపరబాహ్యమునకు ఒకప్పుడైనను పుట్టక చావులు లేవు. జ్ఞానమును లేదు. ఎచ్చట కూడ ఈ ప్రపంచము లేదు. అట్టి ప్రపంచమునకు కారణమైన బ్రహ్మ కూడ లేదు.

**వివరములు :- జాతం నాస్తి మృతం నాస్తి :** పరిపూర్ణ పరబ్రహ్మమునకు పుట్టుక లేదు. మరణం కూడ లేదు. పుట్టుక వుంటే మరణమున్నది. కనుక పరిపూర్ణము పుట్టనిది చావనిది. ఒకప్పుడు లేకుండవుంటే పుట్టిందనాలి. చచ్చిందనాలి. సర్వకాలాలయందు వున్న పరిపూర్ణమునకు చావు పుట్టుకలు లేవు. పుట్టినది ప్రతి యొక్కటి చస్తుంది. పుట్టిందంటే చాలదా? చావనిది అని కూడ ఎందుకనాలి? చావదు. ఎందుకంటే, మాయా అనాది అన్నారు. అనగా అది (పుట్టుక) లేనిదని కదా అర్థము. కాని బ్రహ్మ జ్ఞానము వల్ల మాయ భ్రాంతి నశిస్తుంది. కనుక పుట్టుక లేనిదైన నాశన మౌతుంది.

తాను పుట్టనిదీ చావనిదీ కనుక పరిపూర్ణపరబ్రహ్మము ఇతరమును పుట్టింపజాలదు గిట్టింపజాలదు. ఏలననగా విచారించి చూస్తే సృష్టిలో పుట్టుక యున్నప్పుడే జీవి తనవంటి మరొక జీవిని ఉత్పత్తి చేయడానికి సామర్థ్యము కలిగి యున్నది. ఉదాహరణ: వృక్ష – బీజములు. ఇవి పరస్పర కార్యకారణములుగా వుంటున్నాయి. పుట్టే టప్పుడు కార్యకారణరూపంగా పుట్టుచున్నాయి. పోయే టప్పుడు కూడ కార్యమును తన యందిముడ్చుకొనే కారణము పొందుతుంది. కనుక పరిపూర్ణపరబ్రహ్మమునకు పుట్టుకలేదు.

**సతోహి మాయయా జన్మయుజ్యతే నతు తత్వతః**
**తత్వతో జాయతే యస్యజాతం తస్యహిజాయతే ॥** మాండూక్యకారికలు.

అనగా పుట్టుకలేనివాని నుంచి ఏదియు పుట్టదు. పుట్టిన దాని నుండియే మరొకటి పుట్టును. దీనినే అన్వయ వ్యతిరేకముగా చెబితే పుట్టించుటకు కారణమైన దేదో అది పరిపూర్ణ పరబ్రహ్మము కాదు అని స్పష్టమగుచున్నది. కనుక పరిపూర్ణమునకు అన్యముగా తోచబడువానిలో దేనికిని పరిపూర్ణ పరబ్రహ్మము మూలము కాదు అని సిద్ధిస్తుంది. కనుక పరిపూర్ణము తాను పుట్టలేదు ఇతరమును పుట్టించలేదు. పరిపూర్ణపరబ్రహ్మము మాత్రమే అజము, అమరము (అనగా పుట్టనిది చావనిది) అయి యున్నది. సృష్టి కారణమైన దానిని

బ్రహ్మమును బృహత్పదార్థము, భూమా అని, గొప్ప పదార్థమని వాడినా అది అజము అమరమునగు పరిపూర్ణ పరబ్రహ్మ మాత్రము కాదు. శ్రీ కృష్ణదేశికేంద్రులవారు కం.ద.96 "పుట్టదు గిట్టదునొకరిని పుట్టించదు చంపబోదు భూమా" అని మరియు మరొక కందార్థ దర్పు **32. " పుట్టుట। గిట్టుట లేకను పుట్టే గిట్టేటి ఎరుక పొడిమెరుగకన్"** అని చాటినారు.కావున పరిపూర్ణపరబాహ్యమునకు పుట్టుక చావులు లేవు.

**నాస్తిజ్ఞానం కదాచన:-** ఒకప్పుడైనను జ్ఞానము లేదని అర్థము. జ్ఞానమంటే సామాన్యార్థములో తెలివి. ఈ తెలివితోనే మానవుడు శాస్త్ర జ్ఞానము వస్తు జ్ఞానము సంపాదించును. బ్రహ్మ చైతన్యము, బ్రహ్మకారవృత్తి, స్వరూపస్థితి అను విశేషార్థములున్నవి. సామాన్యార్థములో ఈ జ్ఞానము సకల ప్రాణులందేగాక జడములని నిర్ణయించిన పదార్థము లందు కూడ నేదో రూపమున నున్నది. ఈ జ్ఞానం శబ్ద తన్మాత్ర యొక్క పరిణామమే. శబ్దము వాక్కు అని వ్యవహరించబడుచున్నది. ఆ శబ్దము పర, పశ్యంతి, మధ్యమ, వైఖరీ అను చతుర్విధములుగా జెప్పబడిన సకలము నందు ఏదో రూపములో వుండియే యున్నది. జడములని చెప్పబడే రాళ్ళ యందు పరావాగ్రూపముగా ఘనీభవించి యున్నది. పరమాత్మ యందు లేశ రూపముగా ఘనీభవించి యున్నది. కనుక అది కేవల నిశ్శబ్దబ్రహ్మమైన పరిపూర్ణ పరబ్రహ్మము గాదు. ఏలననగా ఒకప్పుడు నిశ్శబ్దముగాను, మరొకప్పుడు శబ్దరూపముగాను ఈ సామాన్యజ్ఞానము ఏదో రూపములో సర్వము నందు యిమిడి యున్నది. జ్ఞానరూపమగు బ్రహ్మము అణువణువున యిట్లు యిమిడి యున్నందున " ఆబ్రహ్మస్తంభ పర్యంతం పరమాత్మ స్వరూపకం" అని చెప్పబడినది. చేతనములందు అనగా ప్రాణములందు ఈ సామాన్యజ్ఞానము అంతఃకరణతో కూడి జ్ఞానాజ్ఞాన రూపములు చెంది సర్వమును గుర్తించుచు క్రియాకారకమైన కర్మ సంస్కారములను ప్రోగు చేసుకొని బంధకారణమగుచున్నది.

అట్లుగాక తన సంగతి తనమూలము సంగతి విచారించి వివేక జ్ఞానముతో కృషి చేసినచో తన స్వరూప సాక్షాత్కారము పొందగలడు. ఇది జ్ఞానమునకు విశేషార్థము, జ్ఞానము అజ్ఞానమను పదము నపేక్షించును. జ్ఞానాజ్ఞానములు ద్వంద్వములు. కనుక లేనివి. కనుక జ్ఞానము కూడ నాస్తి. చలనరూపమైన జ్ఞాన స్వరూపమగు ఎరుక అచలపరిపూర్ణపరబ్రహ్మము నందు లేదని తెలియగనే తనను తాను వుళ్ళక్కియని తెలిసి నిలిచే అందుకు తావులేక అచల పరిపూర్ణ పరబయలు స్థితి యందు కర్తృత్వ రహిత కర్మాచరణ పద్ధతిగా తన్ను తాను విడిచి లేకపోవును. కనుక జ్ఞానము నాస్తి.

**ప్రపంచము నాస్తి :** సర్వత్రా ప్రపంచము లేదు. జగత్తునకు కారణమైన బ్రహ్మము కూడ లేనిదే అని అర్థము. తమో గుణ ప్రధానమగు ప్రకృత్యావచ్ఛిన్న చేతనము నుండి వరుసగా ఆకాశాది సూక్ష్మ భూతములును, ఆ సూక్ష్మభూతములు పంచీకృతమై యొండొంటితో గూడుట వలన స్థూలభూతములును, తద్భూత కార్యములగు సర్వ స్థూలోపాధులతో గూడిన జగత్తు క్రమముగా పుట్టినవి. తమో గుణ ప్రధానమగు ప్రకృతి నుండి పరిణమించుట జేసి జగత్తు దృశ్యస్వరూపమును, జడస్వరూపమునై యున్నది.

ఈ జగద్రచనకు తాడు యందు కలుగు సర్పభ్రాంతికిని తాడు యే విధముగా వివర్తోపాదాన కారణమైనదో, అట్లే బ్రహ్మమందు కలుగు జగద్భ్రాంతికి కూడ బ్రహ్మము వివర్తన కారణమైనది. వివర్తనమనగా అధిష్ఠాన వస్తువు నందెట్టి మార్పు లేకనే దాని యందు

చూపరులకు అన్యవస్తు ప్రతీతియగుట. 'బ్రహ్మైవ నివర్తనం' అని యున్నది. కనుక జగత్సర్గమునకు కారణములు బ్రహ్మవివర్తనము, చేతన వివర్తన మాయా పరిణామము అయి యున్నవి. మాయయే తన ఆవరణ శక్తి చేత బ్రహ్మమును మరుగుపరచి విక్షేపశక్తిచే తోపింపజేయుచున్నది. కనుక ఈ మాయావిలాపముచే కలిగిన, జగత్సర్గమువలన బ్రహ్మము నందెట్టి హాని వృద్ధులు, పరిణామ వికారములు కలుగుట లేదు. బ్రహ్మము ఎప్పటివలె నిర్వికారమై సాక్షి రూపముగనే యున్నది. శ్రీ కృష్ణదేశికేంద్రులవారు ప్రపంచము దాని అశాశ్వతమును గూర్చి ఈ క్రింది విధముగా వర్ణించియున్నారు **క.ద.54.** పరిపూర్ణ మొకటి దక్క నితరమైన ప్రపంచమెల్ల దగ తెలియుము॥ నీ వెరుకేనని మదిలోపల" అనగా పరిపూర్ణ మొకటి దక్క ప్రపంచమంతయు యెరుకేనని మనస్సులో ఎరుగుమని తెల్పినారు. **"యెరుకజేసిన విశ్వము యెరుక వంటిదే బయలు । నెరుకా గుర్తెరిగి తానేగితే సరి । తత్వతతి ఎరుకంచనినా । లేనిదే యెరుక స్థితి లెస్సకనిన॥"** అనగా తత్వముల సమూహము నందు తెలియు యెరుకను మహా వాక్యనిర్ణయపద్ధతిగా అచల పరిపూర్ణ కేవలాత్మయని నిర్ణయించుకొన్నను, పరిపూర్ణపరబ్రహ్మతో కలయిక లేనందున లేనిదే యగుచున్నది. మరియు యెరుక జేసిన విశ్వము ఎరుక రీతిగనే అశాశ్వతమని నిర్ణయము. మరియు క.ద.64 లో **"ఎరుకతో వచ్చిన విశ్వము । ఎరుకతో జనునుగాని నిల్వదీ"** అనగా ఎరుకతో వచ్చిన విశ్వము ఎరుకతో పోవును గాని నిలకడగా యుండదని నిర్ణయము మరియు క.ద.70 **"ఎరుకజడమజడమిా జగమరయగ పరిపూర్ణమేమి । యనరానిది । యా ఎరుక జగము లస్థిరములు । పరిపూర్ణము శాశ్వాతపుది పాటించికనరా॥"** అని శెలవిచ్చియున్నారు. అనగా విచారించిచూడగ ఎరుక జడరూపము, అజడరూపము, జగద్రూపముగా తెలియుచున్నది. అచలపరిపూర్ణపరబయలిందులో యేది యనరానిది. ఆ ఎరుక జగము లస్థిరములు. పరిపూర్ణపర బాహ్యము శాశ్వతము. కనుక ప్రపంచము లేనిది. దానికి కారణమైన బ్రహ్మము మాయ ఎల్లప్పుడు లేనిదని నిర్ణయము.

**నాస్తి తత్కారణము సదా :** ఏ వస్తువు లేనిచో మరియొక వస్తువు తోచబడదో అది కారణము. అట్టి కారణవస్తువు యొక్క నామరూపాల కంటే భిన్నమగు నామరూపాలు గలదై యుండును, విచారించి చూడగా కారణవస్తువు యొక్క మూలద్రవ్యమునకు మాత్రము భిన్నము కానిదై యున్నవస్తువు కార్యమని చెప్పబడును. ఉ॥ మట్టి లేనిచో మట్టితో చేయబడిన ఘటశరావాదులుత్పత్తి కాజాలవు. నామరూపాలే వేరు గాని వానికి మట్టియే మూలద్రవ్యముగా నున్నది. కనుక మృత్కార్యములు కార్యకారణ వస్తువులు వేర్వేరు నామరూపాలతో గాన వచ్చినను తత్వః ఆ రెండు మూలద్రవ్యమగు మట్టి కంటే భిన్నములు కావు. రెండు కూడ మట్టి, ఘటాదులనే నామములు ఆయా వస్తువుల యొక్క రూపములు ఆ మృత్తిక యందు ఆరోపితము లైనవి. కార్యరూపముగానున్న ఘటము యొక్క నామరూపాలు మాత్రమే నశించును గాని కారణమగు మృత్తిక రూపములో నిలుచున్నవి. నామరూప వికారములు అసత్యములని మృత్తికే సత్యమని శ్రుతి॥ "విచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యం" అంటూ చెప్పినది. అట్టి కారణరూపమగు మృత్తిక వున్నంత సేపు కార్యరూపమగు ఘటాదులు తిరిగి తిరిగి యుత్పత్తి చేయబడుచునే యుండును. అట్టి కార్యరూపము నందలి నామరూపాలు కారణవస్తువు నందు దాగి యుండు నన్నమాట. కనుక కారణ రూపకముగా రెండురీతులుగా తోచబడిన

రెండు కలసి ఒకే వస్తువు. అందు కారణము శాశ్వతమని భ్రాంతి కలుగుచున్నది. కాని నామరూపాత్మకమగు మార్పులు లేక వికారములు దాని యందు తోచబడుచున్నంత కాలము అది మార్పులు చెందే లక్షణములు కలిగి యున్నందున దాని యందు కూడ కేవల శాశ్వత లక్షణములున్నట్లు చెప్పుటకు వీలు లేదు. కార్యమునకు కారణవస్తువు దృష్ట్యా అశాశ్వత లక్షణము చెప్పబడినది. కనుక కార్యకారణ రూపముగా నుండు మూలద్రవ్యమునకు శాశ్వత అశాశ్వత ద్వంద్వ లక్షణములు రెండు చెప్పవలసియుండును.

పృథ్వికి కారణమైన జలము, పృథ్వి దృష్ట్యా శాశ్వతము. అట్లే జలదృష్ట్యా అగ్ని, అగ్ని దృష్ట్యా వాయువు వాయువు దృష్ట్యా ఆకాశము, ఆకాశము దృష్ట్యా ఆత్మయును సాపేక్షముగా శాశ్వతములుగా తోచుచున్నవిగాని ఈ ఆరింటి యందు దేనికి నిరపేక్షక శాశ్వతములేదు. కనుక కార్యకారణ వస్తువులన్ని సాపేక్షిక శ్రేణిలోకి చేరుచున్నవి.

ఆత్మ కూడ కార్యకారణ ద్వంద్వములోనిదే. కనుక దానికి నిరపేక్షక శాశ్వతత్వము లేదు. ఆత్మకు కూడ ఉత్పత్తి చెప్పవచ్చును. ఎట్లనగా కారణము లేనిదే కార్యము లేదు. పుట్టుక వున్న దాని నుండే మరొకటి పుట్టునన్న సిద్ధాంతమును విస్మరించరాదు. పరిపూర్ణము మాత్రమే నిజముగా అమరము అజము అయియున్నది. కనుక దాని నుండి ఏదియు పుట్టజాలదు. ఆత్మయే జగత్కారణమని ఆత్మ నుండియే సర్వము ఉత్పత్తి అయినవని శ్రుతి స్మృతులు చెప్పుచున్నవి.

కనుక పై సిద్ధాంతము ప్రకారము ఆత్మనుంచి అన్ని పుట్టినవి. కనుక ఆత్మకు కూడ పుట్టుక అంగీకరించవలసియున్నదే. అయితే అంతా ఆత్మ. ఆత్మ కన్యమైన కేవలాత్మ అని చెప్పబడినది. అజము, అమరము (పుట్టని చావనిది) కనుక దాని నుంచి ఆత్మ పుట్టలేదు. పోతే తన నుంచే తాను పుట్టినది. ఎరుక ఎరుక వల్లనే పుట్టినది. దానికి మరొక కారణము లేదు. ఈ విషయమునే శ్రీ కృష్ణదేశికేంద్రులవారు క.ద.280 **"జగము వలన సంకల్పము జగమా సంకల్పమునను జనియించువే రగుపడదు జన్మమందిర। మగుపడ వెడబాసి నిల్వ వారెండెన్నటికి"** అని **"మేను మజ్జనని నేనే మేనికి జనకుడను"** అని క.ద.86 ఎరుకోద్భవ మెట్లున్నను సరళంబుగ నారికేళ సలిలము భంగిన్" అని శెలవిచ్చియున్నారు. కనుక జగమునకు కారణమయిన ఆత్మ (బ్రహ్మము, ఎరుక) కూడ నాస్తియని నిర్ణయము.

**35. పునఃపునఃప్రవక్ష్యామి సాక్షిర్నాస్తీతి నిశ్చయమ్**
**బాహ్య బ్రహ్మేతి నిశ్చిత్య ఇతివేదాంతడిండిమః** ॥35॥

తా॥ సాక్షిగా నిలిచిన ఆత్మ కూడ (కారణ బ్రహ్మము) లేదనెడి నిర్ణయమును మళ్ళి మళ్ళి చెప్పుచున్నాను. పరిపూర్ణపరబాహ్యమే బ్రహ్మమని నిశ్చయము. ఈ నిర్ణయమును వేద శిరస్సులనెడి ఉపనిషత్తులందు ఢంకా మ్రోగించి చెప్పినట్లు ఘోషించుచున్నవి.

**వివరములు :- పునఃపునః ప్రవక్ష్యామి సాక్షిర్నాస్తీతి నిశ్చయమ్ :** సాక్షియు లేనిదని నిశ్చయముగా మళ్ళిమళ్ళి చెప్పుచున్నాను అని అర్థము. అన్యమార్గస్తులు ఎరుకను సాక్షి యనుకొనుచున్నారు. నేను ఆ సాక్షిని అహం అని నీతో చెప్పుచున్నానని శిష్యునికి జెప్పిన క.ద.80లో **"వినుమితరులు ఎరుకను సాక్ష్యని పలికిరి । నేను సాక్షినహమని నీతో । వినజెప్పితి । నింతియే వేరనకూడదు । రెంటినొక్కటని తెల్పుకోరా । మాటల భేదమని కనుక్కోరా"** ఇదియే సాక్షి. సాక్షి అహము వేర్వేరు కావు. ఈ రెండు ఒక్కటియే యగును.

మాటల భేదమే గాని వస్తువు నందే భేదములేదుయని కనుగొనుము. నోటితో చెప్పరానిదియు చెవులతో వినరానిదియు కనులతో కనరానిది పరబయలు. అందు ఎరుక తనకై తానే వచ్చి తనకై తానే పోవునని తెలియుము.

సాక్షియనగా ఏదేని ఒక కార్యమును కనిగాని వినిగాని తెలిసినవాడు అభిమానయుతుడే. కనులతో చూచును. చెవులతో వినును, నోటితో చెప్పును, అభిమానము అహంకార గుణమై నందున సాక్షియనియు అహమనియు మాటల భేదమే గాని రెండు ఒక్కటే యని నిర్ణయము. ఎరుక రూపమైన బుద్ధి సాత్విక, రాజస, తామస వ్యాపారములు చేసినను చేయనిమ్ము. "బుద్ధిః గ్రాహ్యమతీంద్రియం" అయమాత్మ బ్రహ్మయని లయము పొందనిమ్ము, వీటి నన్నిటికి నేను సాక్షిని, ఏ కొంచము చేయువాడను కాను. అని ఎరుక నిర్ణయము గనుక అది నమ్మినవారు ఈ విధముగా చెప్పబడిన సాక్షియుకూడ పరిపూర్ణ మందు లేదు అని మళ్ళీమళ్ళీ చెప్పుచున్నాను అని ఈ శ్రుతి వాక్యము పలుకుచున్నది.

**బాహ్యంబ్రహ్మేతి నిశ్చిత్య ఇతి వేదాంతడిండిమః :** కేవల బ్రహ్మమునకు (Aboslute Brahamin) వ్యవహారార్థము ఉత్త బట్టబయలని, అచలమని, బ్రహ్మమని మరికొన్ని పేర్లు వాడినారు. బ్రహ్మమనిన యిచట పరిపూర్ణపరబాహ్యమని నిశ్చయించుకోమని యిది ఉపనిషత్తులలో ఢంకా బజాయించి చెప్పినారు. అట్లున్నప్పుడు ఆ బ్రహ్మము కేవల బ్రహ్మముకాదు. సందర్భాను సారముగా అర్థము గ్రహించవలసియుండును. ఏ పేరుతో పిలిచిన నామరూపాలు మిథ్య యని, కల్పితములని, కేవల బ్రహ్మమొక్కటే సత్యమని శాస్త్రము లుద్ఘోషించుచున్నవి. కనుక ఏ నామము పనికిరాదు. అయినను సందర్భానుసారము వ్యవహారార్థము బ్రహ్మము బట్టబయలు, అచలము, పరిపూర్ణ పరబ్రహ్మము పరబయలు పరమ శివములను సాంప్రదాయకముగా అందందు కేవలబ్రహ్మముగా వాడుచున్నారు. ఉపనిషత్తులందు కూడ అందందు పరిపూర్ణ పరబ్రహ్మమునకు బదులుగా బ్రహ్మమును వాడియున్నారని గ్రహించగలరు. ఇచట బాహ్యమును బ్రహ్మముగా నిశ్చయించుకోమనుచున్నది. ఈ ఉపనిషత్తు

**36. బహుధాతర్కవాదేన కింఫలం కిం గమిష్యతి**
**అజ్ఞాన నరకం సిద్ధం అన్యమార్గాను వర్తనమ్.**

తర్క వితర్కములు చేయుట వల్ల ప్రయోజన ముండదు. పొందవలసిన ఫలము పొందబడదు. అన్యమార్గాను వర్తనమ్ అనగా పరిపూర్ణబోధ మార్గము గాక ఇతర మార్గములు శైవము, వైష్ణవము, గాణపత్యము, శాక్తేయము, బౌద్ధ, జైన మతములందు గల మార్గములననుసరించిన అజ్ఞానమే కలుగును. వారు ఎరుక మార్గావాలంభికులు. కనుక వారికి నరకమే సిద్ధించును. జనన మరణముల చక్రభ్రమణమే నరకం.

**వివరములు :- బహు తర్కవాదేన కిం ఫలం కిం గమిష్యతి :** అనగా తర్కవాదములు చేయుట వల్ల ఏమి ఫలము లేదు. ఏమి పొంద లేము. అయితే పారమార్థిక విషయమున సమన్వయము పొందుటకు, సత్పదార్థమును కనుగొనుటకు వాదము ప్రతివాదము అవసరమే. దాని వల్ల సత్యం బయటపడును. ప్రయోగశాలలో ప్రయోగముల ఫలితముల ఆధారముగా సార్వజనీన సత్యమును కనుగొందురు. ఆ సత్యము అన్ని కాలాలో అన్ని ప్రదేశాలలో సత్యముగానే యుండును. పారమార్థిక విషయములను ప్రయోగశాలలో ప్రయోగము చేయుటకు

వీలుపడదు. కావున సత్యమును కనుగొనుటకు సద్విమర్శ అవసరమే. కాని రంధ్రాన్వేషణకు దారి తీయరాదు. పాశ్చాత్య తత్వవేత్త హెగల్ మహాశయుడు తత్వ విచారణయందు గతి తార్కిక పద్ధతిని సూచించినాడు. ఒకటి వాదము (thesis) రెండవది ప్రతి వాదము (antithesis) వల్ల సమన్వయము (Synthesis) ఏర్పడును. ఈ సమన్వయమే సత్యము అని, ఈ వాదన తత్వ విచారణ యందు సత్యము కనుగొనుటలో ఎంతో తోడ్పడగలదని వారి నమ్మకము. అట్లుగాక తార్కిక దృష్టితో తర్కిస్తే ఏమి ప్రయోజనము లేదనిరి. ఈ శ్లోకమున చెప్పబడిన దానివల్ల తర్కవాదన వల్ల పరిపూర్ణ పరబాహ్యము తెలియరాదు. తర్కవాద మంత ఎరుకనే. మాటల చమత్కారమే. పరిపూర్ణమందు పలుకులేదు, మాటలేదు. పలుకు మాట లేని దానిని మాటల చేత కనుగొనుటకు వీలులేదు. అందుకే శ్రీ కృష్ణదేశికేంద్రులవారు క.ప.2 **"మాట లేనట్టి బయలున। మాట గలిగె ననుట వినుట। మాయ గదయ్యా। మాట మాయైతె మానెను। మాటను మాట్లాడి మనము। మానుదవలన్ "**। అని చెప్పినారంటే తర్కము వితర్కము మాటల కూర్పు, మాటల చమత్కారము మాటలు లేనట్టి పరిపూర్ణ పరబాహ్యమందు మాటకలిగిన దనుట, వినుట మాయగదయ్యా. ఈ సందర్భమున క్రింద నారద భక్తి సూత్రముల పరిశీలించుము 72 **"నాస్తి తేషు జాతి విద్యా రూప కులధన క్రియాది భేదః"** అనగా భగవద్భక్తుల యందు జాతి, విద్యా రూప, కుల, ధన ఉద్యోగాది భేదములు లేవు. 73 **"యతస్త దీయాః"** అనగా భగవత్సంబంధమైన వారుగుటవలన. 74 **"వాదోనావలమ్బ్యః"** భగవద్భక్తులు వాదమునకు దిగరాదు. సత్యముకనుగొనుటకు ప్రయత్నించవలయును. తత్వ విచారణ, పరిశీలన, శోధన వుండాలి. అనుష్ఠానము, విచారణ, ఆచరణ యుండాలి.

యా మా సా మాయా అను నిర్వచనము ప్రకారము ఏది లేనిదో అదిమాయ. కనుక తర్కవిత్కరములు మాయ, ఎరుక. కనుక లేనివని నిశ్చయము. లేనివానితో ప్రయోజనముండదు. ఎల్లప్పుడుండే పరిపూర్ణమును గురుముఖతః తెలిసిననే ప్రయోజనము. శాస్త్రముల వలన తర్క వితర్కముల వలన ఎరుక యందలి భ్రాంతి ప్రభలునుగాని తగ్గదు.

**అజ్ఞానం నరకం సిద్ధం । అన్యమార్గాను వర్తనమ్ :** ఇతర మార్గములను ననుసరించుట వల్ల నరకము సిద్ధించును అని అర్థము. పరిపూర్ణ మార్గమును వదలి ఇతర మార్గములను, లేక ఇతర పద్ధతులను అనుసరించుటవల్ల నరకమే సిద్ధించును. ఇతర మార్గము లేవనగా ద్వైతాద్వైత విశిష్టా ద్వైత, శౌర, శాక్తేయ, గాణపత్య, బౌద్ధ, జైన యిత్యాది మతములు. వీటిని అనుసరించుట వల్ల భ్రాంతి విస్తారమగును గాని భ్రాంతి రహితము గాదు. ఇతర మతముల గూర్చి శ్రీ కృష్ణదేశికేంద్రులవారు క.ద.118. "మతముల వారలు। తమ సమ్మతమైనటువంటి। శాస్త్ర మర్యాదలచే మితమేర్పరచుకొని। బహుగతులను కలహింతు। రట్టిగతి నీ కేమిటికీ। చపలత జెందె స్థితి నీ కేమిటికి"। అని అన్నారు. ఈ మతముల వారంత తమ తమ మతములకు సరిపడు శాస్త్రములను నిర్ణయించుకొని వానివాని మర్యాదల నతిక్రమించి నడవరాదని, హద్దుల ఏర్పరుచుకొని బహు విధముల కలహించుచుందురు. నీవు వారివలె కలహించ బోకుమని శిష్యుని హెచ్చరించియున్నారు. ఎందుకనగా వాటివల్ల చపలత్వమే కలుగును. ద్వైతులు జీవేశ్వరులు వేరని, అద్వైతులు జీవేశ్వరులు వేరు కారని, ఒక్కరే అని, విశిష్టాద్వైతులు ఈశ్వరుడు చిదచిద్విశిష్టుడని, ఎల్లప్పుడు పలు విధముల కలహించుకొనుచుందురు. అట్టి మిథ్యా వాదముల వలన భ్రాంతి విస్తారమగునే గాని భ్రాంతి

రహితము గాదు. మరియు క.ద. 120. **కొందరు దశవిధనాదములందున । నభ పంచకంబు నందున । చక్రాలందున । లక్ష్యధ్యానంబందున । . . . . . . మనసీ బోధందె నీవుంచుము"** అని హెచ్చరిస్తున్నారు. మరియు ఆకాశ పంచకము అంతరేంద్రియములు, మరియు జ్ఞానేంద్రియములననుసరించు వారు తత్వచింతన గలవారు, మనో యింద్రియములను అనుసరించువారు యోగాభ్యాసకులని, బుద్దేంద్రియముననుసరించువారు మత సాంప్రదాయకులని, చిత్తేంద్రియముననుసరించువారు మంత్రోపాసకులని నిర్ణయము. మంత్రములందు, భక్తి పద్ధతులందును, యోగ నిర్మాణము లందును, యోగ పద్ధతులందు, తత్వనిర్మిత పద్ధతులకు భ్రాంతులగుచున్నారని నిర్ణయము. అట్లే అష్టాంగ యోగము లందు, మంత్ర, లయ, హఠ రాజయోగముల వలన, సిద్ధులవలన జన్మ భ్రాంతి అధికమగును. గాని జన్మరహితము గాదు. కొందరు కన్నుల ప్రక్కన వేళ్ళు పెట్టి భ్రూమధ్య మందు దృష్టిని నిలిపి పున్నమ వెన్నెలలో బయలును చూడు మందురు. అదియును కూడ ఎరుక చేష్టలే. మరికొందరు కద 126. "జనులాత్మాను భవంబైనను ముక్త్యని పల్కి । రిట్లు నమ్మకు మెరుకే " అని క.ద.127 తనను తాగనిన । మోక్షంబని పల్కిరిగాని జనులు అది నమ్మకుమీ" అని మరిమరి హెచ్చరించియున్నారు. అంటే పర బయలందు తనను తావెదికిన యెడల తనకు తాను కనిపించుట లేదు. దానితో పాటు ప్రపంచము గూడ అగుపడుట లేదు. ఎందుకనగా తననుంచే ప్రపంచమైనది. కనుక తాను ప్రపంచము అగుపడుట మిథ్య. కనుక అంతయు ఎరుకనే. కనుక లేనిది. ఎరుక వలన జనన మరణమను అజ్ఞానము కలుగును. అజ్ఞానమే నరకము. అజ్ఞానము వలన నరకము ప్రాప్తించును. కనుక ఈ లేనెరుక పరిపూర్ణపరబాహ్యమందు లేదని, నిలిచే అందుకు స్థానము లేదని గురుముఖతః తెలుసుకొని కర్తృత్వరహిత కర్మాచరణ పద్ధతిగా నడుచుకొనిన జన్మరాహిత్యము సిద్ధించును. ఇదియే మోక్షమని తెలియదగును. ఇతర మతముల వల్ల భ్రాంతి విస్తారమై అన్ని నరక యాతనలకు గురికావలసి వస్తుందని ఈ శ్లోకము హెచ్చరిస్తుంది.

**37. శ్రవణమనన నిధిధ్యాస సమాధిభ్రాంతిలక్షణమ్**
**బ్రహ్మ విశ్వ ద్వయం మిథ్యా ఇతి నిశ్చయమేనహి**

శ్రవణ మనగా వినుట. విన్నదానిని మనస్సు నందు మననము చేసి, అట్లు మననము చేసిన దానిని నిధి (గుప్తధనము)గా మనస్సు నందు నిలుపుకొని బుద్ధిని సమముజేసి సమాధి పొందునట్టి యోగాభ్యాసములు కూడ భ్రాంతి లక్షణములే. బ్రహ్మము (కారణము) వలన కలిగిన జీవేశ్వర జగత్తు (కార్యము) రెండు మిథ్య స్వరూపములే అనగా వాటి పారమార్థిక సత్యత్వము లేదు. అవి ఒకప్పుడును కూడ లేనివని నిశ్చయము.

**వివరములు :-** శ్రవణ, మనన, నిధి ధ్యాస, సమాధి-భ్రాంతి లక్షణముల గూర్చిన వివరములకు (31) శ్లోకమున షడంగై ర్వర్జిత శ్శివః అనుశీర్షికను చూడుము.

శ్రుతి॥ ఆత్మావారే దృష్టవ్య, శ్రోతవ్యో, మంతవ్యో నిధి ధ్యాసి తవ్యః॥ అని విధి వాక్యము విధించుచున్నది.

తా॥ ఆత్మ చూడతగినది, వినదగినది, మనన చేయతగినది, నిధి ధ్యాస చేయతగినది. కనుక మహా వాక్యార్థమును శ్రవణ మనన నిధి ధ్యాస లొనరింపుమని శ్రుతి విధించుచున్నది. కాని ఈ శ్రవణాదుల వలన బ్రహ్మ అపరోక్ష సాక్షాత్కారము కలుగజాలదు.

1) ఆ బ్రహ్మము (పరిపూర్ణ పరబాహ్యము) నైనచా నమనసా ప్రాప్తుంశక్యోనచక్షుసా

అస్తీతి బ్రువతోఽ న్యత్ర కథం తదుపలభ్యతే" కఠోపనిషత్ 2-3-12. తా॥ వాక్ మనస్సు, చక్షువులకు ప్రాప్తింపరానిది. ఉన్నది అని చెప్పుట వినాగా మరొక రీతిగా దాని యుపలబ్ధికాజాలదు.

2) "న తత్ర చక్షుర్గచ్ఛతి నవాజ్గచ్ఛతి, నోమనః" కేనోపనిషత్తు 1-3. అనగా వాక్కుకు అందదు, మనస్సుకు, చక్షువుకు కూడ అందదు. జ్ఞానమునకు కూడ తెలియరానిది.

బ్రహ్మమును గూర్చి సాక్షాత్తుగా చెప్పగల వాక్యము లుండుటకే వీలు లేదు. కనుక ఆ బ్రహ్మము అశ్రుత్యర్థము అని అన్నారు. అట్టి బ్రహ్మమును శ్రవణము చేయుటెట్లు? అట్టి బ్రహ్మమును గురించిన వాక్యములే లేనిచో దేనిని మననము చేయవలయును? ఆ బ్రహ్మము అమనస్కరూపమై మనస్సుచే తెలియరానిదై యున్నది. కనుక దానిని మననము చేయుట సాధ్యము గాదు. శ్రవణమననములు చేయరాని దానిని నిధి ధ్యాసయు చేయజాలము. తానే ఆ బ్రహ్మనని మహావాక్యములు ఘోషించుచుండగ ఆ బ్రహ్మమును తన శ్రవణ మనన నిధి ధ్యాసాదుల విషయము గావించుట పొసగదు. కనుక శ్రవణాదులనెడి సాధనలు పరిపూర్ణ పరబ్రహ్మము విషయములో నిరర్థకమే అగుచున్నవి. అవన్ని భ్రాంతి లక్షణములు.

**బ్రహ్మ విశ్వద్వయం మిథ్య :** వేదములు ఉపనిషత్తులు, బ్రహ్మ సూత్రములు భగవద్గీత, షట్దర్శనములు వివిధ వాదములు మతములు వాని యందు చేయబడిన సృష్టి సంబంధమైన భిన్నభిన్న వివరణములను బట్టి సృష్టిలేదను అంగీకారము కాదని, సృష్టి కత్యంత మూలకారణము బ్రహ్మమేనని తెలియవచ్చుచున్నది. అట్టి బ్రహ్మము తాను తానై నిస్సంకల్పస్థితిలో నున్నప్పుడు సృష్టి లేదు. తన యందు బీజరూపముగా అణగి మణగి యున్న గుణత్రయము అనగా సత్వ, రజోతమోగుణముల సామ్యావస్థయే ప్రకృతి. అదియే అవ్యక్తము, ప్రధానము, మూలమాయ, ఇత్యాది నామములచే ప్రసిద్ధము. అట్టి గుణముతో కూడినదే బ్రహ్మము. గుణ యుక్తుడగుటచేతనే తన సర్వాతీత స్థితి నుండి చ్యుతుడై సృష్టికామనకు లోనగును. అట్టి సగుణ బ్రహ్మమే సృష్టికారణమని కొందరు. అతని త్రిగుణ సమిష్టియగుమాయయే కారణమని కొందరు, ఇత్యాదిగా ప్రతిపాదిస్తు వచ్చినను మూలకారణము బ్రహ్మమేనని నిర్ధారణ చేయుటలో ప్రతి పత్తి యేమియు నుండజాలదు.

**బ్రహ్మము :** శ్రుతి॥ "యతోవాయిమాని భూతాని జాయంతే యేన జాతాని జీవంతి। యత్ర్ప యంత్యభిసం విశంతి తద్విజిజ్ఞాసస్వ తద్ర బ్రహ్మేతి" తైత్తిరీయోపనిషత్. ఈ భూతము లన్ని దేనియందుండి కలిగినవో, అట్లు కలిగిన దేనిచే జీవించియున్నవో, నశించునపుడు దేని యందు లయమగునో అదియే బ్రహ్మమని తెలుసుకొనవలయును. అనగా బ్రహ్మము నుండియే సర్వము కలిగినవి. బ్రహ్మము వలననే జీవించుచున్నవి. తిరిగి బ్రహ్మము నందే లయమగుచున్నవని చెప్పదగును.

**విశ్వము :** పరిపూర్ణ పరబ్రహ్మమునకు ఏది అన్యముగా నున్నట్లు విశ్వసించబడుచున్నదో అదియే విశ్వమని చెప్పబడుచున్నది. క.ప.33 **" హరి యందు దోచు విశ్వము। నర స్వప్నము వంటిదనిరి నానాజనముల్। సురస్వప్నము వంటిదియనె। స్థిరమతి శివరామ నామ దీక్షితులు ధరన్"** అని శ్రీ కృష్ణదేశికేంద్రుల వారు చెప్పుటలో పరిపూర్ణ మందు కలరూపముగా తోచిన ఎరుకే విశ్వమునబడును. కనుక విశ్వమే ఎరుక యని స్పష్టమగుచున్నది. ఎరుక అనగా సర్వమును ఎరుగునట్టి జ్ఞానము. కారణరూపముగా

నున్న యెరుకే కార్యరూపమగు ఈ జగత్తుగా మారినది.

**"యద్దృశ్యం తన్నశ్యం"** అనగా కంటికి కానవచ్చేదంతయేగాక యింద్రియములకు గాని, మనస్సునకు గాని తెలియబడు సమస్తము దృశ్యమే కనుక అది నశించునదే లేక అశాశ్వతమే. కనుక పంచ తన్మాత్ర విషయములలో శబ్ద స్పర్శ రూపరసగంధములన్నియు దృశ్య కోటిలో చేరును. కనుక జ్ఞానమునకు విషయము కూడ అశాశ్వతమే. అట్లే జ్ఞానమునకు తెలియబడేదంతా దృశ్యమే. కనుక జ్ఞానమునకు విషయముగా నుండునదంతయు అశాశ్వతమే. సర్వత్రిపుటి జ్ఞాతృ, జ్ఞాన, జ్ఞేయము, ద్రష్ట, దృక్కు, దృశ్యము, కర్త, కర్మ క్రియలు, ఒకదానికొకటి సాపేక్షములే కనుక నశించునవియే, అశాశ్వతములే.

## 38. శిష్యోనాస్తి గురుర్నాస్తి నాస్తి జ్ఞప్తికదాచన
## ఏ తద్వాక్య నిబోధోయమ్ గురువాక్యేన లభ్యతే

పరిపూర్ణగురువు చేత పరిపూర్ణపరబాహ్యము సూచన అయిన వెనువెంటనే, ఒకప్పుడైన శిష్యుడులేడు గురుడు లేడు. మరియు జ్ఞప్తి, సర్వసంకల్పములు వికల్పములు లేకుండపోవును. (లేదా) శిష్యుడు లేడు గురుడులేడు, జ్ఞప్తియు లేదు. ఈ సూచన గురు వాక్యము చేతనే లభ్యమగును.

**వివరములు :- శిష్యోనాస్తి గురుర్నాస్తి :** అఖండ బ్రహ్మాకారవృత్తి పొందుటే అద్వైత మందు పరాకాష్ఠ. అఖండ బ్రహ్మాకారవృత్తి యనగా " నిరంతరావిచ్ఛిన్న తైలధారవత్" అనగా నూనెను ఒక పాత్ర నుండి ఎంత సన్నని ధారగా పోసినను తెంపులేక ఆ నూనెధార తీగెవలె సాగునే కాని నీటి వలె చుక్క చుక్కలుగా పడదు. తెంపులేని నూనె ధారవలె బ్రహ్మాను సంధానము యెడ తెగక సాగుటే అఖండ బ్రహ్మాకారవృత్తి. సాధకుని అంతఃకరణము బ్రహ్మాకారము వహించి తన్మయమై వుండుటచే అపుడు "బ్రహ్మణోన్యం నకించన" అను స్థితి సార్థకమై యుండును. ఆ స్థితి యందు గురువు గాని, శిష్యుడు గాని గురువు తెల్పు బోధగాని, పిమ్మట శిష్యుడుచేయు సాధన గాని ఏమియును లేవు. ఇదే గురు శిష్యోభయరహిత స్థితి. అదెట్లనగా ధ్యానించినచో ఆ జ్ఞానము (నిరీంద్రయరూప మగుమనస్సు) జ్ఞేయ రూపమును పొందుచున్నది. " మనోహి జతువత్" అనగా మనస్సు లక్క వంటిది. ఏ మూసలలో లక్కను కరిగించి పోస్తే ఆ రూపమే ఆ లక్క వహిస్తుంది. అదే విధముగా ఆ శుద్ధ జ్ఞానము లేక నిరీంద్రియ మనస్సు. అట్లు జ్ఞేయాకారమును వహించుటే అజ్ఞేయ బ్రహ్మమును ఆలోచించుట. ఆ పిమ్మట జ్ఞానమును వదిలి వేయుట లేక శూన్యము గావించవలయును. అదెట్లో విచారింతము.

పై వివరించినట్లు నిరీంద్రియ మనస్సుచే జ్ఞేయ బ్రహ్మమును తెలుయుటయే (ఆత్మ సాక్షాత్కారమే) ఆ లేనెరుక స్వరూపుడు తానే అని గుర్తించి ఆ సర్వ స్వరూపమైన అఖండాత్మ స్వరూపుడుతానే అయి నిలుచుటయే ఆ లేనెరుకను తెలియుట. అట్టిస్థితి యందేతానుకాని, తాను లేని పరిపూర్ణ పరబ్రహ్మమున్నది. తానేలేడు అనే యదార్థ జ్ఞానముశిష్యునికి కలుగుచున్నది. ఇదే పరిపూర్ణమును వుండ జూచుకొనుట. అట్లు వుండజూచిన తెలివి లేనే లేదని దాని రహిత మొనర్చుకొనుటే లేనెరుకతోపరిపూర్ణమును కనిపెట్టుట. ఇదే ఎరుక లేక సేవించుట. ఇదంతా అనుభవ విషయము నీకు సంబంధించినది. సద్గురువుల చెంత సచ్ఛిష్యులు చతుర్విధ శుశ్రూషలు చేసి ఆత్మ సాక్షాత్కారము కలిగించుకొన్న పిదపనే యిది గ్రాహ్యమగు విషయము.గురుకృపా పాత్రులకే యిది సాధ్యం " స్వయం బ్రహ్మ మయోభూత్వా తత్పర

చావలోక యేత్" అని గురుగీత చెప్పుచున్నది. ఇట్లు పరిపూర్ణ పరబ్రహ్మము శిష్యుడవలోకనము గావించుకొనునేని అప్పుడే శిష్యునితో పాటు గురుడు కూడ జన్మ రహితము పొందగలడు. అప్పుడు శిష్యోనాస్తి గురుర్నాస్తి.

నా గురుడు లేకనే యున్నవాడు. నేను కూడ లేనివాణ్ణే. కాని భ్రమ కారకుడనైనందున వున్నవాడను. నన్ను లేనివానిగా లేకుండా జేయుటకు ఉన్న వానిగా గురుడు తోచినాడు. తోచిన వేళ్ళా విశేషమేమోగాని నాకు గురువై పరిపూర్ణ బోధను కరుణించుట వల్ల ఆ క్షణమున, నేనూ లేని వాడనైనాను. ఇక నేను లేను నా గురుడు లేడు. లేకుండ కావాలి యనుకొన్నవారికే గురుడున్నాడు. ఆ క్షణమున ఉన్నవాడై నన్ను లేని వానిగా జేసి లేకుండపోవు గురు పరంపరా గురుసార్వభౌములకు ఇవే మాశత కోటి దండ ప్రణామములు.

సూచన: ***అంతా పరిపూర్ణ పరబ్రహ్మమే యుండగ నేనెక్కడ.***

క.ప. 164 **కప్పురము నిప్పుగలిసి। చొప్పున వెలి గవల కండ్ల। జూస్తుండగనే। తప్పున గనరాదట్లనె। యిప్పుడు నిను నన్ను బోధ। నెరుగుము బుద్ధిన్॥ అని గురు శిష్యుల రహిత స్థితిని వస్తు నిశ్చయముగా తెల్పినారు శ్రీ కృష్ణ ప్రభువులు.**

**నాస్తి జ్ఞప్తి కదాచన :** పరిపూర్ణ పర బాహ్మమందు ఎప్పుడునుజ్ఞప్తియనగా (ఎరుక) లేదని చెప్పబడినది. ఈ విషయమును శ్రీ కృష్ణదేశి కేంద్రుల వారు తమ 56 క.ద॥లో **"ఎరుకన్నను, మరుపన్నరు। గురుతన సాక్ష్యన జ్ఞప్త్యన। స్ఫురణయనిన ద్రష్టయనిన చూడు మొక్కటిగా॥"** అని, జ్ఞప్తి యనగా సకలమును తలంచునది గనుక యెరుకను జ్ఞప్తి యని యన బడెను. ఈ జ్ఞప్తి (ఎరుక) లేకుంటే దాని పరిణామ రూపమగు ఏ ఒక్క దానినైన చూడలేము. చలాచల నిర్ణయములు తెలుసుకొనునది ఈ ఎరుకే. సృష్టి యందున్న పదార్థ జాత మంతిటికి ఈ ఎరుకే ఆధారము అధిష్ఠానము అయి వున్నది. ప్రళయమందు ఈ జీవేశ్వర జగత్తు బీజ రూపము దాల్చి ఈ ఎరుక యందు గర్భీకృతమై యుండి, పునః సృష్టి యందు తిరిగి ఆవిర్భావము చెందుతుంది.

ఇదే సంవిత్తు, ఇదే ప్రత్యగ్బ్రహ్మ పరమాత్మలు అసి ఇదే అహం పదార్థము ఇదే, తత్, త్వం, అనే పదార్థములు ఇదే అన్ని. ఇదే ఖండాఖండములు గావుంది. సర్వద్విపుటులు, త్రిపుటులుగా వుంది. భావా భావములు,చేతనము, భౌతిక పదార్థము,సూక్ష్మాతి సూక్ష్మములు ఇదే. ఇట్టి రూపమున జ్ఞప్తి ఎప్పుడు కూడ పరిపూర్ణమున లేనిది. ఉన్నదే పరిపూర్ణమని గురుముఖతః దృఢపరుచుకొనవలయును.

**ఏ తద్వాక్య నిబోధయమ్ గురువాక్యేన లభ్యతే :** అనగా గురు వాక్యము వలననే పరిపూర్ణ బోధ లభించును. కాని ఇతరములు ద్వార కాదు. 20 శ్లో॥ గురువక్త్రే స్థితం బ్రహ్మ ప్రాప్యతే తత్ప్రసాదతః॥ అని గురు గీతగానం చేసింది. వక్త్ర మనగాముఖము లేక నోరు. ఉపదేశ ప్రబోధములు రెండు గురువాక్యము వల్ల పొందబడును. గురు ప్రబోధచేతనే స్వరూపసాక్షాత్కారము శిష్యుడు పొంద గలుగుచున్నాడు. అయితే నరుని నోట యెంగిలి గాని దొక్క పరిపూర్ణపరబ్రహ్మ మొక్కటే. "యతో వాచో నివర్తంతే అప్రాప్యమనసా సాహా" అని "నచక్షుర్గచ్ఛతి, నవాగ్గచ్ఛతినో మనః" అని శ్రుతులు కూడ చెప్పుచున్నవి. అట్టి తెలియరాని పరిపూర్ణపరబ్రహ్మమును గురుమూర్తి ద్వారనే తెలియవలసియున్నది. శ్లో॥ "స్వయం బ్రహ్మమయో భూత్వతత్వరంచావలోకయేత్" – గురుగీత. అనగా శిష్యుడు బ్రహ్మమయుడై దాని కతీతమగు పరిపూర్ణపరబ్రహ్మను అవలోకనము చేయుమంటుంది. ఇట్లవలోకనమును గావించుటకు

గురువు అవసరము. "గురోన్ముఖేన జ్ఞాతవ్యం నాన్యథా(గంధ కోటిభిః" అనగా ఆ పరిపూర్ణ పర(బహ్మము గురువాక్యము చేతనే తెలియబడవలెను గాని, కోటి (గంథముల చేత కూడ తెలియబడదు. వాగ్వైఖరీ, శబ్దఝురీ శాస్త్ర వాఖ్యాన కౌశలం యిత్యాదులన్నీ (బహ్మమును చూయించు పట్ల నిరర్థకములే. పరిపూర్ణము, ఎరుకను రెంటిని వస్తునిశ్చయ రూపముగా చూపగల్గిన వాడు గురువే. కనుక పరిపూర్ణబోధను గురుపరంపరా (ప్రాప్తమగు పూర్ణగురువుల నుండి (గహించవలసి యున్నది. కావున గురు వాక్యము వలననే గురు బోధ లభ్యమగును.

గీ॥ గురువులేక విద్య గుర్తుగా దొరకదు
నృపతిలేక భూమి తృప్తి గాదు
గురువు విద్యలేక గురుతర ద్విజుడౌనె ॥వి॥

అని వేమన చక్కగా గానము చేసియున్నారు.

**39. ఏ తచ్ఛ్రవణమాత్రేణ విద్యేవిద్యాచ నశ్యతః**
**(బహ్మచారీ గృహస్థోహవాన(ప్రస్థోయతిస్తువా॥**

దీనిని (ఆ పరిపూర్ణ పరబాహ్యపు సూచన పరిపూర్ణ గురువుచే) విన్నంత మాత్రముననే విద్యే (జ్ఞానము) అవిద్య (అజ్ఞానము) నశించును. (బహ్మచారి గాని, గృహస్తుడు గాని, వాన (ప్రస్థతుడు గాని,యతి అనగా సన్యాసిగాని తిరిగిజన్మ నెరుగడు. అనగా వారికి జన్మరాహిత్యమగును.

**వివరములు :- ఏ తచ్ఛ్రవణ మాత్రేణ విద్యే విద్యాచ నశ్యతః :** దీనిని అనగా ఈ అనంతోపనిషత్‌ను విన్నంత మాత్రముననే అనగా పరిపూర్ణ గురువుచే విని కన్నంత మాత్రముననే విద్యావిద్యలు నశించునని జెప్పబడినవి. విద్యయనగా "విద్" అను సంస్కృత ధాతువు నుండి వ్యుత్పత్తి యైనది. విద్ అనగా తెలియుట. కనుక విద్య యనగా తెలియ వలసినదని అర్థము. విద్యయనగా జ్ఞానము, వేదశాస్త్రములు, అవిద్య యనగా అజ్ఞానము అహంకారాభిమానములు. విద్యవలన కలుగునవి స్వర్గాదిమోక్ష పదవులు. అవిద్యవలన కామ్య కర్మాచరణ, యజ్ఞ తపః (క్రియలు. వీని వలన కామ్యసిద్ధి స్వర్గనరకాది లోకములు సంభవించును. ఈ సర్వమునకు ఎరుకే కారణము. ఎరుక నిర్మితమగు సర్వశాస్త్రములు కర్మ రూప యోగ యోగాంగ పద్ధతులు సర్వము శాశ్వత ఫల (ప్రాప్తినే కలిగించును. స్వప్నము నందు తాను నవఖండ మండలాధి పతి యైనట్లు, గజారోహణ గావించి ఊరేగునట్లు గోదాన భూదానది దానములు చేయు చున్నట్లుల కల కలుగును. కల గనుచుండగ మెలుకువ వచ్చిన యెడల తాను తన సైన్యము యేనుగులు గుఱ్ఱాలు యెచటికి పోయెనో తెలియనట్లుగా అచల పరిపూర్ణము దాని యందు మూలం లేక దానినంటక యున్న మహాకాశమగు పత్యక్ష పూర్ణమగు అఖండ యెరుకను తెలుసుకొన్న వారికి విద్యా విద్యోపాధి రహితమగునని సిద్ధాంతము.

**గృహస్థాశ్రమము :** ధర్మ అర్థకామ మోక్షములను చతుర్విధపురుషార్థములలో ధర్మ అర్థకామములు మూడున్ను భార్యవలనే భర్తకు (ప్రాప్తించును. కార్యేషు మం(త్రి కరుణేషు దాసి అనిచెప్పబడినట్లు ధర్మపత్నికి ఆరు లక్షణములు జెప్పబడినవి. దాసివలె, మం(త్రివలె, భర్త సుఖదుఃఖములందు భూమి వలె నోర్పు కలిగి సహించుట, భోజనము పెట్టుటయందు తల్లివలె (ప్రేమతో పెట్టుట, భర్తను రంభవలె ఆనందపరుచుట, రూపమున లక్ష్మివలె మంగళ (ప్రదముగా నుండు ఆరు లక్షణములు గల భార్యవలన భర్తకు ధర్మ (ప్రవర్తన, న్యాయపద్ధతిగా (ద్రవ్య(ప్రాప్తి కలుగును. కేవల సంతాన (ప్రాప్తికే గాని కామ వృత్తి పూనదు. ఈ విధముగా మొదటి మూడు

పురుషార్థములు లభించుటయేగాక తుదకు పరిపూర్ణ గురువునాశ్రయించి జ్ఞానోదయము కలిగి జనన మరణ భ్రాంతి రహితము అవలీలగా పొందగలరు. కనుక యిందుకు గృహస్థాశ్రమమే మిక్కిలి శ్రేష్ఠమైనది. అయితే బ్రహ్మచర్య గృహస్థ వానప్రస్త, సన్యాసాశ్రమములను శాస్త్రమేల నిర్ణయించినదంటే మిగత మూడు ఆశ్రమ ధర్మములు కూడ గృహస్థాశ్రమము నందు ఇమిడియున్నవి. ఎట్లనగా

**1. బ్రహ్మచర్యము :** అనగా సర్వేంద్రియ వ్యవహారములు ఆధిదైవిక పద్ధతిగాక బ్రహ్మ నిర్ణయ పద్ధతిగా అనగా పరమాత్మ నిర్ణయపద్ధతిగా కర్తృత్వరహిత విధానము తెలసి కర్మ యొనర్చుట. భార్యలేని వానికి పూర్ణముగు కర్మాధికారమే లేదు. కనుక భార్యతో కూడి సకల కర్మలు కర్తృత్వ త్యాగముతో గృహస్థునికే సాధ్యము. బ్రహ్మచర్యమునందే మనస్సుంచి సంసారముచేసిన వాడు సంతాన వంతుడై యున్నా సదాబ్రహ్మచారి అని కీర్తింపదగియుండును.

**2. వానప్రస్థము:** అనగా సంతాన ప్రాప్తి గలిగిన అనంతరము భార్యతో నివసించుచున్నను, ఆమెను మాతృమూర్తిగా చూచుకొనుచు పోషించుట. గృహస్థాశ్రమమునందు ఋతుకాలమందు గాక యితర కాలమందు నిగ్రహము కలిగి యుండి దొరికిన దానితో దేహ పోషణ చేసి కొనుచు నుండినచో గృహమందున్న, వనమందున్న నొక్కటే. అట్లుండుటయే గృహస్థాశ్రమము అంతర్గతమగు వానప్రస్థము.

**3. సన్యాసాశ్రమము :** సర్వసంగమును విడనాడుట సన్యాసము. అంతఃకరణ యందెట్టి సంగము లేకుండినచో బాహ్యావేష, భాషాడంబరములు లేక యుండినను బాధలేదు. అట్టి అంతరంగ సన్యాసము కలిగి యున్నప్పుడు గృహస్థునిగా యుండియు, సన్యసించి నట్లే కాగలదు.

కనుక ఈ మూడు ఆశ్రమ ధర్మములు కూడ గృహస్థుడు పూని యుండవచ్చును. ఆశ్రమములు మార్చివేయ నక్కరలేదు. క్రమశః సోపాన క్రమముగా ఆయాధర్మములను పాటించినచో గృహస్థుడు కృత కృత్యుడు కాగలడు.

**యతిస్తువా :** యతి యనగా సన్యాసి, కామ్యకర్మలను విడిచినవాడు సన్యాసి. ఈ సన్యాసి కూడ ఈ బోధను విన్న యెడల తప్పక అతనికి జన్మరాహిత్యఫలము కలుగును.

**40. తేషాంనవిద్యతే జన్మ ఇతి వేదాంత జర్ఝరః**
**యేమానవః పఠిష్యంతి బాహ్యరూపా భవంతివా ॥**

దీనిని విన్నవారికి పునర్జన్మ లేకుండునని వేదాంతమున ఢంకా భజాయించి చెప్పబడినది. ఏమానవులైన ఈ అనంతోపనిషత్తును పఠించిన బాహ్య బ్రహ్మ స్వరూపులగుదురు అనగా పరిపూర్ణభావజ్ఞు లగుదురని భావము.

**వివరములు :- తేషాం నవిద్యతే జన్మ ఇతి వేదాంత జర్ఝరః**

ముందు శ్లోకముతో ఈశ్లోకమునకు సంబంధము గలదు. ముందుశ్లోకమున చతురాశ్రమ ధర్మములులో నేది పాటించినా, వారు ఈ ఉపనిషత్తు ను విన్న యెడల తిరిగి జన్మ లేకుండ జన్మ రాహిత్య మగునని వేదాంతములందు, తప్పెట మ్రోగించి లేక ఢంకా మ్రోగించి చెప్పినట్లు చెప్పినది.

ప్రపంచమందున్న అన్ని మత సాంప్రదాయముల గమ్యము ఎరుక యొక్క సగుణరూపమో, లేక నిర్గుణ రూపమై యున్నది. ఆకాశము నుండి పడిన వర్షజాలమంతా సముద్రమును చేరునట్లుగా అన్ని మతములు చివరకు ఒకే గమ్యస్థానము చేరునని చెప్పుటలో

విప్రతిపత్తి లేదు. అయితే ఆకాశము నుండి పడిన వర్షము చివరకు సముద్రమునే చేరినను మరల ఎండకు ఆవిరై మేఘములుగా ఏర్పడి వర్షకాలమున మరల వర్ష రూపమున భూమిపై పడుచున్నది. కనుక మతములన్నియు తిరిగి వచ్చు పద్ధతినే సూచించుచున్నవి. అనగా **"పునరపి జననం పునరపి మరణం"** అన్నట్లుగా జనన మరణ ప్రవాహ చక్రముననే తిరుగునట్లు చేయుచున్నవి గాని జన్మ లేకుండ చేయుటలేదు. పూర్ణబోధ మాత్రము జన్మను తిరిగి తీసుకరాని మార్గము అంటే **"తేషాం నవిద్యతేజన్మ"** జన్మలేకుండ చేయును. ఎరుక లేని పరిపూర్ణ బోధవలన గలుగు జన్మరాహిత్యమే మా ఆశయ మనిచెప్పుకొనవచ్చును. కాని కేవల జన్మరాహిత్యము మాత్రం వారికి సిద్ధించదు. కాలి నడకతో మాత్రమే గమ్య స్థానము జేర నెంచువాడు భూమిపై నున్న ఏ ఆనంద ప్రదేశమునకైనను ఎప్పటికో యొకప్పటికి చేర వచ్చునేమో గాని చంద్ర మండలమందలి శాంతి స్థానము నెన్నడు చేరలేడు గదా! అట్లే ఎరుక యందలి ఏ లోకాలైననూ, ఏపదవులైనను పొందనగునేమో కాని ఎరుక లేని పరిపూర్ణమును అవగతము చేసుకొనుటకు ఎరుక లేక సేవించు పూర్ణబోధ విధానము పూనుటయే ఏకైక మార్గము. కనుక యే మార్గమునకైన మార్గమొక్కటేయనరాదు. పరిపూర్ణపరబాహ్యము సర్వలక్షణ విలక్షణమైనది. అందుకు మార్గము కూడ అత్యంత విలక్షణమే, ఆశయము కూడ విలక్షణమే.

అయితే ప్రపంచమున గల సగుణారాధనలతో సహా అన్ని సాధనలకు ఫలశ్రుతి యందు జన్మ రాహిత్యము కూడ ఫలముగా జెప్పబడుచున్నది గదా అని జెప్పవచ్చును-" రోచనార్థ ఫల శ్రుతిః" అని రుచి పుట్టించి సాధకుని సోపాన క్రమముగా ఉత్తరోత్తరాభివృద్ధి మార్గమునకు తీసుకొనిపోవుటయే యా ఫలశ్రుతులు పల్కిన పెద్దల ఆశయముగా గుర్తించవలయును.

షడూర్ములలో శోకమోహములు, మనోధర్మములుగా జెప్పబడినవి. అట్టి మనోరూపమగు వ్యష్టి అంతఃకరణము దానికత్యంత మూలమగు పరా యెరుకయు పరిపూర్ణపరబయలు నందు లేనేలేదని ఆరూఢ పరుచుకొన్న రాజయోగి ఎల్లప్పుడు ఎట్టిపరిస్థితులలోను తన అంతః కరణస్థిమితమును కోల్పోడు. పారమార్థికముగా మానవుడు తన జీవితములో ఆశించదగిన దింకేమికలదు. ఈ మార్గము చేపట్టినందులకిదే ఈ లోకమందు సిద్ధించ గల వుత్తమ ఫలము మరియు అతడట్టి శాంతి సౌఖ్యములు పొందుటయే గాక అతని వల్ల లోకమునకు శ్రేయస్సు చేకూరుతుంది. ఎట్లనగా అతడే నిజమగు స్వార్థ రహితమగు సమిష్టి శ్రేయోదాయక కర్మ చేయడానికి సమర్థుడు. ఏలననగా స్వ + అర్థము = స్వార్థము. తన యొక్క వస్తువు అనగా "నేను" అను వస్తువు నందు సంపూర్ణముగా సమస్తాభిమానములను వదిలినవాడు. ఈ నేనను వస్తువు వ్యష్టి యందు ప్రత్యగాత్మగాను, సమిష్టి యందు పరమాత్మ గాను యున్నది. కనుక పత్యగ్బ్రహ్మైక్య రూపమగు అఖండవుటెరుకయనె వస్తువే స్వార్థము. పరిపూర్ణ పరబయులు నందు ఈ "స్వార్థ" నామధ్యేయమగు అఖండ యెరుక లేనేలేదనె భావం దృఢం అయితేనే గాని వ్యష్టిరూపమగు స్వార్థము పూర్తిగా పోనేపోదు. తన యాత్మ యందలి ప్రేమయే సర్వ వస్తువుయందు ప్రేమాభిమానములు కల్పిస్తూంది అనే భావమునే "ఆత్మ వస్తు కామాయ సర్వం ప్రియం భవతి" అను బృహదారణ్యక శ్రుతి చెప్పుచున్నది. కనుక విశ్వ మానవ కళ్యాణము కొరకు స్వార్థ రహిత కర్మ జరుగవలెనంటే పరిపూర్ణ బోధ యందతడు ఆరూఢత సాధించిన రాజయోగి వలననే కాగలదు. మరియు జనన మరణరహిత రూప మగు పరమపురషార్థ మతడు మాత్రమే సాధించగలడు. జన్మ కారణమగు వస్తువును

వస్తుతః గుర్తెరిగి దానిని పరిపూర్ణ బోధాగ్నిచే రహితము చేసుకొని జన్మరాహిత్యం పొందు విధానము ఈ పూర్ణబోధ స్థితియందే గలదు. తత్ఫలిత మాశించిన వారికెప్పటికైన ఈ మార్గమవలంభించక తప్పదు. ఈ సిద్ధాంతము వేరొక మతం కాదు. వేద సమత్మమైనది. సనాతనమైనది. సర్వసిద్ధాంతములను సమన్వయము చేసుకొన్న అతీత సిద్ధాంతము. హేతువాద యుక్తమై సర్వభ్రాంతి రహితమే ఆశయము గల వారికి శిరోధార్యమైనది.

**యేమానవ పఠిష్యంతి బాహ్యా రూపా భవంతివా :**

ఏ మానవుడైన ఈ ఉపనిషత్తును చదివిన పరిపూర్ణ పరబాహ్యారూపము పొందునని ఫలశ్రుతి చెప్పబడినది. నిజమే. అదెప్పుడు సాధ్య మనగా సాంప్రదాయక పరిపూర్ణ గురువును ఆశ్రయించి ఈవుపనిషదర్థమును అనగా పరిపూర్ణము ఉన్నదని, శాశ్వతమని, లేనెరుక లేనే లేదని క్షుణ్ణంగా తెలుసుకొని లేనెరుకకు పరిపూర్ణ పర్బ్రహ్మమందు నిలుచుటకు స్థానము లేదని ఆరూఢ పరుచుకొని, కర్మ సన్యాసము, కర్మఫల సన్యాసము గాక కర్త ృత్వ రహిత కర్మాచరణముగా కార్యములొనరించిన కర్మఫలము లంటక అశరీరుడై అచల పరిపూర్ణ పరబాహ్య స్వరూపుడు కాగలదు.

**41. నిరాకాశం పరంబాహ్య మచలం పరిశిష్యతే**
**అస్మిన్నర్థే నసందేహో సత్యం సత్యంపునః పునః ॥**

నిరాకాశము అనగా నిరాకారమగు పరిపూర్ణపర్బ్రహ్మమే అచలము. అచల మొక్కటి యే శేషించుచున్నది. ఈ విషయమున ఎంత మాత్రము సందేహము లేదు. ఇదే సత్యము సత్యము అని మళ్ళీ మళ్ళీ దృధమగుటకు చెప్పబడినది.

**వివరములు :- 1. నిరాకాశం పరబాహ్య మచలం పరిశిష్యతే :**

పరిపూర్ణ పర్బ్రహ్మ మందు ఆకాశము కాని ఆత్మ లేక పరమాత్మలేనిది. అదే అచలము. ఆకాశములు ఐదు 1.భూతాకాశము - ఇది శబ్దము గుణము గలది. 2. సూర్యాకాశము - కాలముల నిర్ధేశించును. 3. నిరవయాకాశము - పరాప్రకృతి, సూత్రాత్మ, సమిష్టి ప్రాణమని చెప్పబడును. ఇది దిక్కులను సూచించును. 4. దహరాకాశము - అక్షర పురుషుడని, సమిష్ట్యంతః కరణమని చెప్పబడును. అనగా మనస్సును నిర్ధేశించును. 5. పరాకాశము ఉత్తమ పురుషుడని, స్వయం ప్రకాశమని, చేతన బ్రహ్మమని చెప్పబడును. ఇదియే ఆత్మ - అయితే ఉత్తరగీత యందు.

**శ్లో ॥ ఆకాశోహ్యవకాశశ్చ, ఆకాశ వ్యాపితంచయత్ ।**
**ఆకాశస్యగుణశబ్దో నిశ్శబ్దో బ్రహ్మముచ్చతే॥ 1-50**

ఆకాశమనగా అవకాశరూపము. ఖాళీ ప్రదేశము, స్థలము (Space). నామరూపాత్మక మగు సర్వ జగత్తు నందు సూక్ష్మముగా వ్యాపించి యున్నది. దాని గుణము శబ్దము. బ్రహ్మము నిశ్శబ్దమైయున్నదియని ఈ శ్లోకార్థము

ఈ నిశ్శబ్ద రూపమగు ఆకాశమే పరాకాశము. నిశ్శబ్దమనగా నెట్టిదో తెలుసుకొందము. స + శబ్దము = సశబ్దము అనగా శబ్దముతో కూడినది. నిర్ + శబ్దము = శబ్దముతో కూడనిది. అనగా శబ్దములేనిది. శబ్దముతో కూడుట కూడకపోవుట అను రెండు లక్షణములు ఒకే ఆకాశమున కున్నవి. శబ్దముతో కూడినపుడు భూతాకాశము. శబ్దముతో కూడనపుడు అదే పరాకాశము అనబడుచున్నది. దాని శబ్దము బీజ రూపముగా నున్నది. దానినే పరావాక్కందురు. నిశ్శబ్దమనగా కేవల వరా వాక్కు కూడ లేనిది కాదు. పరాకాశము తాను

తానై యున్న ఆత్మ లేక పర్రబహ్మము కూడ లేనిది. అదే అచలము, వీటి నన్నిటిని ఇది కాదు. ఇదికాదు యని త్రోసి వేసినచో శేషించునది పరిపూర్ణ పర్రబహ్మమే.

**అచలము :** అఖండాత్మ రూపమగు పర్రబహ్మమునకు నిరాకాశమునకు పరంగా విలక్షణముగా నున్నదే అచలము, జీవేశ్వర జగత్తులు మూడున్ను, వాని కధిష్ఠానమగు బ్రహ్మము కూడ చలన రూపములే అయియున్నని. ఈ చలనమంతయు తోచుటకైనను, ఏదో అచలమగు వస్తువుండి తీరవలెను. లేనిచో వాని చలనము గూడ సౌష్టవముగా నుండక అస్తవ్యస్తముగా నుండి యుండును. ఎప్పుడును చలనములేనిది అచలము.

**అస్మిన్నర్థేన సందేహో సత్యం సత్యంపునః పునః**

నిరాకాశమైనదే పరిపూర్ణపరబాహ్యమని పై వివరముల బట్టి తెలుసుకొన్నాము. ఇంకా కొంత వివరముగా తెలుసుకొన్న సందేహము లేకుండ పోవును. పరిపూర్ణమందు ఏమిలేదు.ఆ పరిపూర్ణమునకు ఆది మధ్యాంతములు లేవు. సూదికొనమోపుటకైనను తావులేక నిండి నిబిడీకృతమై యున్నది. దాని యందు జ్ఞానము గాని, కర్మచేయుటకు వలయు ప్రాణ శక్తిగాని, యింద్రియములు గాని, వానిని నడిపించు అధిష్ఠాన దేవతలుగాని అన్యమేమియు లేదు. "నిశ్శక్తిః నిర్మలం పూర్ణం" దాని యందు ప్రాణ శక్తిగాని గుర్తెరిగే తెలివి గాని లేదు. వేయేల దాని యందు యితరము ఏమి లేదు. దానికి ఆవరణ లేదు. కేవలం ఆద్యంతములు లేనిది. అది తప్ప రెండవది లేదు. అన్యమైనది ఏది తోచిన అది ఎండమావుల వలె సురస్వప్నమువలె లేనిదేయగును. కనుక సృష్టి కారణమైన వస్తువు సృష్టిగా మారినది. కనుక ఈ కార్యకారణములు రెండు ఎండమావుల వలె తోచుటే గాని నిజముగా లేనే లేవు. ఎవరికి తోచినదో వారే లేరు. కనుక యింద్రియ గోచరమగు సమస్తము శుద్ధ మనస్సున గోచరించు బ్రహ్మ వస్తువు లేనే లేదు.

కారణ రూపమగు బ్రహ్మమునకు (అఖండయెరుకకు) మరి యొక కారణము గాని లేనే లేవు. పృథ్వి వాయువ్వాది పంచ భూతములకు ఆత్మరూపమగు బ్రహ్మము కార్య కారణ సంబంధములతో మహా కారణముగానున్నది. దానికి కారణము ఎంత వెదికిన కాన రాదు కారణము లేని కార్యము ఉండుట అసంభవము కూడ. కనుక సృష్టి కారణమగు బ్రహ్మమునక పరిపూర్ణమందు ఉనికి లేదు. ఎండ మావులలో జలమున్నట్లే కాన వచ్చిన అక్కడ నిజముగ నీరు లేదు. అట్లే ఈ గుర్తెరిగే శరీరమునకు 'ఆకాశ శ్శరీరంబ్రహ్మ' అని చెప్పబడినట్ల మనకు గోచరించు మహాకాశమే శరీరముగానున్నది. ఈ దేహిదేహములు రెండు ఒకదాని కొకటి విడువక రెండు కలసి ఏకవస్తువుగా నున్నది. దీనికి పరిపూర్ణమందు స్థానముగాని మూలముగాని ఏమిలేదని నిశ్చయము. ఈ విషయమున సందేహము వలదు. ఇది సత్యమ సత్యమని మళ్ళీ మళ్ళీ చెప్పబడనది.

ఓం శాంతి శాంతి శ్శాంతిః

మహబూబ్‌నగరము జిల్లా నవాబుపేట మండలము, ఇప్పటూరి గ్రామ వాస్తవ్యుడ కురువిణశెట్టి వంశజులు సిద్ధాంతముని మెణసు గోత్రీకులు కీ॥శే॥ మంత చిన్నమ్మ ఎల్లప్ప పుణ్యదంపతుల ద్వితీయ పుత్రుడు శ్రీ మదచల ఋషి ప్రబోధానంద వెంకటరెడ్డి దేశిక ప్రభువు ప్రియశిష్యుడైన మంతచిన్నయ్యచే అనువాదముగావించబడి వివరములు పొందుపరచి, అనన్తోపనిషత్తు సర్వము సమాప్తము.

పరిపూర్ణానంద నరసింహార్యపాదకమల సేవకం<br>ప్రబోధానంద వెంకటార్య సద్గురుంభజామ్యహం॥

ఇతి సర్వం సద్గురు చరణార విందార్పణమస్తు.

## తత్త్వము

### (హిందుస్థానీ - తోడిరాగం - ఆదితాళం)

సత్యధర్మము చాటెను సద్గురుడూ। సంతసమున చేరుముచరణములన్ ॥స॥

1) కరుణారసపూరిత దృక్కులను। కురిపించును ధన్యుడ వయ్యెదవూ
నారాయణుడైయల సూర్యునకు దరిజూపిన దాతని మరువకుమా ॥స॥

2) తనువును స్థిరమని నమ్మితివా। తనువెప్పుడొ తరలును కాటికిరా
దశదశలుగ మారిన యాతనువే। దహనంబుకు దారిని తీయునుర ॥స॥

3) ఎవరికి వారే యెరుగుమురా। భువి నెవ్వరు వెంటనురారుగదా
నీ దేహము నీతో రానపుడు। నీ కెందుకు మోహంబితరులపై ॥స॥

4) దేహాదులు మిథ్యని యెరిగితివా। అహమందున ప్రేమను పెంచితివా
గహనంబగు అచలము కొంచమురా। అహమున్న దొలేదో చూడుమురా ॥స॥

5) కలలోపల గనబడు కాంతలను। కలమేల్కొని చూచిన కల్లయెరా
తలపోయగ తలపుల కందనియా। బైలందున ఎరుకయె లేదనరా ॥స॥

6) ఎరుక జగము లస్థిరములురా। పరిపూర్ణము శాశ్వత మనుకోరా
ఇరుతెరగుల నెరిగిన యాయెరుకన్। గురుమూర్తికి నొసగుము దక్షిణగా ॥స॥

7) అరువుగ నొసగిన యెరుకతొరా అశరీరపు నడకతొ మెలగుమురా
పదమెచ్చట నిడుదువొ నదియగురా। భద్రాచల క్షేత్రం బరయుమురా ॥స॥

8) పాటల పండరి నాథువలెన్। దిటవుగ గురుదరి చేరుమురా
నిటలాక్షుడు రాజేశ్వర గురుడూ - నీ। కేటికి భయమిక వదలుమురా ॥స॥

ఓం సద్గురు వేనము :

## తత్త్వము (1)

1) పలుకనన్నా పలుక వేమయ్యా ఓ గురునారసింహ్మాం పలుకనన్నా పలుకవేమయ

2) పలుకనన్నా పలుకావేమి -అలుకనా, నామీదానీకు పలుకు పలుకూననుచూ
బలుక-నిలుకడాజేసీతి వేలా ॥ప॥

3) ప్రొద్దునానిద్దూరాలేచి - ముద్దుగామీపదములు మ్రొక్కి
సుద్దులూ వినమదిదలచీతే - రద్దు శాయాన్యాయామౌనా ॥ప॥

4) తల్లిదండ్రీవనుచూచాలా - యుల్లమందూదలచీ నచలా
కీలుసులభము గనుగొనువేళా - బాసిపోవు భాగ్యమిదేలా

5) నీ మహాసద్బోధాపఠనా - నెమ్మదిదృఢమ తిగలుగుటకై
ప్రేమ నాలుగు సేవలు సలుప - తన్మయూడనైతివదేలా ॥ప॥

6) ద్వాదశీవందనమునుజేయ - ద్వాదశీదయజేసితిరయ్యా
ద్వాదశార్థరహస్యము దెలుపుచు - ద్వాదశీతమరై తిరదేలా ॥ప॥

7) శోడషోపచారమునలుప - శోడశీమది నిలిపితిరయ్యా
[illegible] ॥ప॥



అ.ప. పురం నర్సింహ్మలు

తద్ధర్మపత్ని

అ.ప. వెంకటమ్మ



అ.ప. తుపాకుల జంగయ్య

తద్ధర్మపత్ని

అ.ప. యాదమ్మ



బసరు గోత్రోద్భవులైన శ్రీ టంకశాల చంద్రప్ప

తద్ధర్మపత్ని

శ్రీమతి గౌరమ్మ



అ.ప. విభూతి రాములు

తద్ధర్మపత్ని

అ.ప. లక్ష్మి



## నీలద్వంద్వముని బిళె గోత్రోద్భవులైన పుట్ల పుల్లయ్య

Accounts Officer, APSEB.

తద్ధర్మపత్ని

**శ్రీమతి పుట్ల శివలీల**

## కీర్తన

1. నాపాలి శ్రీగురు నన్నేలరావా। ఆపాదలను దీర్చి కాపాడలేవా ॥నా॥
2. ఎంత నినువేడిన యేమానమేమి। పంతామనామీద పల్కావదేమి ॥నా॥
3. గొప్ప రోగము బాధ చెప్పలేనయ్యా। తిప్పలున్నవి చాలా తప్పించవయ్యా ॥నా॥
4. దిక్కు నీవేగతి దీనూడనన్నా। యెక్కాడవెదకిన యెవరులేరన్నా ॥నా॥
5. కోపామనాపైన తాపమస్వామి। దాపుజేరినవాడ దయరాదిదేమి ॥నా॥
6. పరిపారి విధముల ప్రార్థించుచుంటి। కరుగాద నీమనసు కఠినమేమంటి ॥నా॥
7. నిష్టతో నినుదలతు నియము నాతండ్రి। భ్రష్టానష్టంబుల భయము మాన్పండీ॥నా॥
8. అందమౌనీధ్యాన మందుంటినప్పా। మందు తినితిని విసుగుజెందితీనప్పా ॥నా॥
9. చిక్కే మీ చరణములు శ్రీవేంకటేశ। దక్కీతి భవనాశ దండవినాశ ॥నా॥
10. వసుధ మఖ్తల గ్రామా వాసూడనంటి। దోసీలొగ్గితి హనుమద్దాసునేలంటి ॥నా॥

జై సద్గురు మహరాజ్‌కి జై